సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.



సచిత్రవారపత్రిక
Founder : K. NAGESWARA RAO

సంపుటము 31
సంచిక 35
1-5-57

హేవిళంబి వైశాఖ శుద్ధ ద్వితీయ బుధవారం

## విషయసూచిక

ముఖచిత్రం: సారథీవారి "పెద్దరికాలు" లో అంజలీదేవి.



పాఠకులకు మనవి.

---

గత వారం ముఖచిత్రం నీలిశార్ధ, గిరిజ అని గమనించ ప్రార్థన.

# ఆటంబాంబులు అగ్రరాజ్యాలు

అణ్వస్త్రాలుంటేగాని అగ్రరాజ్యమనిపించుకోదనే భావం క్రమంగా ప్రబలమవుతోంది. మొదట అమెరికా, తరువాత రష్యా, ఇప్పుడు బ్రిటన్ పై నిర్వచనం ప్రకారం అగ్రరాజ్యాలైనాయి. ముందు ముందు ఫ్రాన్సు కూడా అణ్వస్త్రాలు తయారు చేయడానికి ఆలోచిస్తోంది. ఇక ముందు జరగబోయే యుద్ధాలు అణ్వస్త్రాలతోనే జరుగుతాయనీ, అందుచేత కాల్బలానికీ, నౌకాబలానికీ ప్రాముఖ్యం తగ్గిపోతుందనీ అగ్రరాజ్యాలు అభిప్రాయపడుతున్నాయి. అటు కోట్లకొలది ధనం ఖర్చుచేసి అణ్వస్త్రాలను తయారుచేస్తూ, ఇటు భారీ ఎత్తున సైన్యాలను కూడా సిద్ధంగా ఉంచుకోవడం ఏ అగ్రరాజ్యానికీ సాధ్యంకాని పరిస్థితి ఏర్పడింది. రష్యా ఇటీవల తన సైన్యంలో కొంత భాగాన్ని తగ్గించివేస్తున్నానని ప్రకటించడానికి ఇదొక కారణమై ఉండవచ్చు. కేవలం ఈ కారణంవల్లనే తమ సైన్యాన్ని అంచెలంచెలుగా తగ్గించివేస్తున్నామనీ, సాధారణ సైన్యాన్ని తగ్గించుకుని, అణ్వస్త్రాలను పెంపొందించుకుంటామనీ బ్రిటిష్ ప్రభుత్వం ఈమధ్య బాహాటంగా ప్రకటించింది. బెర్ముడా సమావేశం ఫలితంగా, బ్రిటనుకు 1500 మైళ్ళ దూరం పోగల 'గైడెడ్ మిసిలి' ఆయుధాలను కూడా సప్లయిచేయడానికి అమెరికా అంగీకరించింది. అంతేకాక అణ్వస్త్రాలతో కూడిన 'గైడెడ్ మిసిలీల' ను నార్వే, డెన్మార్కు మొదలైన ఉత్తర అట్లాంటిక్ రాజ్యాలలోని తన స్థావరాలలో ప్రవేశపెట్టాలని అమెరికా ఆలోచిస్తోంది.

## రష్యా హెచ్చరిక

దీనికి ప్రతిక్రియగా రష్యా తూర్పు యూరప్ రాజ్యాలలో అణ్వస్త్ర స్థావరాలను ఏర్పరచుకుంటోందని వార్తలు వస్తున్నాయి. అమెరికాకు తమ తమ దేశాలలో అణ్వస్త్రస్థావరాలను ఇవ్వడంమూలంగా, కొరవితో తలగోక్కుంటున్నారని ఆయా ఉత్తర అట్లాంటిక్ ప్రభుత్వాలను, జపానును రష్యా హెచ్చరించింది. ముఖ్యంగా జర్మనీ అణుయుద్ధానికి రంగస్థలమై సర్వనాశనమైపోతుందని రష్యన్ నాయకులు హెచ్చరించారు.

ఇదంతా చూస్తుంటే, యుద్ధం అనివార్యమేననే భావంతో ఉభయపక్షాలూ వ్యవహరిస్తున్నట్లు తోస్తుంది. యుద్ధం అనివార్యమైనపక్షంలో, అణ్వస్త్రాల ప్రయోగం కూడా అంతే అనివార్యమవుతుంది. అణ్వస్త్రాల ప్రయోగం వలన కేవలం ఉభయుల సైన్యాలే కాకుండా సామాన్య ప్రజలుకూడా ధ్వంసమైపోతారు. అలా జరగకుండా, ఇప్పుడు కొత్తగా కనిపెట్టబడిన 'గైడెడ్ మిసిలీల' మూలంగా అణ్వస్త్రాలను కావలసిన చోటికి ప్రయోగించే అవకాశం వచ్చింది. ఈ మిసిలీ ఆయుధాలను ఒక దేశంనుంచి మరో దేశానికే కాక, ఒక ఖండంనుంచి మరో ఖండానికికూడా ప్రయోగింప వీలవుతుందట. 5 వేల మైళ్ళ దూరం పోగల ఆయుధాలను అమెరికన్లు తయారుచేసినట్లు చెబుతున్నారు. ఇవి తమ ఒక్కరివద్దనేఉన్నట్లు కూడా అమెరికన్లుచెబుతున్నారు. ఇది నిజం కావచ్చు. కాని ఆటంబాంబు, హైడ్రోజన్‌బాంబు, చిన్నరకం మిసిలీ తయారుచేసిన రష్యా, ఈ పెద్దరకం వాటిని మాత్రం తయారుచేయలేదని సంతృప్తిపడడం హాస్యాస్పదం.

## అణ్వస్త్రాల పరీక్షలు

ఈవిధంగా ఈ ఆయుధాలపోటీ అనంతంగా సాగిపోతూ ప్రపంచ ప్రజలను భీతావహంలో ముంచెత్తుతోంది. ఆయుధాలను భారీఎత్తున తయారుచేసే ముందు, ఒక్కొక్కరకం ఆయుధాన్నే ప్రేల్చి పరీక్షించడం ఈ అగ్రరాజ్యాలకు ఆనవాయితీ అయిపోయింది. కొంతకాలంక్రితం అమెరికా హైడ్రోజన్‌బాంబు పరీక్షలు జరిపింది. ఇటీవల ఏప్రిల్ నెలలోనే రష్యాలో అనేక



హైదరాబాదు 'ఆంధ్ర పత్రిక కార్యాలయం' లో దేశోద్ధారక వర్ధంతి సభ. శ్రీ సంజీవరెడ్డి ప్రసంగిస్తున్నారు. ప్రధాన న్యాయమూర్తి శ్రీ కోకా సుబ్బారావు, సభాపతి శ్రీ కాశీశ్వరరావు, శ్రీ సంజీవరెడ్డి, ఆంధ్రపితామహ శ్రీ మాడపాటి హనుమంతరావు, ఆంధ్రపత్రిక సహాయ సంపాదకుడు శ్రీ పండితారాధ్యుల నాగేశ్వరరావు, శ్రీ బ్రహ్మానందరెడ్డి, శ్రీ కళా వెంకటరావు, శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు, శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు, న్యా॥ శ్రీ పెన్మెత్స సత్యనారాయణరాజు, శ్రీ కోదాటి నారాయణరావు, రాజలింగం ప్రభృతులు. (ఫోటోగ్రాఫ్ స్టూడియో.)

# ఆటంబాంబులు

అణ్వస్త్రాల పరీక్షలు వరసగా జరిగాయి. త్వరలో బ్రిటన్ పసిఫిక్ మహాసముద్రంలోని క్రిస్టమస్ దీవులలో హైడ్రోజన్ బాంబును పరీక్షించబోతోంది.

ఈపరీక్షల ఫలితంగా ప్రపంచ వాతావరణమంతా విషకలుషితమైపోతోంది. అణుధూళితో విషాక్తమైన పదార్థాలను తినడం వలన, ఇంకా అనేక విధాలుగాను ప్రజల శారీరకతత్వంలో ఘోరమైన పరిణామాలు కలుగుతాయని, అంగవైకల్యంలాంటి దుష్ఫలితాలు వంశపారంపర్యంగా కొనసాగి మానవజాతి మనుగడకే ముప్పు రావచ్చుననీ ప్రముఖ శాస్త్రజ్ఞులందరూ చెబుతున్నారు. స్ట్రాన్షియమ్ అనే ధాతుపదార్థం కలసిన మూడు చదరపుటంగుళాల ఆహారాన్ని తిన్నా, 250 ఘనపుటడుగుల నీరుత్రాగినా మనిషి ప్రమాదానికి లోనవుతాడని శాస్త్రజ్ఞులు అంచనావేశారు. మనిషిశరీరతత్వంలో మార్పులు తేదగినంత అణువిషం ఈపాటికే ఎన్ని దేశాలలో వ్యాపించిందో చెప్పడం కష్టం. అణువిషం తాలూకు ఫలితాలు వెంటనే కనిపించవు. నెమ్మది నెమ్మదిగా మార్పులు సంభవిస్తాయట.

యుద్ధంవస్తుందో రాదో, వస్తే అణ్వస్త్రాలు ప్రయోగింపబడతాయో లేదో అనే సమస్యకంటే, అణ్వస్త్రాల పరీక్షలమూలంగా ఏర్పడుతున్న దుష్ఫలితాల భయమే ఇప్పుడు తీవ్రంగా ఉన్నది. ప్రముఖశాస్త్రజ్ఞులందరూ ఈ పరీక్షలమూలంగా హాని ఉందని స్పష్టంగా చెబుతుండగా, అగ్రరాజ్యప్రభుత్వాలు మాత్రమే 'మరేం ఫరవాలేదని భరవసా ఇస్తున్నాయి. ఇది అతి దారుణమైన పరిస్థితి.

## నెహ్రూ సవాలు

అణ్వస్త్ర పరీక్షలు జరిపి ప్రపంచ ప్రజల క్షేమానికి భంగంకలిగించే హక్కు అగ్రరాజ్యాలకెవరిచ్చారు? అసలీ పరీక్షలు అంతర్జాతీయ న్యాయసూత్రాలకు, నైతిక సూత్రాలకు, విరుద్ధం అవునా కాదా? అని భారత ప్రధాని నెహ్రూ ఇటీవల న్యూఢిల్లీలో జరిగిన ఆసియా న్యాయశాస్త్ర నిపుణుల సభలో సవాలుచేశారు. ఈ విషయం పరిశీలించండని వారిని కోరారు.

అణ్వస్త్రపరీక్షల మూలంగా, ప్రత్యక్షబాధ అనుభవిస్తున్న దేశం జపాను. మూడేళ్ల క్రితం అమెరికా బికినీవద్ద జరిపిన పరీక్షల ఫలితంగా జపాను చాలా నష్టపడింది. ఇటీవల రష్యా జరిపిన పరీక్షలవలన జపానులో వాతావరణమంతా కలుషితమవుతోందని ప్రభుత్వమూ, ప్రజలూ, శాస్త్రజ్ఞులూ ఏక కంఠంతో ఘోషపెడుతున్నారు. క్రిస్టమస్ దీవులవద్ద పరీక్షలమూలాన పరిస్థితి ఇంకా భయానకమవుతుందని భయపడుతున్నారు. ఇలాంటి పరీక్షలు విరమించాలని, బ్రిటన్, అమెరికా, రష్యాదేశాలకు జపానీస్ ప్రభుత్వం విజ్ఞప్తులపైవిజ్ఞప్తులుచేసింది. ఈవిజ్ఞప్తులు అరణ్యరోదనమైనాయి. అమెరికన్ అణ్వస్త్రాలకు స్థావరమీయవద్దని తాను చేసిన విజ్ఞప్తిని జపాను తిరస్కరించినందుకు ప్రతిక్రియగా రష్యా జపాను విజ్ఞప్తిని తిరస్కరించింది. తమ దేశరక్షణకు అణ్వాయుధాలత్యవసరమని, అందుచేత పరీక్షలను విరమించేదిలేదని బ్రిటన్ ఖరారుగా చెప్పివేసింది. అమెరికా కూడా అణ్వస్త్రపరీక్షల విరమణకు సుముఖంగా లేదు.

## తాత్కాలిక విరమణ

రష్యా తనంతటతానుగా ఈ పరీక్షలను విరమించడానికి సిద్ధంగా లేనప్పటికీ, అమెరికా బ్రిటన్‌లు కూడా అంగీకరించిన పక్షంలో తాను విరమించగలనని స్పష్టం చేసింది. కనీసం తాత్కాలికంగానైనా విరమించుదామని రష్యా అమెరికా బ్రిటన్‌లకు విజ్ఞప్తి చేసింది. కాని ఆ రెండు దేశాలూ ఈ విజ్ఞప్తిని పెడచెవి పెట్టాయి. 'మాంచెస్టర్ గార్డియన్'లో పడిన ఒకవార్త ప్రకారం రష్యా ఇప్పుడు అణ్వస్త్ర పరీక్షలను తనంతటతానే బేషరతుగా, తాత్కాలికంగా విరమించవచ్చునని తెలుస్తోంది. ఇదే జరిగితే, క్రిస్టమస్ దీవులవద్ద ప్రపంచాభిప్రాయానికి వ్యతిరేకంగా పరీక్షలు సాగింపదలచిన బ్రిటను ఇరుకున పడినట్లవుతుంది. అయినప్పటికీ బ్రిటన్, అమెరికాలు తాత్కాలిక విరమణకు కూడా అంగీకరించే సూచనలేవీ కనుపించడం లేదు.

## కుంటిసాకులు

అణ్వస్త్ర పరీక్షల నిలుపుదలకు తాము సుముఖంగా లేకపోవడానికి పశ్చిమరాజ్యాలు ఒకటే కారణం బయటికి చెబుతున్నాయి. అణ్వస్త్రాలను ఎవరికీ తెలియకుండా పరీక్షచేయదలచుకుంటే చేయడానికి వీలున్నదట. అలావీలున్నదని తమ అణుశాస్త్రనిపుణులందరూ చెబుతున్నారని బ్రిటిష్ ప్రధాని మాక్మిలన్ ఈమధ్య ప్రకటించారు. అందుచేత ఒకవేళ తాము పరీక్షలనిలుపుదలకు ఒడంబడినప్పటికీ రష్యా చాటుగా పరీక్షలు సాగిస్తే తాము అణ్వస్త్రాభివృద్ధిలో వెనక పడిపోమా అని మాక్మిలన్ ప్రశ్నిస్తున్నారు. దీనికి సమాధానంగా రష్యన్ రక్షణ శాఖ మంత్రి మార్షల్ ఝుకోవ్, ఆకాశంలోగాని, భూమిమీద గాని, భూగర్భంలో గాని ఎక్కడ ఎంత జాగ్రత్తగా అణ్వాయుధాలను ప్రేల్చినప్పటికీ కనిపెట్టగల సాధనాలు తమవద్ద ఉన్నాయని వెల్లడించారు. ఇంతేకాకుండా అణ్వస్త్రాలను చాటుగా ప్రేల్చడం అసంభవమని ప్రభుత్వాలతో సంబంధంలేని శాస్త్రజ్ఞులుకూడా చెబుతున్నారు. అసలు ఇప్పటికే రష్యాలో అణ్వాయుధాలు ప్రేల్చినప్పుడల్లా అమెరికా, బ్రిటన్, జపాన్ మొదలైన దేశాలు ఎప్పటికప్పుడు ఆ సంగతి కనిపెట్టి ప్రకటిస్తున్నాయి. పైగా శాస్త్ర విజ్ఞానమంతా ఉపయోగించి అణ్వస్త్రాలు కనిపెటిన శాస్త్రజ్ఞులు వాటి ప్రేల్పు కనిపెట్టే సాధనాలు తయారు చెయ్యలేకపోరు. చాటుగా ప్రేలిస్తే ఏమి చేయగలమనేది కేవలం సాకుమాత్రమే.

భారత ప్రభుత్వమూ, ప్రజలూ అదినుంచీ అణ్వస్త్రాలను నిషేధించాలనీ, వాటిపరీక్షలను తక్షణం నిలిపివేయాలని ఘోష పెడుతున్నారు. ఈ ఘోష కేవలం వ్యర్థఘోష కాలేదనీ, క్రమంగా ఒక్కొక్కరే దానిలోని సత్యం గ్రహిస్తున్నారనీ అనడానికి అనేక నిదర్శనాలు కనిపిస్తున్నాయి. బ్రిటిష్ లేబర్‌పార్టీ అణ్వస్త్ర పరీక్షలను ఆపివేయాలంటూ తీర్మానం చేసింది. పశ్చిమ జర్మనీలోని ప్రముఖ అణుశాస్త్రజ్ఞులనేకులు తాము అణ్వస్త్ర నిర్మాణకార్యంలో తమ ప్రభుత్వంతో సహకరించబోమని స్పష్టంచేశారు. జపాన్ ప్రభుత్వం యీ పరీక్షల నిలుపుదల సమస్యను, ప్రపంచ న్యాయస్థానానికి నివేదించాలని, ఐక్యరాజ్య సమితి సర్వసభ్య సమావేశంలో చర్చచేయించాలని ఆలోచిస్తున్నది.

సమితి సర్వసభ్య సమావేశంలో జపాను మిగతా ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా, కొన్ని యూరప్ దేశాలను కూడగట్టుకొని అణుపరీక్షల నిలుపుదల తీర్మానాన్ని నెగ్గించగలిగితే అది శాంతికాముకులందరికీ ఘనవిజయమవుతుంది. ఇలా సమితి సభ్యుల్లో ఎక్కువమందిని కూడ గట్టుకుని రాగల మహదవకాశం ఒక్క జపానుకే ఉన్నది. అమెరికాను కాదని ఇలా వ్యవహరించడం జపానుకు కష్టసాధ్యం కావచ్చును. కాని కనీసం తీవ్ర ప్రయత్నమైనా చేస్తే ముఖ్యంగా ఆసియా, ఆఫ్రికా ప్రజలకు జపానుపై సానుభూతి పెంపొందుతుంది. అలా ప్రయత్నం చేయని పక్షంలో పరీక్షలను నిలుపు చేయించాలని ఇప్పుడు జపాను చేస్తున్న ప్రయత్నాలన్నీ కేవలం ప్రచారార్థమేననికూడా భ్రమ ఏర్పడగలదు.

సమితిచేత అటువంటి తీర్మానం చేయించినప్పుడు, అతీర్మానాన్ని త్రోసిరాజని వ్యవహరించే అగ్రరాజ్యాలు తమనైతిక ప్రతిష్ఠను, నాయకత్వాన్ని పూర్తిగా కోల్పోయినవవుతాయి.

ఏ దుర్ముహూర్తాన పరమాణు విచ్ఛేదం జరిగిందోగాని, జరిగిననాటినుంచి నేటిదాకా ఇది ప్రపంచ ప్రజలను భయోత్పాతంలో ముంచెత్తుతూనే ఉంది. మానవ శ్రేయస్సుకు ఉపయోగ పడవలసిన కోట్లకొలది ధన సంపద మానవ విధ్వంస ప్రయత్నాలకు వినియోగమవుతోంది. మానవునికి కావలసినవి అన్న వస్త్రాలా, అణ్వస్త్రాలా, తేల్చుకోవలసిన సమయం ఆసన్నమైంది.



# అనుకోని ముచ్చట

కె. యస్. సువర్ణ

“అన్నయ్యా! ఏం ఈవాళ ఇంత ఆలస్యం చేశావేం? నేనేమి ఇక్కడ ఒంటిగా ఎంతసేపని ఉండాలి” అని ఏమేమో అంటూ తలుపు తెరిచింది సుశీ. తలుపు తెరచిన తరువాత అన్నయ్యతో కూడా ఒక వ్యక్తి ఉండటం చూసి నాలుక కరచుకొంది. ఆ వచ్చిన వ్యక్తీ, అన్నయ్యా ఏదో నవ్వుకుంటూ లోపల కడుగుపెట్టారు. అన్నయ్య తన గదిలోనికి తీసుకపోయాడు అతిథిని.

“అబ్బ! ఎవరతను? ఎంత అందంగా ఉన్నాడు! ఆ చిరునవ్వు ఎంత ఆహ్లాదంగా ఉంది!” అని ఏదో ఆలోచించుకుంటూ సుశీ అక్కడే సోఫాలో కూర్చుండి పోయింది. ఇంతలో “బాబుగారు, కాఫీ మిమ్మల్ని తెమ్మని చెప్పారమ్మగారూ” అని వంటమనిషి సుబ్బమ్మ ట్రే అక్కడ ఉంచేసి వెళ్లిపోయింది. ఏదో తెలియని ఆనందం సుశీ హృదయాన్ని ఆవరించేసింది. ట్రే తీసుకొని మెల్లగా అన్నయ్య గదివద్దకు చేరింది. అన్నయ్యా, అతని మిత్రుడు ఏదో మాట్లాడుకుంటూ నవ్వుకుంటున్నారు. సుశీల గదిలో కడుగుపెట్టేసరికి ఎందుకో ఏమో సిగ్గు ఒక్కసారిగా ముంచుకొచ్చింది. తలుపు వద్దనే ఆగిపోయింది. వళ్లంతా ఎందుకో చెమటపోసింది.

“రా సుశీ! వీడు మెడ్రాస్‌లో నా క్లాసు మేటు. పేరు చంద్రం. ఈమె మా సిస్టర్ సుశీ, చంద్రం” అంటూ సత్యం పరిచయం చేశాడు ఒకర్నొకరికి.

“నమస్కారమండి సుశీలగారూ” అన్నాడు చంద్రం చిరునవ్వుతో.

“చంద్రం! ఆహా! ఎంతబాగుంది పేరు. ఆ చిరునవ్వెంత చక్కగా ఉంది” అని అను కోవటంలో ప్రతినమస్కారం చేయడం మరచిపోయింది సుశీ.

“కాఫీ తీసుకోరా” అని సత్యం అనడంతో సుశీ, చంద్రం కూడ సర్దుకున్నారు. ఇదంతా ఒక్క క్షణంలో జరిగిపోయింది. ముగ్గురూ ఏదో మాటల్లో పడిపోయారు. సత్యం, చంద్రం, తమ కాలేజి విషయాలు ఏవో మాట్లాడుకుంటూన్నారు. అన్నయ్యా, చంద్రం మెడ్రాస్‌లో క్లాసుమేట్సట. అలాంటి స్నేహితుడొకడున్నాడని అన్నయ్య ఇంతవరకు చెప్పనేలేదే. చంద్రం హైదరాబాదులో ఉద్యోగం చేస్తున్నాడట. నెలకు మూడు వందలు సంపాదనట. ఇంకా అతడు పెళ్లిందుకు చేసుకోలేదో? పెళ్లి ఎప్పుడు చేసుకుంటాడో! ఎవర్ని పెళ్లాడతాడో? ఈ ఆలోచన వచ్చేసరికి సుశీ ముఖం వికసించింది. పెదవుల్లో ఎందువల్లో ఒక చిరునవ్వు మెరిసింది. లేతాకుపచ్చ జార్జెట్ చీరపైట చటుక్కున జారిపోయింది. పైట సర్దుకుంటూ సుశీ చంద్రంవైపు చూచింది. చంద్రంకూడ తనవైపే చూస్తున్నట్టు గమనించేసరికి సుశీ బుగ్గలు ఎఱ్ఱబారినవి. సుశీకెందుకో చంద్రం ఎంతో ఆప్తుడుగా కనిపించాడు.

ఆరోజు ముగ్గురు కలసి సినిమాకి బయలుదేరారు. చంద్రం మాట్లాడుతుంటే అలాగే వినాలనిపించేది సుశీకి. ఇంటర్వల్‌లో సత్యం అవతలికెళ్ళినపుడు చంద్రం అడిగాడు “ఏమండి సుశీల గారూ! నాటకమేలా ఉంది,” అని. సుశీ ఈ సారయిన గట్టిగా మాట్లాడాలని తలచి “అబ్బే! ఇది సినిమా కదండి” అనగలిగింది.

“అదేలేండి! ఇపుడు నాటకమే జరుగుతూంట” అన్నాడు చంద్రం. సుశీ ఏదో ఆలోచిస్తు అవ్యక్తానందంతో బదులు చెప్పలేకపోయింది. మరుసటి రోజే చంద్రం ఇద్దరి దగ్గర సెలవు తీసుకొని హైదరాబాదు వెళ్లిపోయాడు. సుశీ చాల బాధ పడింది.

*   *   *

రిక్షాలో కూర్చొని పోతోందేగాని, సుశీ ఆలోచనలు రిక్షాకంటె, రైలుకంటె, విమానంకంటె వేగంగా పరిగెడుతున్నాయి. కాలేజిమీద మనస్సే లేదు. క్లాసులో కూర్చొని ఉందకాని లెక్చరర్ చెప్పేదేమీ బుర్రలో కెక్కడమే లేదు. “ఏమే అట్లా ఉన్నావు” అని కమల ప్రశ్నించినపుడు “ఏమీ లేదండి.” కాని కమలే అందుకుంది, “ఏం ఎవరినయినా మోహించావా ఏం” అని. సుశీ జవాబు చెప్పలేకపోయింది. ఒక చిక్కని చిరునవ్వుతో ఊరుకుండిపోయింది.

కాలేజినుండి తిరిగొచ్చేసరికి సత్యం ఏదో ఉత్తరం చదువుతున్నాడు. సుశీని చూచి గబుక్కున దాచేయబోయినట్లు నటించాడు.

“ఎక్కడినుంచి అన్నయ్యా ఉత్తరం” అంటూ వంగి చూడబోయింది.

“నీకు చూపించకూడదు ఇది. ఇందులో గొప్ప గొప్ప విషయాలున్నాయి” అని సత్యం ఉత్తరం బయటికి చూపించి మరి దాచబోయాడు. సుశీ గబుక్కున ఉత్తరం లాక్కొని తనగదిలోకి వెళ్లిపోయింది.

ఉత్తరం చదువుతూంటే సుశీల మనస్సు గాలిలో తేలిపోతున్నట్లనిపించింది. ఆ ఉత్తరం నాన్నే వ్రాశాడు, అన్నయ్యకు వ్రాసి ఉంది. సుశీ నడిగి అబ్బాయి నచ్చాడో లేదో వ్రాయాలట. అమ్మకునాన్నకు అబ్బాయి నచ్చారట. అమ్మాయి అంగీకరిస్తే ముహూర్తం వచ్చే మాసములో పెట్టిస్తారట. సుశీల కంతులేని ఆశ్చర్యం, అన్నయ్యమీద కోపం కలిగింది. ఇంతలో సత్యం తలుపు దగ్గర నిలబడి “ఏం సుశీ ఉత్తరం అలా లాక్కుని పోయావేం? ఏముంది అందులో?” అన్నాడు.

“పో అన్నయ్యా! ఇంత నాటకమెందుకు కాడారు నీవు మీ ఫ్రెండూ కలసి” అంది సిగ్గుపడుతూ.

“నాటకము జరుగుతూందంటే కాదన్నావటగా మా ఫ్రెండుతోటి” అన్నాడు సత్యం.

“ఓహో! అది కూడా చెప్పారా? భలే వాడేనే మీ ఫ్రెండు!”

“ఇంతకీ నాన్నకేం జవాబు వ్రాయాలి” అని సత్యం నవ్వాడు.

“పో అన్నయ్యా! ఇంకా వేళాకోళాలాడకు. ఏదో ఒకటి వ్రాసేయి,” అంది జారిపోయిన లేతాకుపచ్చ జార్జెటు చీర పైట సర్దుకుంటూ సుశీ. ★

## న్యూఢిల్లీ లేఖ

ఆంధ్ర పత్రిక న్యూఢిల్లీ ప్రతినిధి శ్రీ శ్రీ కృష్ణ అమెరికా పర్యటనార్థం బయలుదేరి వెళ్లారు గనుక ‘న్యూఢిల్లీ లేఖ’ తాత్కాలికంగా నిలుపు చేయవలసి వచ్చిందని పాఠకులకు మనవి. శ్రీ శ్రీ కృష్ణ అమెరికా నుండి తిరిగి రాగానే, న్యూఢిల్లీ లేఖ యథాప్రకారం ప్రకటింప బడుతుంది. సం||.

# చిత్రనళినీయం

— యద్దనపూడి సులోచనారాణి



అప్పుడే వేసవికాలం వచ్చేసింది. వెచ్చని వడగాడ్పు ఈ చెవిలోంచి ఆ చెవిలోకి కొడుతోంది. పది గంటలు దాటితే, జనం వీధుల్లోకి రావటానికి జడుస్తున్నారు. కలవారి యిళ్ళకి వట్టివేళ్ల తడికలు బిగింపబడ్డాయి. లేనివారు విసనకర్రలు, కుండల్లో చల్లని నీళ్ళు దగ్గర పెట్టుకుని కూర్చుంటున్నారు. ఎంత వేసంకాలమైనా, వడగాళ్ళవానైనా ఆ వూరి రాజగోపాలస్వామి దేవాలయంలో 2 గంటలయేసరికి వూళ్లో ఆడవాళ్ళందరూ చేరవలసిందే. గుళ్ళో వున్న గన్నేరు, రావిచెట్లు యెండవేడిమిని తగలనీయకుండా చల్లదనాన్ని ప్రసాదిస్తూ వుంటాయి. కొంతమంది శాస్త్రిల్లుగారి పురాణంకోసం వస్తే, మరికొంతమంది గుళ్లో గల చల్లదనానికి, లోకాభిరామాయణానికి జేరుతూవుంటారు. మొత్తం వూళ్లో ఆడవాళ్ళందరూ అక్కడికిజేరి సాయంత్రం నాల్గు గంటలవరకూ అక్కడ కూర్చుంటారు. ఆ వూరిలోకి కాస్త వున్నవాడు, దయా ధర్మము, పాప పుణ్యాల భీతిగలవాడు నారాయణరావుగారు. వారి తాతముత్తాత లెవరో యీ దేవాలయాన్ని కట్టించారు. అందుకనే ఆయనకు, ఆయన తల్లికి, ఆయన భార్యకు (ఒక్క కూతురు నళినికి తప్ప) ఆ యింట్లో అందరికీ నౌకర్లు చాకర్లతోసహా ఆ గుడి అన్నా, ఆ గుళ్ళో పురాణాల శాస్త్రిల్లుగారు, పూజారి అన్నా అపరిమితమైన గౌరవమూ, భక్తీను. ఆ రాజగోపాలస్వామి దయవల్లనే తామింతవరకూ యే కష్టమూ లేకుండా బ్రతుకుతున్నామని అనుకుంటూ వుంటారు.

ఇంటరువరకు మెడ్రాస్‌లో చదివిన నళినికిమాత్రం యివన్నీ అంటే ఒళ్ళుమంట. నారాయణరావుగారు నళినిని ఇంకా యే బి. ఏ. వరకో, ఎమ్. ఏ. వరకో చదివించేవారేగాని ఆయన తల్లి "ఇప్పటికే అది తెలివి మీరిపోయింది. ఓ దేముడూ లేదూ, దెయ్యమూ లేదు. ఇంక చాల్లే యింటికి తీసుకురా. ఈడొచ్చిన పిల్లని మన వూరు పేరుగాకుండా యెక్కడో వుంచుతానంటావేం. చాలు చాల్లే, రేపేదయినా అవుతే యేడ్చేందుకా?" అని కొడుకుని మందలించి నళిని చదువుకి ఫుల్‌స్టాప్ పెట్టించింది. ఆ యింట్లో బామ్మ ప్రభావం యెంతో తెలిసిన నళిని, తండ్రి "చదువుకున్నది చాల్లే అమ్మా!" అంటే మరేం మాట్లాడలేకపోయింది. కాలేజి చదువుకి స్వస్తి చెప్పబడినా నిస్పృహ చెందలేదు. తండ్రి సహాయంతో ఇతరరంగాల్లో కృషిచేయసాగింది. ఇదివరకు పత్రిక ముఖంచూడని నళిని రోజూ పత్రిక చూస్తూ ప్రపంచవార్తలు తెలుసుకోసాగింది. మూలపడిన వీణ తీసి శ్రుతులు సరిచేసింది. అమధ్య బద్ధకంవల్ల మానేసిన డాన్స్ తిరిగి క్రమబద్ధంగా అభ్యసించటం మొదలుపెట్టింది. నళిని పుణ్యమా అని ఆ వూళ్లో మొట్టమొదటగా నారాయణరావుగారు రేడియో కొన్నారు.

ఒకరోజు తండ్రి మద్రాసు వెళ్తుంటే తను గూడా వెళ్ళి ఒక బండెడు పుస్తకాలు, కొత్తరకం కుర్చీలు, కొన్ని కర్టెన్‌లు, క్యారంబోర్డు, బాడ్‌మింటన్ ఆడటానికి నెట్టు, బాట్సు మొత్తానికి ఒక నాలుగయిదొందలు వదిలించి ఇంటికి ఒక స్పెషల్ బస్ చేయించుకుని ఆ సామానంతా వేసుకొచ్చింది. అప్పుడే పూజ ముగించుకుని బయటకు రాబోతున్న నళిని బామ్మ యీ చిత్రమంతా చూస్తూ నోట మాటరాక అలాగే నిలబడిపోయింది. అత్తగారు అలాగే నిలబడిపోవటం చూచి నళిని తల్లి బయటకు వచ్చి తనూ అత్తగారి సరసన నిలబడి చిత్రం చూడసాగింది. నౌకర్లు సంతోషంగా, ఆశ్చర్యంగా అతిపదిలంతో ముట్టుకుంటే మాసిపోతాయన్నట్లుగా ఒక్కొక్క సామానే లోపలికి పట్టుకొస్తుంటే కళ్ళప్పగించి చూడటం తప్ప అత్తాకోడళ్లిద్దరూ యేమీ చెయ్యలేక పోయారు. ఆనాటితో నళినిని వంచటమనేది శుష్క ప్రయాస అనిమటుకు అనుకున్నారు.

ప్రయాణపు బట్టలన్నా మార్చుకోకుండా నళిని తెచ్చిన సామానంతటిని ఏవేవి ఎక్కడ వుంటే బాగావుంటాయో నిర్ణయించి నౌకర్లతో సర్ది వేసింది. వీధిలో వచ్చేపోయే జనాన్ని కనిపింపజేసే సింహద్వారాన్ని నీలం పూలకర్టెన్ మూసేసి యిక వీధిలోనేమీ కన్పించకుండా చేసేసింది. విడిచిన బట్టలను పారేసే హాలులో ఒక మూల రేడియో ఆక్రమించుకుంది. విడిచిన బట్టలన్నీ అందమైన ఒక బుట్టలోకి వెళ్లిపోయాయి. రేడియోకి కొంచెం దూరంలో ఒక చక్కని టేబులూ, దానిచుట్టూ కుర్చీలు నుంచున్నాయి. సర్దుతూ సర్దుతూ మధ్యమధ్య ఆగి తనపని తనే చూసుకుంటూ, ప్రశ్నలూ, జవాబులూ రెండూ తనే చెప్పుకుని, ఓరకంట బామ్మ, అమ్మల ఆశ్చర్యాన్ని చూసీ చూడనట్లుగా నటిస్తూ, నళిని తన్లో తనే మురిసిపోయింది. నౌకర్లకి గూడా నళిని తనచేతి మంత్రదండంతో యీ యిల్లు హఠాత్తుగా మార్చివేసినట్లుగా అనిపించింది. పురాతన పద్ధతులకు తనింట్లో యీరోజుతో స్వస్తి చెప్పబడింది గదాన్ని, యికనుంచి వూళ్లోకి యెవరైనా పెద్దమనుష్యులువస్తే యింక తనింటికి తీసుకురావచ్చని నారాయణరావుగారొక్కనిట్టూర్పువిడిచి, తనకా అవకాశం కల్పించిన నళినిని హృదయంలోనే ప్రశంసించుకొన్నారు.

దేవాలయంలో ఆరోజు మొదటగా వచ్చిన ప్రసక్తి నళిని మీద. ఒకప్రక్కన కూర్చుని తన్మయత్వంతో పురాణం వింటున్న నళిని బామ్మదగ్గరకు మునసబుగారమ్మాయి విమల వచ్చి మెల్లగా "యేమండీ! నళిని మెడ్రాస్‌నుంచి యేమేమిటి తీసుకువచ్చింది?" అంది. వచ్చిన పిల్లని కళ్లెఱ్ఱజేసి ఒకసారి ఎగాదిగా చూసింది నళిని బామ్మ. దాంతో విమల హడిలిపోయి అక్కడినుంచి మెల్లగా జారుకుంది. తమ యింటికి యెలాంటి దుస్థితి కల్గిందో దాన్నిగురించి నలుగురూ యేవిధంగా చెప్పుకుంటున్నారో వూహించి నళిని

బామ్మ ఒక బరువైన నిట్టూర్పు వదిలింది. అలవాటు చొప్పున తన కష్టాన్నీ రాజగోపాలునికి మనసులో వెళ్ళబోసుకుని, చివరకు భక్తిపూర్వకంగా చేతులుజోడించి 'అంతా నీ దయ స్వామీ' అనుకుని మళ్లా పురాణం వినటంలో మనిగిపోయింది.

నారాయణరావు గారింటి ప్రక్క శారదాంబ కారులోంచి యేవేమి దింపారో తను చూశానని, లోపలికి గూడా వెళ్ళి అంతా చూసొచ్చానని చెప్పటంతోనే అందరూ ఆవిడచుట్టూ ఆసక్తిగా మూగారు. ముఖ్యంగా మునసబుగారమ్మాయి విమల, కరణంగారమ్మాయి కమల, పూజారి కూతురు అన్నపూర్ణ, శాస్త్రిల్లుగారమ్మాయి శ్యామల వీళ్ళకి మరీ ఆసక్తి హెచ్చింది. అదంతా ఒకసారి తాము గూడా చూస్తే యెంత బాగుంటుందో ననిపించింది.

"ఒకటుందమ్మా. దానిని యేదో యిట్లా తిప్పింది! అంతే..." శారదాంబ తర్వాత చెప్పటం మానేసి కళ్ళు పెద్దవిచేసి చూడటం మొదలు పెట్టింది. కమలకి వుత్సాహం ఆగలేదు. "అప్పు డేమయింది?" ఆత్రంగా ప్రశ్నించింది. కాసేపటికి శారదాంబ "ఏముందీ? దాంట్లోంచి సంగీతం వచ్చేసింది! నిజంగా ఆశ్చర్యంగా లేదూ?" అంది.

"ఆహా!"అంటూ అందరూ తలలూచారు. "ఇంకా యిట్లాంటివి యెన్నో వున్నాయి" శారదాంబ చెప్పటానికి వుపక్రమించింది.

"అబ్బా! మనం ఒక్కసారి వెళ్ళివస్తే యెంత బాగుంటుందీ!" విమల పట్టలేక పైకి అనుకుంది.

"దానికేం మంది వెళ్లవచ్చు. నళినియెంతో మర్యాదగా మాట్లాడుతుంది. అంత చదువుకున్నానని కాస్తంత గర్వం గూడా లేదు. ఇంకా మనకే యేమీ లేకపోయినా నీటూ గోటూ జాస్తీ" శారదాంబ భావగర్భితంగా కమలను చూస్తూ అంది.

గుళ్ళోంచి ఆ సాయంత్రం వెళ్ళిపోయే ముందు కమల, విమల, అన్నపూర్ణ, శ్యామల మర్నాడెలాగయినాసరే, తప్పకుండా నళినిదగ్గరకు వెళ్ళాలని నిశ్చయించుకున్నారు.

మర్నాడు వాళ్ళు వచ్చేసరికి నళిని సోఫాలో కూర్చుని యేదో యింగ్లీషు నవల చదువుకుంటోంది. వాళ్లని చూడగానే లేచి ఆప్యాయంగా పల్కరించి లోపలకు రమ్మనమని ఆహ్వానించింది. ఎవరు ముందు మాట్లాడాలి, యేం మాట్లాడాలి అని సతమతమౌతున్న వాళ్లకి నళిని ఆబాధని తొలగించి తనే ముందు చక్కగా స్నేహంగా మాట్లాడింది. ఒక అరగంట గడిచేసరికి అయిదుగురు ఆప్తమిత్రులు అయినారు. తర్వాత యెన్నో విషయాలను గురించి మాట్లాడుకున్నారు. నళిని తను ముందు కొన్ని విషయాలు చెప్పింది. తర్వాత వాళ్ళని చెప్పమని తను వింది. మూడు గంటలు యెలా గడిచాయో వాళ్ళకే తెలియదు. నళిని లేచి తను మద్రాస్ నుంచి తెచ్చిన వస్తువులన్నీ చాలా సహజంగా ప్రాణస్నేహితులకు చూపించినట్లు చూపించింది. వాళ్లు యింక వెళ్తామని లేవబోతుంటే ఒక్క నిమిషం వుండమని యింట్లోకివెళ్లి షర్‌బత్ గ్లాసుల్లోనింపి తీసుకొచ్చి యిచ్చింది. మొదట మొహమాటపడ్డా చివరకి నళిని బలవంతంవల నలుగురూ తాగారు. అది తనే తయారు చేశానని చెప్పి, వాళ్ళని యింకా ఆశ్చర్యపరచింది. వాళ్లు వెళ్తుండగా లేచి వీడ్కోలు యిస్తూ తప్పకుండా రోజూ వస్తే తనకి వచ్చిన విద్యలన్నీ వాళ్ళకి నేర్పుతానని వాగ్దానంచేసి, మరునాడు తప్పకుండా వస్తామని వాళ్ల చేత ఒట్టు వేయించుకుని మరీ వదిలింది.

వాళ్లు వెళ్ళిపోయిన తర్వాత నళిని చూస్తూ అక్కడే నిలబడిపోయింది. తను మొదట చదువు మానేసిన రోజుల్లో కాలం యెలా గడపాలో తెలియక తన్ని తను తిట్టుకుని యింట్లోవాళ్ళని మనసులో తిట్టిపోసేది. తన అవస్థంతా కలం స్నేహితురాలు చిత్రకి తెలియజేసుకునేది.

చిత్రకీ నళినికీ రెండు సంవత్సరాలనుంచీ కలం స్నేహం సాగుతోంది. నళిని యింటర్‌లో జేరిన కొత్తలో విశాఖపట్నంనుంచి ఒక తెలియని అపరిచితురాలి దగ్గర్నుంచి వుత్తరం వచ్చింది. అందులో మూడే మూడు ముక్కలు ముక్తసరిగా వున్నాయి. అవి: "నీ స్నేహాన్ని వాంఛిస్తున్నాను. అంగీకరిస్తావా? అంగీకరిస్తే ఈ క్రింది ఎడ్రస్‌కు వ్రాయి." అడ్రస్‌లో కుమారి చిత్ర అని వుంటే పేరు చిత్ర అని తెలుసుకుంది.

"నీగురించి నాకేమీ తెలియదు. కలం స్నేహం విచిత్రంగా సాగుతున్న యీ రోజుల్లో మగవాళ్లుగూడా ఆడవారి పేర్లు పెట్టుకుంటున్నారు. పేరునుబట్టి స్త్రీయో పురుషుడో నిర్ణయించడం కష్టంగా వుంది. నువ్వేం చేస్తుంటావో గూడా నాకు తెలియదు. ఇలాటిపరిస్థితులలో మన స్నేహలత యెలా ముందుకు ప్రాకుతుంది?" నళిని అనుమానంగా వ్రాసింది.

దానికి వెంటనే జవాబు వచ్చింది.

"నేనెవర్నయినా నీకు ఫర్వాలేదు. ఆడపిల్లనైనా, మగపిల్లవాడినైనా నీకొచ్చే ప్రమాదం లేదు. పోనీ కలం స్నేహం బాగా పిచ్చిగావున్న యీరోజుల్లో మూలనున్న ఒక ముసలమ్మకు ఈ వుత్సాహం పుట్టిందనుకో. మనకి కావాల్సిందల్లా నీలో నాలో వున్న ఉన్నతాభిప్రాయాలు, ఆశయాలు, అని కలవటమూను, నిజానికి నీగురించి నాకేం తెలుసు? నాకేమీ తెలియదు. అయినా నీ స్నేహం వాంఛిస్తున్నాను. అంగీకరిస్తావని ఆశిస్తున్నాను."

దానికి నళిని వ్రాసిన సమాధానము:

"నన్నుగురించి నీకేమీ తెలియనంటే యెలా నమ్మతాను? నన్ను చూడకపోయినా, కనీసం నాగురించి వినైనావుంటావు. లేకపోతే నువ్వు నాలో ఉన్నత భావాలున్నాయని యెలా అంటున్నావు? నీగురించి నేను కనీసం వినిగూడా వుండలేదు. నీ అడ్రస్‌లో ఎం. బి. బి. ఎస్. ఫోర్తియర్ అని వున్నదిగాబట్టి నువ్వు డాక్టరు చదువుతున్నావని అనుకుంటున్నా. మొత్తానికి మూలనున్న ముసమ్మవిమాత్రం గాదు. ఇక తేలవలసింది ఆడపిల్లవా? మగపిల్లవాడివా? అయినా యిద్దరు మనుష్యులలో ఉన్నతాభిప్రాయాలున్నంత మాత్రాన వారి స్నేహలత పెనవైచుకుని పూలుపూసి, కాయలు కాస్తుందా?"

ఈవిధంగా మనకు స్నేహం యెలా యెలా కుదురుతుంది అనుకుంటూనే వాళ్లిద్దరూ ఆప్తమిత్రులయారు. ఈనాటికి గూడా 'చిత్ర' ఆడపిల్లో మగపిల్లవాడో నళినికి తెలియనే తెలియదు. వుత్తరాల్లో యెక్కడయినా దొరుకుతుందేమోనని నళిని ప్రతి వుత్తరం రెండుమూడుసార్లు చాలా నిశితంగా పరీక్షచేసేది. కాని ఫలితం దక్కలేదు. విసిగిపోయి చివరికి నళిని కోపంగా ఒకసారి యిలా వ్రాసింది.

'చిత్రా'

నువ్వు మగపిల్లవాడి వయినా, ఆడపిల్లవయినా నాకు బాధలేదు. నాకు కావాల్సిందల్లా నీ స్నేహం. అదిమటుకు ఎన్ని అవాంతరాలొచ్చినా మానుకోను. యే కారణంచేత నువ్వీ విషయాన్ని దాస్తున్నావో నాకర్థంగావటం లేదు. సరే! మొత్తానికి నీవు మానవజాతికే సంబంధించుతావు గదా? నీ యిష్టమైనప్పుడే తెల్సుకుంటాను.

—నళిని.

దానికి చిత్ర జవాబివ్వలేదు. నళిని తన్ను కాలేజి మాన్పించినతర్వాత ఇలా వ్రాసింది:

చిత్రా!

నన్నందరూ అన్నివిధాలా నాశనం చేస్తున్నారు. మా బామ్మ యేడుపులు, శోకాలు పెట్టి నాచదువు మాన్పించింది. మా బామ్మని మింగాలన్నంత కోపం వస్తోంది కాని యేం చెయ్యను, కాస్తాకూస్తామనిషి గాదయ్యె! యేం చెయ్యాలో తోచటంలేదు. బొత్తిగా కాలం గడవటం లేదు. ఇంక నీ వుత్తరాలే నాకు శరణ్యం.

నీ నళిని.

ఆ విధంగా మొదలయిన వాళ్లి స్నేహాకి చివరకు యే చిన్నవిషయమైనా సరే చిత్రం తెలియజేసి, చిత్ర తన అభిప్రాయం తెలియజేస్తేగాని నళిని ముందుకు అడుగు వెయ్యనంత

బొమ్మలా వ్యంగ్యకంఠంతో. నళిని ముందర సన్నసన్నగా చివాట్లుపెట్టింది. "అలాటి విషయాలు విని వూరుకోవాలిగాని, తర్కించి విమర్శించగూడదు. చేసిందికొస్త తప్పే అయినా యిలా ప్రతివాళ్లు విమర్శనలు సన్నసన్నగా మొదలుపెడ్తే యివే పెద్ద గాలిదుమారమై వాళ్లమీద విరుచుకు పడ్తుంది."

"నలుగురూ వున్నాంగా బట్టే అనుకున్నాం. అయినా యింగులో తప్పేముంది. లేని విషయం మనమేమీ కల్పించలేదుగా. అందరూఅనుకుంటున్నదే; ఉన్న విషయమే" కమల కొస్త యెదురుచెప్పింది.

"అది నిజమో అబద్ధమో నీకు పూర్తిగా తెలుసా? ఒక వేళ తెలిసినా అంతవ్యంగ్యంగా మాట్లాడుకోవటం దేనికి? ఒక వేళ నిజమైనా యేం? లక్ష్మికి సుబ్బన్న పరాయివాడు గాదుగా, స్వంత మేనమామేగా! అలాటప్పుడు చెప్పుకోవటం దేనికి?" నళిని తీవ్రంగా ప్రశ్నించింది.

"ఓయబ్బో!" విమల మూతివిరిచింది.

"అదిసరేగాని యింతకీ చిత్ర అబ్బాయా? అమ్మాయా?" కమల ప్రసంగంమార్చినా వ్యంగ్యం కన్పిస్తానేవుంది. దానికి నళిని మాట్లాడలేదుకాని అడగటంలోగల వ్యంగ్యం అర్థంచేసుకున్న నళినిబుగ్గలు కెంపురంగు పులుముకున్నాయి. అది నిజమైతే యెంత బాగుంటుందో అనుకుంది నళిని. నళినిబుగ్గల మీద యెరుపుచూసి, కమలా, విమలలు ఒకరి ముఖం ఒకరు చూచుకొన్నారు.

మర్నాడు అన్నపూర్ణ ఒక్కతే రావటంచూసి 'వాళ్లేరీ?' నళిని చదువుకుంటున్న పుస్తకం అవతలపెట్టి అడిగింది.

"యేమో నాకు తెలియదు." అన్నపూర్ణ ముక్తసరిగా వచ్చినపనిచూచుకొని వెళ్ళిపోయింది. నళిని అవాళ చాలా నిరుత్సాహంగా గడిపివేసింది. ఆ రోజు రాత్రి చిత్రకు యిలా వుత్తరంవ్రాసింది.

చిత్రా,

నిజమే. నువ్వన్నట్లు వీళ్లని అర్థంజేసుకోవటం కష్టం. మనలాటివాళ్లు మనిషిలో మంచినిమాత్రమేచూసి దానితోమటుకే స్నేహంచేస్తారు. వీళ్లలాకాదు. ఇవాళ హఠాత్తుగా రావటం మానేశారు. రేపు బహుశా అన్నపూర్ణగూడా మానవచ్చు. ఎందుకు మానేస్తున్నారో నాకు తెలియటం లేదు. ఇది నాకు తీరనిసమస్యగావుంది. నీకేమయినాఅర్థమైతే వ్రాయి

ఇటు,
తలనొప్పితోవున్న,
నీ
నళిని

అనుకున్నట్లుగానే అన్నపూర్ణ మానేసింది. కాని కారణం కబురుపంపింది తనకి జ్వరం వస్తోందని. ఇష్టం లేకపోయినా నళిని నమ్మక తప్పలేదు. ఒకరోజున వుండబట్టలేక నౌకర్ని కమలావాళ్ళింటికి పంపింది. రాములు తిరిగివచ్చి నళినితో యేసమాధానం చెప్పకుండా తనపని తాను చూసుకోవటం మొదలుపెట్టాడు. బహుశా మర్చిపోయాడేమోనని తనే దొడ్లో గొడ్లని చూస్తున్న వాడిదగ్గరకు వెళ్ళి అడిగింది:

"ఏరా రాములూ, కమల యేమంది?"

రాములు ముఖం తిప్పుకుని "రాటానికి యీలు లేదంటమ్మా. ఇంకా యెప్పుడూ ఆ రమ్మాయికోసం ఆళ్ళింటికి రావద్దన్నారు." రాములు కళ్లలో నీళ్లు తిరిగాయి. నళినికిదేం అర్థంగాక "యేమిటిరా? అసలు సంగతేమిటి? కళ్లంబడి నీళ్లు పెట్టుకుంటా వెందుకు?" "యేం సెప్పమంటా రమ్మా. మీకేమో యీ మాయదారి ప్రపంచం తెలియదు. లోకంలో చాలా కుళ్లుందమ్మా. యెట్టాంటి కుళ్ళనుకున్నారు? ఛీ! చూసీ ఓర్వలేక..." రాములు ముఖం కోపంతో జేవురించింది. వాడు తొందర తొందరగా అక్కడినుంచి వెళ్ళిపోయాడు. నళిని తెల్లబోయింది. ఎంత ఆలోచించినా సంగతేమిటో అర్థంగావటంలేదు. ఒకవేళ యేమయినా తను కమలని అన్నట్లుగా చెప్పిందా కమల యింట్లో? ఛీ! కమ

ఒక భీమా ఏజంటు డైరినుండి

# ఆయన యిల్లు అమ్మబోయే ప్రయత్నంలో ఉన్నాడు...

"వద్దు, వద్దు" అన్నాడు మనోజ్ సేన్, "నాకు జీవిత భీమా అవసరం లేదు. నేను వ్యాపారస్థుడిని. నాకు, ఎక్కువగా వచ్చే రాబడిని జీవిత భీమాలో పెట్టే బదులు, నా వ్యాపారంలో పెడితే, నాకు ఇంకాఎక్కువ లాభాలు వస్తాయి." కాని నేను ఆయనకు, యువకత్వంతో పొంగి పోతూ ఉత్సాహంగా కన్పించి ఉంటాను. పైగా ఆయన మా నాన్న స్నేహితుడు కూడా. అందువలన ఆదరంతో, నావద్ద నుండి ఒక పాలసీ తీసికొన్నాడు.

కొన్ని సంవత్సరాల అనంతరం ఆయన అదృష్ట దేవత మారి పోయింది. వ్యాపారం బాగా దెబ్బతినడం వలన ఆయన భాగస్థుడు కూడా వ్యాపారంనుండి విరమించుకున్నాడు. తాను వ్యాపారాన్ని పునర్నిర్మాణము చేయవలసి వచ్చినది. కాని పెట్టుబడి యెక్కడినుంచి వస్తుంది? అన్నిటికీ తెగించి నిరుత్సాహంతో ఆయన యిల్లు అమ్మడానికి నిశ్చయించుకున్నాడు.

ఇది వింటూనే, నేను ఆయనను చూడ్డానికి పరుగెత్తాను. నేను వెళ్లిన రోజే, ఆయన యిల్లు అమ్మే ప్రయత్నంలో వున్నాడు. ఈ ప్రయత్నం నుండి విరమించుకోమని సలహా యిస్తూ యీవిధంగా చెప్పాను. జీవిత భీమా పట్టా తాకట్టు పెడితే, ఒక మోస్తరుగా సరిపోయేటంత అప్పు దొరకవచ్చు అనే విషయాన్ని వివరించాను. నాసలహా మళ్లీ ఆయనను, తన కాళ్లపై నిల్చోనేలా చేసింది. మళ్లీ తర్వాత ఆయనఅప్పును తీర్చి, తిరిగి, పట్టాను పొందగల్గాడు.

నేను మళ్లీ యువకుణ్ణయి నా వృత్తిని, నిర్ణయించుకో వలసి వస్తే, తిరిగి ప్రతిసారి నేను భీమా ఏజెంటునే కాగోరుతాను. ఎందుకంటే యిది నా చుట్టూవున్న వారికి ఎంతో సహాయం చేస్తున్నామనే సంతృప్తి, ఆనందాన్ని కలుగజేస్తుంది.



*.ఇందులో చేర్చ బడిన వ్యక్తుల ఆత్మగౌరవ, సంరక్షణకై, యీ పేర్లు కల్పితమే. కాని యీ కథ మాత్రం నిజమైనది.



Life Insurance Corporation of India

ASP/LIC 82

# నా నయాపైసా అనుభవం

అని నేరం మోపి సంతృప్తిగా నుంచుంది శ్రీమతి.

వాది ప్రతివాదులమధ్య న్యాయాధికారిలా కూర్చున్నాను నేను. మా బాబు కూడా అప్పుడే ప్రక్క నుంచి లేచి వచ్చి యీ ఆందోళనంతా సరదాగా ఆలకిస్తూ నా ప్రక్కనే బుద్ధిమంతుడిలా వుపవిష్టుడయ్యాడు.

"మీరే ఆలోచించండి బాబూ" మొదలెట్టాడు నరసయ్య. "అణన్నరకు తొమ్మిది నయాపైసలు గదా. మరేమోను అణా కాణీకి ఎనిమిది నయాపైసలు. అలా అని ప్రభుత్వమే ప్రకటించింది. ఇక నేను ఒక నయాపైసా యిస్తే సరిపోయినట్టేగద బాబు" ముద్దాయి వాదన నాకు నచ్చినట్టే అనిపించింది.

"సరిపోతుంది" అని తలవూచాను.

"ఏమిటి దండీ సరిపోవడం నా బొందకి?" చకచకా గోడవద్దకు వెళ్ళి వ్రేళ్ళాడకట్టిన నయాపైసల మారకపు పట్టీ (ఎందుకైనా మంచిదని ఒక పట్టీ అట్టకు కరిపించి ఆఫీసోళ్ళకని గోడలకు వ్రేలాడ కట్టారు రెండి మా ఇళ్ళో) తీసుకొచ్చి నా ముందుకు గిరవాటేసింది శ్రీమతి. "కళ్ళుచ్చుకుని చూడండి కాణీకి రెండు నయాపైసలని అందులో వ్రాసి వుందో లేదో. అణన్నరలో అణా కాణీ వుంచుకుని అతడు మనకు ఓ కాణీ వాపసివ్వాలి గదా. కాణీ లేదంటున్నాడు కనుక రెండు నయాపైసలిచ్చితీరాల్సిందే" ప్రతివాది వాదం మరీ బలవత్తరంగా ఏర్పరచింది మా శ్రీమతి.

పట్టీలో చూశాను అణన్నరకు తొమ్మిది నయాపైసలు అణాకాణీకి ఎనిమిది నయాపైసలు. బొరెడంత అక్షరాలతో వ్రాసి వుంది. కాబట్టి నరసయ్య వాదం సకారణమైన వాదనమే.

ఈ దెబ్బతో న్యాయవాది బుర్ర గిర్రున తిరిగిపోయింది. నిష్పాక్షికమైన తీర్పు ఎలా చెప్పాలో నాకేమీ అంతు చిక్కడం లేదు. ఇటు శ్రీమతిగారి వాదం బలవత్తరంగానే వుంది. అందుకు సాక్ష్యం కాణీకి రెండు నయాపైసలని అచ్చువేసిన పట్టీలోనే అణాఅంత అక్షరాలతో అవుపిస్తూనే వుంది కాబట్టి అదిసను తప్పు అనడానికి వీలులేదు. ఇక నరసయ్య. అతడి వాదంకూడా అంత కన్నా హేతుపూర్వకమయినదే. అణన్నరకు తొమ్మిది, అణా కాణీకి ఎనిమిది నయాపైసలని కళ్ళలోకి పొడవవచ్చేలా కనిపిస్తూనే వుంది పట్టీలో. కాబట్టి 'అతడివ్వవలసింది ఒక నయాపైసాయే. ఇంతకూ ఆ నరసయ్య ఓ కాణీయూక తీసి మా శ్రీమతి మొహాన పడేసి

ఉంటే యీ రాద్ధాంతమే జరిగివుండేది కాదు. అతడు తనవద్ద కాణీలు లేవంటాడు. ఉన్నా కూడా ఒక నయాపైసా ఇవ్వడము అతడికి లాభసాటిబేరం కనుక అలా అనవచ్చు. పోనీ నీవద్ద కాసీలు ఉన్నాయో, లేవో చూద్దాం, సోదాచేదాం అని అడిగేస్తే అతడు తప్పక దొరికిపోతాడు. కానీ అందులో నా గొప్పతనమేముంది. నేను న్యాయం తీర్చలేక పోవడమే కాక, అతడు మీరు కొనకపోతే పొయ్యేరుకాని, నన్ను సోదాచెయ్యడానికి మీరెవరు? అని మొహం మీద అడిగేశాడంటే, యీ చట్టంత మగాణ్ణి శ్రీమతిముందు నా మొహం ఎక్కడుంచుకోవాలి? కాబట్టి ఆ ఆలోచన లేనబలే వనిపించింది. ఇన్నేళ్లుగా లెక్కలు చదివినా ఆలోచన యింతేనా అని చిరాకు కూడా వేసింది.

"పోనీ తీసుకోకే. నరసయ్య లెక్క సబబుగానే వుందిగదా పట్టీ ప్రకారం" అని స్వపక్షంలోనే కొత్త Influence చూపేసి పైకి లేవబోయాను.

"ఏడిసినట్టే ఉందండీ—మీకు లెక్కలు నేర్పెట్టడం. నరసయ్య లెక్క సబబయితే నా లెక్కయేనా లేసబబు? కాణీకి రెండు నయాపైసలు కాదని ఏ పార్లమెంటు మెంబరు చెబుతాడో నా ముందుకు తీసుకురండి యిలా. అలా అతనికి యిష్టం లేకపోతే కొనే యివ్వమనండి. నేను వద్దన్నానా." నాపైవిరుచుకపడిపోయింది శ్రీమతి. లేస్తున్నవాణ్ణి తప్పక కూర్చునేశాను.

"సుభమా అని నేనులేస్తున్నట్టే ఈ సివిల్ కేసు ఏమిటిరా గుర్రూ!" అని చిరాకేసింది. ప్రక్కన కూర్చున్న మా బాబు బుంగమూతి పెట్టుకుని కప్పవేపు చూస్తూ మునసబుకోర్టు లాయర్‌లా ఆలోచిస్తున్నాడు. వాడిమొహం చూసి పక్కుమని నవ్వేశాను నేను. అంత సీరియస్‌గా ఉన్నాడు వాడు.

"వాడి ముహంలో ఏముందండీ నవ్వడానికి? మీముహం చూసుకోండి అద్దం వద్దకు వెళ్ళి. 'తెల్లవారినట్టే వుంది మీరు లెక్కలు కట్టడం." కోపం చిరుమొలకలెత్తిన శ్రీమతిగారి చిన్నారి ముహం రెండు వంకల "హైపర్ బోలా" లా తయారయింది.

"కరెక్టు" అంటూ పైకి లేచాడు బాబు ఏదో ఆలోచనలోంచి తెములుకున్నట్టు.

"ఏమిటిరా మహాశయా! ఆ ఇన్స్పిరేషను" అంటూ నేనూ పైకి లేచాను.

గబుక్కున అలమారువద్దకు పరుగెత్తుకెళ్ళి, వాడి డబ్బుల గల్లాలో ఏదో తీసుకుని వసారాలోకి పరుగెత్తుకు వెళ్ళాడు వాడు.

"ఏమిటూ" అని మేము ఆలోచిస్తున్నట్టే మా పలినీ, వాడూ చిరునవ్వు వొలకబోసుకుంటూ పరుగెత్తివచ్చారు. అప్పుడే నిద్ర లేచిన నళిని అర్ధమగతలోనే నవ్వుకొంటూ వుంది. బాబు దాని చెవిలో నోరుంచి గూఢంగా వూదాడు మళ్ళీ" ఓ! రైటురైటు అలాగే" అంటూ అది మావద్దకు పరుగెత్తుకుని వచ్చింది.

"నరసయ్య తాతయ్యా! ఈ కాణీ తీసుకుని నాకు రెండు నయాపైసలివ్వవూ? నేను చేర్చిపెట్టుకోవాలి" అని నుసుమ్మా దసువుగా నరసయ్యసంత చేరాడు బాబు. ఏడాదినుంచీ నరసయ్యే మాకు కాయగూరలిస్తూండడం వల్లా పిల్లలకు అతనివద్ద చనువు ఎక్కువ.

"దానికేమి బాబూ మహాభాగ్యము. యిదిగో" అంటూ రెండు నయాపైసాలు తీసి వాడిచేతిలోవుంచి కాణీతీసి తన జేబులో వేసుకున్నాడు నరసయ్య.

ఇంతలోనే నళిని తయారయింది, "నరసయ్య తాతయ్యా! నాకూ యివ్వవూ? అన్నయ్య కిచ్చావుగదా మరి." ఓ కాణీని చేతిలో చూపుతూ నరసయ్యను చేరింది నళిని. దీనికెక్కడిది కాణీ అని నేనూ మా శ్రీమతి అలానే విస్తుపోయి చూస్తూండిపోయాము.

"అయ్యొయ్య నాతల్లిగదూ! యిదిగోనమ్మా నీకు కూడా" అంటూ దానికాణీ తీసుకుని, రెండు నయాపైసలిచ్చి, దాని ముద్దుమాటలకు పారవశ్యం చెందుతూ దగ్గరగా లాక్కొని గాఢంగా కౌగలించుకున్నాడు నరసయ్య. ఆ రెండు నయాపైసలూ చేతిలో పడుతున్నట్టే ఎగ్గిరగంతేసి "యిచ్చేశాడు! యిచ్చేశాడు" అంటూ బాబుదగ్గరకువెళ్ళి వాడిచేతిలో పెట్టేసింది. దానిదగ్గర్నుంచీ అవితీసుకుని నాలుగునయాపైసలూ చేతిలో వేసుకుని నరసయ్య ముందు వచ్చి ధీమాగానుంచున్నాడు బాబు.

"నరసయ్య తాతయ్యా! అమ్మకు నేరు వంకాయలూ తూచిపెట్టు." 'ఆర్డరిచ్చాడు సుప్రీంకోర్టు జడ్జీలాగా ముహంపెట్టేసి.

నరసయ్య మారుమాట్లాడకుండా తూచాడు.

"అమ్మా! నీవు అణన్నర యిచ్చివేయవే."

శ్రీమతి జంకుతూనే అణన్నర యిచ్చింది నరసయ్యకు. ఒకనయాపైసా నుక్సాన అవుతుందని ఆవిడ ఆత్మ ఆక్రోశిస్తూనే వుంది.

"నరసయ్య తాతయ్యా నీవు ఒకనయాపైసా యిలాయివ్వు. నీవు చెప్పింది అంతేకదూ?" అతనిదగ్గర ఓనయాపైసా తీసుకుని, తన

(౬౦-వ పేజీ చూడండి)

# భార్యా కురూపి...?

శ్రావణ శుక్రవారం. పగలంతా ఉపవాసం ఉండి రాత్రి నోములు నోచుకుంది జానకి. పూజకొచ్చిన ముత్తైదువలు, పేరంటాండ్రు దేవిప్రసాదం అందాక ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు. వాళ్ళందర్నీ సాగనంపాక జానకి దేవుడింట్లోని ఫలహారాలు అత్తగారికి పెట్టింది.

అత్తగారికి ఒంట్లో బాగుండకపోవడం వల్ల ఆవతల గదిలో పడుకొనివుంది. మరిది హనుమంతరావు స్నేహితులింటికి వెళ్ళినట్టున్నాడు యింకా యింటికిరాలేదు. కోడలిస్తున్న ఫలహారం తీసుకొంటూ ముసలావిడ అడిగింది :—

"అబ్బాయి కేమైనా పెట్టావా అమ్మా?"

"ఆయన యింట్లోలేరు. సినీమాకి వెళ్ళినట్టున్నారు" అంది.

"ఉంటేమాత్రం ఆయన దేవిప్రసాదాన్ని ఎప్పుడైనా కళ్ళకద్దుకొని తిన్నారు గనుకనా?" అనుకుంది మనసులో మాత్రం.

అత్త ఒక్క నిట్టూర్పు విడిచింది.

జానకి తిరిగి దేవుడింట్లోకివెళ్ళి, ఆప్రసాదాన్ని కళ్ళకద్దుకొని నోట్లో వేసుకొంది. తర్వాత ఒక అరటిపండు తినటం ప్రారంభించింది.

ఆమె కెందుకో తప్పున విచిత్రమయిన భావం కలిగింది! ఆయనకి తను తగినఅర్ధాంగిని కానేమో నని! ఆయన విద్యాధికుడు, సుందరుడు, స్ఫురద్రూపి. కాని తను? తనకి చాకలిపద్దులు రాయటంతప్ప మిగతా విద్యాప్రపంచం శూన్యం. పోనీ సంక్రమించవలసిన చదువు రాకపోగా ప్రకృతిసిద్ధమైన సౌందర్యమన్నా వుందాంటే తనకదీ కరువేఅయింది. ముఖం, ముఖవర్చస్సు, శరీరలావణ్యం— అన్నీ...

కాని—

ఆయనకి తనంటే ప్రాణం.

తనని ఆయన సౌందర్యరాశిగా పొగిడే క్షణాల్లో, తనని ఎవరో కత్తులతో, సూదులతో పొడిచి హింసిస్తున్నట్టు బాధపడేది. ఆయన తనబాధనిచూసి,—

'"నీలో అంతరాత్మ ఎంత అందంగా వుందో నీకంతెలుసు జానకీ" అనేవారు.

ఆయన "సంస్కృతభావ" మెందుకో అంతకంతగా అర్థమయేదికాదు. కాని రానురాను దానిని అర్థంచేసుకో మొదలుపెట్టింది. దాంతో ఆమెకు భర్తమీద భక్తి నమ్మక ఏర్పడింది.

కాని అప్పుడప్పుడు ఎందుకో ఇలాంటి అనుమానాలు, శంకలు కలుగుతూవుంటాయి. చేతిలో పండు సగం తినలేకపోయింది. తప్పున ఆ గౌరీదేవి ముందు పడిపోయి కన్నీళ్ళతో అభిషేకం చేయ మొదలుపెట్టింది. చుట్టూ కళకళ్ళాడుతూ వెలుగుతున్న జ్యోతులు విచిత్రంగా ఆ శాంత మూర్తివేపు చూడ నారంభించాయి. మంగళగౌరిముందు వెలుగుతున్న దీపం ఆ విసురుకు రెపరెపలాడి ఆరిపోయినా మిగతా దీపాలుమాత్రం వాటిపని అవి చేసుకుపోతున్నాయి.

అప్పుడు రాత్రి సరిగా ఎనిమిదిన్నర అవుతుంది!

'శ్రీనాథ్'

## 2

వాసుదేవరావు టీపార్టీనుంచి ఇంటికి తిరిగి వచ్చేసరికి సరిగా రాత్రి పదయింది. ఇంట్లో చూస్తే యింకేముంది? ఏడుపులూ పెడబొబ్బలు వినిపిస్తున్నాయి. అతనికి అడుగులిక ముందుకి సాగలేదు.

కొడుకుని చూడగానే తల్లి ఇల్లెగిరిపోయేట్టు ఏడవటం ప్రారంభించింది. ఆమె చుట్టూ మూగివున్న ఆడవాళ్ళల్లో ఎవరో ఒకావిడ అంది:

"జానకమ్మ దేవుడింట్లో కాలిపోయింది."

వాసుదేవరావు వెనక్కి కూలిపోయాడు!

"ఎక్కడుంది?" అన్నాడు పొడిగా.

"ఆస్పత్రికి తీసుకువెళ్లారు పక్కింటి సబిన్స్పెక్టర్ గారు."

వాసుదేవరావు మారుమాటాడకుండా ఆసుపత్రికి బయలుదేరాడు.

హాస్పిటల్ దగ్గర సబ్ఇన్స్పెక్టర్ రాంబాబుగారూ, ఎదురింటి లాయరుగారూ కనిపించారు. అప్పుడే ఆపరేషన్ థియేటర్ నుంచి డాక్టర్ కూడా బయటికి వచ్చి రాంబాబుని పిలిచి:

"ఆమెకు కాలిపోవడంవల్ల ప్రాణం పోలేదు; అంతకుముందే ఎవరో ఆమెను పీక పిసికి చంపారు. ఆ రహస్యం దొరక్కుండా వుంచేందుకు హంతకుడే ఆమె చీరకు నిప్పు పెట్టి వుండొచ్చు..."

వాసుదేవరావు గతుక్కుమన్నాడు.

"పీక పిసికి చంపారా? ఎవరు? ఎవరు?" అన్నాడు.

రాంబాబు తప్పున వెనక్కి తిరిగి—

"విచిత్రంగా వుందే! అంత ధైర్యంగా ఇంట్లోకొచ్చి పీకపిసికి చంపగలిగే ధైర్యమెవరుంటారు?" అన్నారు. అతని ఉద్దేశంలో ఎవరో 'దొంగ'అయివుంటాడని.

"అన్నట్టు వస్తువులు, నగలు ఏమైనా పోయాయేమో చూశారా?"

"లేదు. నేను, ఈ కబురు విని తిన్నగా యిలా వచ్చేశాను."

"నేను పోస్టుమార్టమ్ రిపోర్టు తీసుకొస్తాను" అని డాక్టర్ లోపలికి వెళ్ళిపోయాడు.

రాంబాబు ఒక నిట్టూర్పువిడిచి "ఇప్పుడు మాకు పని తగిలింది" అన్నాడు.

ఈ మాటలకు వాసుదేవరావు రాంబాబు వేపు విచిత్రంగా చూశాడు.

వాసుదేవరావు స్థానిక కళాశాలలో అధ్యాపకుడు. ఆయనకు విద్యార్థుల్లోనూ, అధ్యాపకుల్లోనూ పేరూ, పలుకుబడీ వుంది. క్లాసులో తన పనేదో తాను చూసుకొని బయటకు వచ్చేసేవాడు. మితభాషి. సహోధ్యాయులతో కూడా తూచి మాటాడేవాడు ...ఆయన వుండే ప్రాంతంలో కూడా లాయర్లూ, డాక్టర్లూ, పెద్దమనుషులు నివసించేవారు. అలాంటి సంస్కార సమాజం మధ్య వాసుదేవరావుకూడా ఒక సంస్కారవంతుడుగా పరిగణింపబడుతూ వున్నాడు. అలాంటిది యిప్పుడు తన భార్య (ఆత్మ) హత్య(?)సందర్భంలో పోలీసువాళ్ళ వాకబులు, కోర్టులు తలచుకునేసరికి వాసుదేవరావుకి గుండె జలదరించింది. తన పరువు మర్యాదలన్నీ తన ఎదురుగానే కుప్పగా కూలిపోతున్నట్టు భయపడ్డాడు. అందుకే రాంబాబువేపు తిరిగి—

"రాంబాబుగారు! పోయిన జానకి ఎలాగూ పోయింది. ఇది హత్య అయినా, ఆత్మహత్యయినా, పొరపాటున కాలిపోయి మరణించినా—ఇవాళ యిది పోలీసుకేసయిందా నానా గొడవా జరుగుతుంది..." అన్నాడు.

# ★ భార్యా కురూపి...? ★

శాంతారాం అతనివైపు సానుభూతితో చూశాడు:

"మీ బాధ నాకు అర్థమయింది వాసుదేవ రావుగారూ. కాని డాక్టరు రిపోర్టు ఇద్దాక కూడా నేను వ్యక్తిగతంగా ఈ రహస్యాన్ని ఎలా దాచెయ్యగలను చెప్పండి!"

వాసుదేవరావు మాటాడలేదు.

సబ్ ఇన్స్పెక్టర్ ఆలోచనలో పడ్డాడు: జానకికి నిజంగా ఎవరు శత్రువులుంటారు? ఎవరో దొంగలు వచ్చి నగలు దోచుకోవడం కోసం ఆమెను హత్యచేసివుంటారా? లేక... ఆమె నైతిక ప్రవర్తన ఎలాంటిది?

భర్త ఇన్నాళ్లుగా వాసుదేవరావుగారింటి పక్కన వుండికూడా, ఆమెను తప్పు పట్టుకున్నాడంటే... ఏమో! జలరాంధ్ర చిత్తము...

ఆమె దేవుడింట్లో చనిపోయింది. ఒకవేళ 'వాడు' ఆమెను పీక పిసికి, ఇది ఆత్మహత్యగా అనుకోవాలని ఆమె చీరకు అగ్గి పెట్టివుంటాడా?

అతని కంతా అయోమయంగా తోచింది.

## 3

ఈ కేసు 1949లో రాజమండ్రిలో జరిగింది. పోలీసుడైరీలో 'క్లూ' దొరక్కుండా ఈనాటికీ అపరిష్కృతంగా వుండిపోయిన కొద్ది కేసుల్లో యిదొకటి!

రకరకాల అపరాధపరిశోధకులు, పోలీసు శాఖవారు ఈ కేసు విషయంలో చూపించిన ప్రత్యేక శ్రద్ధాసక్తులు బూడిదలో పోసిన పన్నీరైనవి. అయితే వాళ్ళు కనిపెట్టిన కొన్ని కొత్త విషయాలు డిటెక్టివ్ సుందరానికి కొంతవరకూ తోడ్పడ్డాయి.

హత్య ఎనిమిది, తొమ్మిది మధ్యలో జరిగింది. ఈ హత్య జరిగాక హంతకుడు ఆమెను కాల్చాలని కాల్చాడు. అందువల్ల హంతకుడు చాలా తెలివైనవాడైవుండాలి.

ఆమె మెడలో నెక్లెసు, ఒక గొలుసూ వున్నాయి. అవి ఆమె మెడలోనే వున్నాయి. అదిగాక ఆ యింట్లో ఏవస్తువులు కానీ, డబ్బుగాని పోలేదు. కాబట్టి హంతకుడు దొంగయివుండడు.

జానకికి మరొకరితో ప్రేమకథ వుండి వుండొచ్చునని కొందరు అపరాధ పరిశోధకులు ఆమె జీవిత విశేషాలు సేకరించారు.

ఆమె చాలా పేద కుటుంబంలో జన్మించింది. తండ్రీ, తల్లీ పెద్ద సంస్కారవంతులు కారు. అందువల్ల ఆమె కూడా పెద్ద చదువులు చదవలేకపోయింది. అయినా తల్లివల్ల చిన్నతనం నుంచీ దైవభక్తి, పాపభీతి ఆమె రక్తంలో జీర్ణించుకుపోయాయి. ఆమె సౌందర్యవతి కాదు. ముఖం చూస్తే కొంత వికృతంగా వుంటుందికాని, మరీ వికృతంగా కనిపించదు. ముందుకు తోసుకొచ్చిన నాలుగు పళ్ళూ నాసికారంధ్రాలని మరింత పెద్దవి చేయటంవల్ల ఆ వికృతి వచ్చిందేకాని ఆమె వికలాంగి మాత్రం కాదు. ఆమె ఎవరినీ ప్రేమించలేదు... ఇదీ ఆమె గురించి వాళ్ళు తెలుసుకున్న విషయం. ఆమె వాసుదేవరావుకి మేనకోడలు కావటమే వాళ్ళిద్దరి వివాహానికి దారి తీసింది.

ఈ రిపోర్టంతా చూశాక, సుందరానికి విచిత్రమైన అనుమానాలూ, ఆలోచనలూ కల్గాయి.

"వాసుదేవరావుకి జానకంటె ఇష్టమేనా?"

"వాసుదేవరావు తమ్ముడు హనుమంత రావు ఎలాంటివాడు?"

"అసలు వాసుదేవరావు వ్యక్తిగతంగా ఎలాంటివాడు?"

ఈ ప్రశ్నలు అతన్ని కలవరపెట్టాయి.

సుందరం మొట్టమొదటిసారి హనుమంతరావు మీద తన ప్రయోగాలు సాగించాడు. కాలేజీలో అతని ప్రవర్తన ఎలాంటిదో వాకబు చేశాడు. ప్రిన్సిపాల్, లెక్చరర్లూ అతని 'క్యారక్టర్' 'కాండక్టు' మంచిదేనని చెప్పారు. అదీకాక అతను చిత్రకారుడు కావడంవల్ల అతనిదంతా మరో ప్రపంచమని చెప్పారు.

సుందరానికి హనుమంతరావుని స్వయంగా పరీక్షించాలనిపించింది. ఒకనాడు కలుసుకొని 'కళ' గురించి ప్రస్తావించి, అతని అభిప్రాయం అడిగాడు.

హనుమంతరావుకి చిత్రకళ గురించి అంతగా తెలీదు. అయినా తన చిత్రాల గురించీ, వాటి ఉత్పత్తిగురించీ విపులంగా చెప్పగలిగాడు.

"మీ చిత్రాల్లో భావం ప్రధానం కాదా?" అన్నాడు సుందరం.

"భావం లేకపోతే, నా చిత్రాలకి ప్రాణంలేదు," అన్నాడు హనుమంతరావు.

సుందరం కాసేపు వూరుకొని అతని చిత్రాలన్నీ చూస్తూవున్నాడు. హనుమంతరావు సాయంకాలం తనింటికి రమ్మన్నాడు.

సుందరం సాయంకాలం హనుమంతరావు ఇంటికి వెళ్ళాడు. ఇంట్లో వాసుదేవరావు లేడు. హనుమంతరావు తనచిత్రాలన్నీ అతనికి చూపించాడు. కాని అతనికి కావలసినభావంకల చిత్రం ఒకటీ కనిపించలేదు.

సుందరానికేం పాలుపోలేదు. చివరకు అన్నాడు:

"నాకో భావం తట్టింది. దానికి స్వరూపం ఇవ్వాలి మీరు."

"చెప్పండి."

"నాకు తెలిసిన అమ్మాయి వుంది. చూడ్డానికి చాలా వికృతంగా వుంటుంది. ముందున్న నాలుగుపళ్ళూ పైకి తోసుకొచ్చి నాసికారంధ్రాలని మరింత పెద్దదిచేయటంవల్ల ఆ వికృతం వచ్చింది. ఆమెనుచూస్తే నాకెందుకో కోపం. ఆమెను ఎప్పుడైనా చూస్తే చంపెయ్యాలని బుద్ధిపుట్టేది. అలా అందవికారంగా వుండటం ఆమెతప్పు కాదు. అయినా నాకు ఆమెమీద కోపమే. ఆమె ఒకనాడు కాలిపోయింది. ఆ కాలిపోతున్నప్పుడు ఆమెచేస్తున్న ఆక్రందన ఏదో నా హృదయాన్ని కరిగించింది. ఏ వికృతాకారాన్నయితే నేను ద్వేషిస్తూవచ్చానో, ఆ వికృతాకారాన్నే నేను రక్షించేందుకు ఆమంటల్లో దూకాను. మానవహృదయానికుండే సహజమైన సానుభూతి అప్పుడు నాలో విజృంభించింది... దీనికి సరైన రూపకల్పనయివ్వాలి మీరు."

హనుమంతరావు, తన భావనాశక్తినంతనీ ఉపయోగించి ఆ భావానికో రూపాన్నిస్తానన్నాడు.

వారంరోజులతర్వాత హనుమంతరావు చిత్రాన్ని తయారుచేశాడు. ఆ చిత్రాన్ని చూశాక సుందరానికి నవ్వాలనిపించింది. అందులో తను ఆశించిన 'సింబాలిజమ్' కొంతయినా కనిపించలేదు. తనుకావాలని జానకి వికృతాకారాన్ని అతనికి వర్ణించి చెప్పినా, ఈచిత్రంలో జానకి ఆకారాన్ని మాత్రం అతను కొద్దిగానైనా చిత్రించలేదు. అందువల్ల హనుమంతరావుకి వదినమీద ఎలాంటిప్రేమా, ద్వేషం లేవని నిశ్చయించుకున్నాడు.

ఇహ మిగిలిందల్లా వాసుదేవరావు!

## 4

ఒకయేడాది గడిచింది.

వాసుదేవరావుకి సుందరానికి స్నేహం హెచ్చింది. స్నేహంతోపాటు ఆత్మీయత కూడా హెచ్చింది. ఈ పరిచయంతో సుందరం, వాసుదేవరావు మనస్తత్వాన్ని చాలవరకు అర్థంచేసుకోగలిగాడు. అయితే సుందరం అపరాధ పరిశోధకశాఖకి చెందినవాడని వాసుదేవరావుకి తెలీదు.

ఒకనాడు సుందరం పుట్టినరోజు పండుగ చేసుకున్నాడు. ఆ సాయంకాలం టీపార్టీ అయింది. పార్టీకి పెద్దపెద్దవాళ్ళందరూ సతీసమేతంగా హాజరయ్యారు. ఒంటరిగా హాజరయింది కేవలం ఒక వాసుదేవరావే!

పార్టీకిముందు గానసభ జరిగింది.

జరుగుతున్నంతసేపూ సుందరం వాసుదేవరావువేపు పరిశీలనగా చూడసాగాడు. తర్వాత మెల్లగా అతని పక్కకి చేరాడు.

"మీరు మరోలా భావించకండా వుంటె ఒకటడుగుతాను."

"చెప్పండి."

"మరో పెళ్ళి మీరెందుకు చేసుకోరు?"

వాసుదేవరావు అతని వైపు విచిత్రంగా చూశాడు. తర్వాత అదోలా నవ్వుతూ తలవంచేసుకున్నాడు.

అంతలో సుందరం భార్య సుగుణ అక్కడికివచ్చి లాయరు రమణరావుగారు ఎందుకో రమ్మంటున్నారని చెప్పింది. అప్పుడు చూశాడు వాసుదేవరావు సుందరం భార్యని! ఎంత అందంగావుంది!

క్షమించమని చెప్పి సుందరం, భార్యతో కలసి అటువేపు వెళ్ళాడు.

వాసుదేవరావుకి యిహ అక్కడ వుండాలనిపించలేదు; మెల్లగాలేచి గేటులోంచి బయటకు వెళ్ళిపోయాడు. ఆ వెళ్ళడం వెళ్ళడం తిన్నగా గోదావరిఒడ్డుకెళ్ళి ఇసకలో కూచున్నాడు ఆలోచిస్తూ రెండు గంటలసేపు.

నెల దినాల తర్వాత ఒకనాడు సుందరం వాసుదేవరావుదగ్గర కొచ్చాడు. ఏదో పిచ్చాపాటీ మాటాడుకొంటూ మాటమీద మాటొచ్చి సుందరం—

"ఈమధ్య మా స్నేహితుడొకడు ఒక పత్రిక పెట్టాడు. దానికి మేటరులేక కొట్టుక ఛస్తున్నాడు. వీలుంటె మీరు ప్రతీమాసం 'మనసమాజంలో వివాహ సమస్య' అని వ్యాసాలు వ్రాస్తారూ?" అన్నాడు.

వాసుదేవరావు తిన్నగానవ్వి: 'చూస్తాను' అన్నాడు.

"చూస్తానంటే కాదు. ఇంతకముందు మీరు పత్రికలో వ్రాస్తే మన స్తత్వానికి సంబంధించే వ్యాసాలు చదివి చాలా సంతోషించాను. అలాంటి వ్యాసాలయినా సరే- ఏదో ఒకటి- అతని పత్రిక్కి మేటరు కావాలి."

"రాస్తానులెండి" అన్నాడు.

వారం దినాల తర్వాత సుందరం మళ్ళీ అతని దగ్గరకు వచ్చాడు.

"వ్యాసం రాయలేకపోయాను" అన్నాడు వాసుదేవరావు క్షమించమన్నట్టు ముఖం పెట్టి.

"మరి"

"ఒక నవల వ్రాశాను. వీలైతే అది ఉపయోగించుకోమనండి."

"ఇవ్వండి."

వాసుదేవరావు నాలుగువందలపేజీల పెద్ద వ్రాతప్రతినితీసుకొచ్చి అతనికిచ్చాడు. సుందరం మొదటపేజీ చూశాడు. 'భార్యా కురూపీ—?'-అది ఆ నవలశీర్షిక. సుందరం వ్రాతప్రతిని టేబిలుమీద వుంచి,

"భార్యా కురూపీ—? అంటే?" అని ఆశ్చర్యంగా అతని వేపుచూసి, ఆ లోపించిన దానిని పూర్తిచేస్తున్నట్టు: "శత్రువా?" అన్నాడు.

"చదవండి" అన్నాడు వాసు ముక్తసరిగా.

సుందరం ఆ వ్రాతప్రతిని తీసుకొని వెళ్ళి ఆరాత్రంతా దీక్షగా చదివాడు.

అందులో కథ ఏమీలేదు. కథ చిన్నదే కాని కథానాయకుని మానసిక ప్రవర్తన రచయిత అమోఘంగా చిత్రించాడు.

ఆ నవలలో కథానాయకుడు ఒక కళాకారుడు. అతనికి సంఘంలో హోదా, పేరూ, మర్యాద వున్నాయి. కాని అతని వూహలకి, భావాలకి తగిన సహచరి దొరకలేదు. అతను పిరికివాడు. అందువల్ల తల్లిదండ్రుల్ని ఎదిరించలేక, వాళ్ళు తెచ్చిన సంబంధాన్ని ఒప్పుకొని పెళ్ళి చేసుకొంటాడు.

పెళ్ళయాక అతను తన భార్యను చూసుకుంటాడు. ఆమె ముఖంలోకాని, మాటలోకాని ఏలాంటి సౌందర్యమూ అతనికి కనిపించలేదు. ఆమె బాగా పల్లెటూరి నుంచి వచ్చిన పిల్ల. కాని అతని కళాహృదయం ఆమెలో అక్కడా యిక్కడా దాగివున్న సౌందర్యాన్ని లక్షరెట్లు ఎక్కువ చేసుకొని తృప్తిపడబోయేది.

ప్రపంచంలో ఏవ్యక్తీ ప్రేమించనంతగా తన భార్యను ప్రేమించేవాడు. అందమైన ఆడవాళ్ళని చూసినపుడు మాత్రం ఎందుకో దిగులుగా కూలిపోయేవాడు. ఆ సౌందర్యరాశుల భర్తల్నీ, దాంపత్యాన్నీ వూహించుకున్నాడుమాత్రం అతను పిచ్చెత్తినట్లు

# ★ భార్యా కురూపీ...? ★

తిరిగేవాడు. ప్రపంచమంతా సౌందర్యంతో, మాధుర్యంతో మురిసిపోతూంది, తనుమాత్రం అలా ఎందుకు మురిసిపోకూడదు అనుకునే వాడు.

రాను రాను అతను ఈ భావాలతో స్వప్నవిహారి అయిపోయాడు. భార్య ఎదురు పడినప్పుడుకూడా అతనికి భార్య భౌతిక రూపం అగుపించేది కాదు. ఆమె అంతరంగంలో ఒక ఊర్వశి, రతీదేవి కనిపించేది?

అతను తరచు సాహిత్య, సంగీత సమావేశాలకి వెళుతూ వుండేవాడు. అప్పుడప్పుడు ఉపన్యాసాలు యిచ్చేవాడు. ఇది అతనికి చాలమందితో స్నేహానికీ పరిచయానికీ దారి తీసేది. పరిచయస్థులు ఎక్కువగా స్త్రీలే. వాళ్ళల్లోని అందం, లావణ్యం, చురుకుతనం అతన్ని ఏడిపించేవి.

తన కురూపిభార్యను ప్రపంచమంతటిలోకీ సౌందర్యరాశిగా భావించుకోవటం ఆత్మవంచనేమో అని బాధపడ్డాడు. ఈబాధ ఎవరితో చెప్పకోలేదు. ఈ బాధకి ఉపశమనం కలగకపోవడంతో పిచ్చెత్తిపోయేవాడు. ఆపిచ్చితో అతనికి కోపం హెచ్చేది. హెచ్చుకావటంతో భార్యను మరింత ప్రేమమూర్తిగా, సౌందర్యరాశిగా ఆరాధించేవాడు.

ఈ విచిత్ర భావావేశం అతని జ్ఞాపకశక్తిని క్షీణింపచేసేది. ఇహ అతనికి ప్రపంచమంతా భార్యే అయింది. ఇరవైనాలుగు గంటలూ ఆమె ఎదురుగా, కూచుని కాలం గడిపేవాడు. మనుస్సులోని బాధ హెచ్చేకొద్దీ భార్య మీద ప్రేమ అధికమయేది. ఈ బాధ క్షణక్షణానికీ హెచ్చిపోవడంతో, ఇహాభరించలేక ఒకనాటి రాత్రి ఎక్కడికో పరారి అయిపోయాడు.

ఇదీ కథ.

కథంతా పూర్తిచేశాక సుందరం హుషారుగా లేచాడు.

మర్నాడు వ్రాత ప్రతిని తీసుకొని వాసుదేవరావు యింటికి వెళ్ళి—

"ఈ కథచివర్లో కొంత మార్పుచెయ్యాలి సుంటుందేమో!" అన్నాడు.

"ఏమిటా మార్పు?" అన్నాడు వాసుదేవరావు.

"ఇందులో కథానాయకుణ్ణి పరారి చేసేకంటె, అతనిలోని బాధ, కోపం, కసి ఆకురూపి భార్యను పీకపిసికి చంపివేసేట్టు చూపిస్తే మరింత బావుండేదేమో!"

అగ్నిపర్వతాలు ఒక్కసారి బ్రద్దలయ్యాయి. లక్ష ఆటంబాంబులు ప్రేలిన బీభత్సం కలిగింది.

వాసుదేవరావు నోట మాటలేదు. కనురెప్పలు పడలేదు! అతని ఎదురుగా వున్నది ఎవరో కూడా గుర్తులేదు. అతనికి ప్రపంచమంతా తిరుగుతున్నట్టనిపించింది. కాళ్ల క్రింది భూమి క్రుంగి పోతోంది. లావాద్రవం అతన్ని చుట్టుముట్టింది.

చాల సేపు నిశ్శబ్దం!

వాసుదేవరావు నోరు ఎండిపోయింది!

సుందరం వ్రాత ప్రతి అతనికి అందిస్తూ లేచి నిలబడి—

"క్షమించండి వాసుదేవరావు గారూ! నేను ఏ పత్రికకూ విలేఖరిని కాను. మీ భార్య హత్యకేసులో ప్రభుత్వం నియమించిన డిటెక్టివ్‌ని" అన్నాడు.

## 5

డిటెక్టివ్ సుందరం అన్నాడు:

"ఈ నవలకు మీరు "ఆత్మకథ" అని నామకరణం చేసివుంటె ఎంతో బావుండేది. కాని మీకా ధైర్యం లేదు. మీతో నాకు రమారమి రెండేళ్ళ పరిచయం వుంది. ఆ పరిచయంతోనే మీ మనస్తత్వాన్ని నేను చాలవరకు అర్థం చేసుకోగలిగాను. ఆ నాపరిచయంతోనే, మీ నవల చదివాక మీ భార్యను చంపింది మీరే అనే నిర్ణయానికి వచ్చాను.

"రచయిత సాధారణంగా తన కథలో, చాలావరకు తన భావాలని వ్యక్తపరుస్తాడు. ఆ భావాలు పూర్తిగా తన మనస్తత్వానికి ముడిపడి వున్నప్పుడు కథని మరింత హృద్యంగా వ్రాయగలడు. అదీగాక 'భార్యా కురూపీ—?' అనే మీ నవలలో ఆ 'షేప్'... తర్వాత ప్రశ్నార్థకం నాలో మరింత అనుమానాలనీ, శంకలనీ కరిగించింది. 'భార్యా కురూపీ శత్రుః' అని పూర్తిచేసుకొని కథ చదివాను.

"కాని చివర్లో మీకు భార్యను చంపినట్టు వ్రాసేంత ధైర్యం లేక పోయింది. అందుకే నాయకుణ్ణి పరారి చేసి వొదిలేశారు.

"నేను ఈ చుట్టుపక్కల వాళ్ళను బాగ వాకబుచేసి చూస్తే, మీరు మీ భార్యను ఏనాడూ పల్లెత్తుమాటకూడా అనలేదని, ఆమెను ప్రాణసమానంగా చూసుకొనే వారనీ తేలింది. ఆ మీ ప్రేమ మీలోని మూగబాధకి ప్రతిఫలం. ప్రపపంచమంతా సౌందర్యంతో నిండివున్నా, మీ సహచరి మాత్రం కురూపి కావటం మీరు భరించలేక పోయినా, మీలో ద్వేషం విచిత్రమైన ప్రేమగా మారి, ఆమెను ప్రాణ సమానంగా ఆరాధించేట్టు చేసింది. కాని మీలోని కోపం మాత్రం అణిగిపోలేదు.

"1949 కార్తీక సోమవారం రాత్రి మీరు ఒక స్నేహితునింట్లో టీపార్టీల్లో వున్నారు. ఆవాళ రాత్రే మీ భార్య కాలిపోయింది. ప్రపంచమంతా ఆమె కాలిపోయిందే అనుకున్నారు కాని, ఆమెను ఎవరో హత్యచేసి కాల్చివేసినట్టు అనుమానించలేదు. అయితే ఈ హంతకుడెవరు? ఆ 'ఎవరో' మీరు కారనేందుకు మీకు పెద్ద 'ఎలిబీ' వుంది. కాని మీరు ఆవాళ పార్టీనుంచి సరిగ్గా ఎనిమిది గంటలకు ఇంటికి వచ్చేశారు. మీరు రావడం ఎవరూ చూడలేదు. నేను ఋజువు చెయ్యలేను కూడా. ఆ రావటానికి కారణం మీ ద్వేషం.

"ఆ మధ్య మీకు నా పుట్టినరోజు పండక్కి పెద్దపార్టీ యిచ్చాను. ఆ వాళ కూడా మీరు సగంవరకు వుండి ఎవరికీ చెప్పకండా ఇంటికి వెళ్ళిపోయారు. ఎందుకు ఆ 'ఎందుకు?' అనే ప్రశ్నకు 1949 కార్తీక సోమవారం నాటి రాత్రి పార్టీ నుంచికూడా మీరు ఇంటికి వెళ్ళిపోవడమే సమాధానం! పార్టీలో మీకు కావాలని నా భార్యను మీ ఎదురుగా రప్పించాను. అందమైన స్త్రీలను చూస్తున్నపుడు మీకు కలిగిన ఆవేదన, భరించరానిదై మీ భార్య అందవిహీనతమీద కసినీ, కోపాన్నీ హెచ్చించి ఆమెను శాశ్వతంగా మీ ఎదుటనించి తీసేసేటట్టు చేసింది. అవునా? అవునా?

వాసుదేవరావు మాటాడలేదు.

ఏమిటి మాటాడగలడు?

అతని కళ్లనిండా నీళ్లునిండాయి. అవి మీద పడలేదు. అతని గుండెల్లో ఇంకి పోయాయి! ★

# దొరికిన రూపాయలు

అంతరరాష్ట్రీయ ఋణ సేకరణ సంస్థా, అఖిల భారత అప్పులు ఎగవేసేవారి సమాఖ్యా సమకాలిక సోదరసంస్థలు. ఒక దానిలో గౌరవ సభ్యులు మరో దానిలో బోర్డు డైరెక్టర్లు. ఒక దానిలోని కార్యవర్గ సంధాన కర్తలు మరో దానిలో 'అడ్-హాక్' కమిటీని ఆక్రమించారు. ఋణ సేకరణసంస్థ తాలూకు కార్యాచరణ సమితిలో పాల్గొనే వారు ఎగవేసే సమాఖ్య తాలూకు 'రన్నింగ్ కమిటీ'కి ఎన్నికయ్యేవారు.

పై సంస్థల తాలూకు ఫౌండరూ్న, శాశ్వత సభ్యులూ అయిన శ్రీవారూ, కోనేటిరావూ, విశ్వంభరుడూ, సూర్యం ఆంధ్ర దేశంలో పుట్టి పక్కా ఆంధ్రత్వంలో (తో) పెరిగి, ఆంధ్రదేశపు గడ్డమీద వుద్యోగం వెలిగిస్తూ సద్యోగం చేస్తున్న ఆంధ్ర జాతి మణిపూసలు—శ్రీ వారికి... నేను, వాడు, మా వాడనీ; కోనేటిరావుకు... కోనేటి, కోనిగాడు, కోనారావనీ; విశ్వంబరునికి...విస్సిగాడు, విశ్వంభరి గాడనీ; సూర్యానికి...సూరిగాడు, సూరయ్యనీ మారు పేర్లు చెలామణీలో వున్నాయి.

పై సంస్థల విస్తృత కార్యక్రమంలో మా నలుగురి పంథాలూ, థియరీలు, థీసిస్‌లూ, వేరైనా...ధ్యేయం ఒకటే కొబట్టి గమనం వేరైనా గమ్యం ఒకటే అవుతోంది.

మా సంఘానికి ముఖ్య బాంకర్లు—విస్సిగాడి మేనమావ, చిల్లరకొట్టు సీతయ్య. అదట్లా వుండనీండి.

ఈ వుద్యమంలో తల నెరిసిని శ్రీవారూ, విశ్వంభరుడూ ధనం సేకరించటానికి బయలు వెడలే ఫక్కీయే వేరు. వెళుతుంటేనే ముఖం బిగుసుకు పోతుంది. 'సీరియస్ నెస్' పిలిచినట్లుగా పరుగెత్తుకొస్తుంది. వీడేదో బ్రహ్మాండమైన ఆపదలో చిక్కుకున్నాడని ఎదుట వాడిమీద 'మహా ఇదిగా' ఇంప్రెస్ చేసేస్తాం. అంతవరకూ మా యిద్దరి పంథా ఒకటే. అర్జీ పడెయ్యటంలోనే వున్న భేదమంతా...

"ఇదుగో మూర్తీ...మళ్ళీ తెచ్చిస్తా!... ఓ ఫైవర్ పడేయ్...చాలా అర్జంటు..." అని శ్రీవారు ఉటంకిస్తారు.

"ఏరోయ్ మూర్తీ...నే నడిగింది ఏం చేశావ్?...ప్చ్!...నువ్వన్నీ ఇంతే!... ఎబ్బే...నరే ఎడ్వాన్సు బుకింగ్ ఓ ఫైవ్ చిప్స్ జార్చు..." అని విశ్వంభరిగాడు సాగిపోతాడు.

"ఓయ్ మూర్తీ...అవునోయ్ పరీక్ష కెళ్లావుగావును ఎట్లా వ్రాశావేమిటి?... పిల్లా మేకా అంతా కులాసా!...ఇంటి కొడినించి వుత్తరం వచ్చిందీ?...అవును గాని మూర్తీ...చాలా అవసరమోయ్... అయిదు రూపాయిలివ్వు...మళ్ళీ నెలాఖరుకు సర్దేస్తా...ఏమిటి...కొదనవులే!... నాకు తెలుసుగా (కొంచంగా నవ్వుతాడీ సమయంలో...వీడి మొఖంముండ...నవ్వెట్లా వస్తుందో?!)—మూర్తి......ఇదుగో చూసావ్" అని కోనిగా డుపక్రమిస్తాడు.

ఇఖ మా సూరిగాడి పద్ధతి మరీ బరితెగిన పద్ధతి "ఏంయ్ మూర్తీ—ఒకయిదు రూపాయిలిట్లాతే!..." అని టఖీమని బాకీవున్నట్లు పేల్చినట్లు అడిగేస్తాడు.

ఇవీ సేకరణ పద్ధతిలో మాలోని భేదాలు.. ఇఖ ఎగవేసే కార్యక్రమంలో ముందంజ కోనేటిరావుదే...

## "వసంత్ విహార్"

"సారీ!—మూర్తి, ఈ నెల్లో సర్దలేకపోయాను ... మరేమనుకోకు ... సరేగానే ఇంకా ఆ హోటలు మెతుకులే గతుకుతున్నావా ... అది మరీ పాడు అ!... కాదూ? !..."

"నాట్ మిస్టర్ మూర్తీ...ఎడ్జస్ట్ మెంట్ కుదరక చస్తున్నానోయ్...ఈ నెల్లోకూడా ఓ 'టెనర్' పడేయ్ ... రెండూ...కలిపి..." అని శ్రీ వారు రెండోదానికి పాచిక వేసి మొదటి దానికి ఎసరు పెడతారు.

"డామిట్!...మా అంకుల్ యమ్. ఓ. చేస్తానన్నాడు. ఎందుకనో చెయ్యలేదు... టెలిగ్రామన్నా ఇవ్వాలి టి. యమ్. ఓ. చెయ్యమని. అది నయం కాదు మూర్తీ!..." అని సలహా అడుగుతాడు మా విశ్వంభరిగాడు.

"అమ్మ బాబోయ్...మూర్తల్లేవుండే!.." అని ఎగిరి గంతేసి పక్క సందులోకి దూరతాడు మా సూరిగాడు. అదే వాడిదగ్గరున్న వైశిష్ట్యం "భయమేమిట్రా నాయనా! మమ్మల్ని చూడు ... ఎంచక్కా ... మాలా..." అని చెప్పినా సరే సాగివస్తున్న వాడల్లా వాణ్ని చూసి జారుకుంటాడు.

"ఎబ్బే ఇట్లా అయితే వీళ్లి కార్యవర్గం నుంచి బహిష్కరణ్ చెయ్యాల్సిందే" అని రిమార్కిస్తాడు విస్సిగాడు.

* * *

ఈ మా సంఘాల కార్యక్రమం వగైరాలు మీ ముందుంచుతున్నానంటే సంఘాల తాలూకు 'పబ్లిసిటీ ఇన్‌చార్జి'గా నా 'కుండుకున్నట్టి' బాధ్యతని దులపరించుకు పోదామనే దురుద్దేశ్యం నాలో ఏ కోశానా కంచు కాగడా వేసి వెదికినా కన్పడదు. ఈ మధ్య మా మీద వ్యక్తిగతంగానూ, సంఘ పరంగానూ ప్రచారమవుతున్న దుష్ప్రచారాల్ని ఖండించి, నిజాన్ని మీ ముందుంచటమే నా వుద్దేశ్యం...

అయితే మీరేమన్నా అనుకోండి... ఈ రోజున మేం యీ సంఘాల్నించి మూకుమ్మడిగా తప్పుకున్నా, ప్రతిచోటా, ప్రతి మధ్యతరగతి కుటుంబమున్న చోటా యీ సంఘాల తాలూకు శాఖలో, పాయలో విలసిల్లక మానవు...

అజేయమైన, శాశ్వతమైన, నిత్యమైన, సత్యమైన, మా సంఘాల ధ్యేయం పరమోత్కృష్టమైందని నేను వేరేఘోషించక్కర్లేదు. మూర్తిగాకపోతే శాస్త్రి, లేక శర్మ...రావు ...చౌదరి ... నాయుడు ... సులేమాన్, పీటర్ ఎవరో ఒకరు దారిన పోయ్యే దానయ్యలు ... ఎవడైతేనేం, స్తోమత కావాలి, మర్యాద తెలిసుండాలి. అంతే...

"అసలింతకీ ఇదంతా ఎందుకు చెప్పొచ్చానంటే ఆరోజు మా క్కావాల్సిన రెండు రూపాయలు 'బ్రహ్మప్రళయం' వచ్చినా దొరకలేదు. దొరుకుతాయనే నమ్మకం కూడా లేదు.

కానీ ఓ ఘోర్పుహూర్తం జరిగింది. ఆవాళ సాయంత్రం కోనేటిరావు ఇంటికెళుతూ నేలమీద ఏదో పోయినట్లు వెతుక్కుంటున్నట్టు వెదుకుతుంటే... బాగా ఎరుగున్నాయన ఎవరో...

"ఏమిటండీ వెతుకుతున్నారు." అని అడిగాట్ట...ఎరక్క... సెరక...కోనిగాడు లిక్కముఖం వేసి జేబు తడుముకుంటూ...

# దొరికిన రూపాయలు

"రెండు రూపాయ..." అన్నాట్ట మాట పెగలక మింగుతూ...

"అరెరే!...పాపం. పోశాయండి...అవెక్కడ దొరుకుతయ్... నే నిస్తాలెండి... ఇంటికొచ్చి వాళ్ళనిప్పట్టుకెళ్లండి...తర్వాత సర్దుదురుగాని... దానికేమిటి లెండి... అవి ఎవడికో దొరికుంటాయ్..." అని కోనేటిని మాట్లాడనీకుండా రెండు కాగితం ఒకటి చేతిలో కుక్కి ఎవరినో పిలుస్తూ గబ గబా వెళ్ళిపోయాట్ట.

మావాడు గుక్క తిప్పిచేసి, 'కలా... నిజమా' అని చెయ్యిచూసుకొని, గిల్లుకొని గుప్పిడి గట్టిగా మూసి పరుగెత్తుకొచ్చి నా ముందు వాలాడు... మాటా మంతీ లేకుండా రొప్పుతూ... రొప్పుతూ... ఆ రెండు కాగితం చూపించి గుట్టప్పగించాడు.

"ఏమిట్రా అబ్బీ — యీ హడావుడి: ఇదెక్కడిది!...?" అని ఆశ్చర్యంగా అడిగా—

"వెధవ లేదని అబద్ధమాడాను...అది తెలుసుకుంటేనట్టు కుట్టి ఇక్కడకు తోలుకొచ్చింది. లేకపోతే సంఘాన్ని మోసం చేస్తాడా... అకటా;..."

"ఏంరా బాబూ!... ఎక్కడున్నా జేబు కొట్టలేదు కదా!... ఓరే సూరీ అటు చూడు... ఎవరన్నా పోలీసు ఇటు వస్తున్నాడేమో..." అని సూరిగాడూ, విశ్వంభరుడూ వాణ్ణి ముంచేస్తున్నారు.

"ఆగండిరా బాబు. వాణ్ణి చెప్పనీండి.." అన్నా నేను. వాడు పోటీపడి కథంతా వెళ్లగక్కాడు...

"ఎవర్రా ఆయన?"

"నేను బజారు వెంబడి వెతుక్కుంటూ వెళుతుంటే... 'ఎందుకు వెతుకుతావు లేవయ్యా... పోయింది దొరుకుతుందా... నేనిస్తా లేవు సర్దుకుపోగానే...' అని ఇచ్చాడ్రా!..."

"నువ్వు బజారువెంబడి ఏన్ని వెతుకుతున్నావ్?..."

"మనకి రెండు రూపాయలెక్కడా దొరకలేదుగా!... రోడ్డు వెంబడన్నా ఎవరన్నా పోగొట్టుకుందురా... మనకు దొరక్కపోతుందా...అని వెతుకుతూ వెళ్లాను..."

"అరి పిడుగా!... ఓరే కార్యదర్శీ... కోనేటిరావును బోర్డు ఛైర్మన్ గానూ, ఆ సీతయ్యగార్ని ఎఫిలియేట్ ఛాంకర్ గానూ మన లిస్టులో జేర్చు... ఒరే కోనేటి రేపు బోర్డు మీటింగులో నువ్వు 'అప్పు చెయ్యటం' అనే దానిమీద నీ 'థీసిస్' చదువు..." అన్నా నేను హుందాగా. ★

# మృగహేళన

### ౧

మహారణ్య సరోవర తరంగాలపై హంస మిథునాలు హేలగా ఉయ్యాలలూగాయి. సాయంకాల సూర్యకిరణాలు హంసల రెక్కలపైబడి అలాగే జారి పోయాయి. ఆ నిశ్చల సరోవరం పరిసర మహారణ్యానికీ, పైనున్న విశాలాకాశానికీ ఒక పెద్దవెండి అద్దంలా స్వచ్ఛంగా ప్రకాశించింది.

ఒక హంసమిథునం ఒయ్యారంగా తేలుతూ సరోవరంలో పచ్చలగొడుగులా పైకి పెరిగిన ఒక తామరాకు నీడలో నిలిచింది. అంతలో మగ హంస తన తెల్లని రెక్కలో ముక్కుంచి ప్రాగన్ను పెట్టి హాయిగా నిద్ర పోయింది.

ఒక చక్రవాక మిథునం ఆ పక్కనే నీటిలో అల్లల్లాడే తామరాకుమీద వాలింది. వెనువెంటనే దానిపై కెంపుల్లా తళతళలాడే నీటిబిందువులన్నీ కొలనిలోనికి దిగజారాయి. ఆ అలికిడికి బెదిరిన చిరుమీనులొకటి రెండు తళతళ మెరుస్తూ పైపై కెగిరిపడ్డాయి. సాయంకాల కిరణాలలో ఆ మీనుల చిరుమెరుపు లత్యంత మనోహరంగా స్ఫురించాయి. మగ చక్రవాకం తటాలున పైకెగిరి పోయింది. దాని రెక్కల రెపరెపలు నిర్మల కాసారంలో ప్రతిఫలిస్తూ క్రమక్రమంగా అదృశ్యమైపోయాయి.

స్వరోచి హృదయం క్షణకాలం ఆ సరోవర సౌందర్యంలో తన్మయమై ఓలలాడింది.

మరి ఒకక్షణంలో ఆప్రాంతంలోఅంతటా కలకల నవ్వులు, కంకణ ఝుణత్కారాలు, కాలి అందెల రవళులు, మొలనూలి మువ్వల గలగలలు వ్యాపించాయి.

అంతలో ఒక సుందరి హఠాత్తుగా వచ్చి అతని రెండుకళ్లు మూసింది. తన ముగ్గురు భార్యలలోను అలాగ హఠాత్తుగా కన్నులు మూసినవారెవరో అతనికి తెలియలేదు. కళ్లు మూసిన జవ్వని చేతులు, చెక్కిళ్లు తడిమి చూచాడు. అతని కేమీ బోధపడలేదు. ఆసమయంలో స్ఫురించిన పేరేదో పైకి చెప్పాడు:

"మనోరమ!"

అతని ముగ్గురు భార్యలు కలకలనవ్వారు! కాని అతని కళ్లుగప్పిన చేతులపట్టు విడలేదు. స్వరోచి ఇంకొక పేరు చెప్పాడు:

"విభావసి"

అయినా ఆ పట్టు విడలేదు. మళ్ళీ నవ్వులు వినిపించాయి. స్వరోచి మూడోపే రుచ్చరించబోయాడు. అంతలోనే కళావతి తనచేతి పట్టు విడిచిపెట్టింది:

"ఇక చెప్పక్కరలేదు. ఆ మూడోదాన్ని నేనే. మీ రోడిపోయారు."

అని హఠాత్తుగా అతని కెదురుగా నిలబడింది. ఆమెతోబాటూ ఆ మిగిలిన ఇద్దరు అతనిని గేలిచేస్తూ ఉవ్వెత్తుగా నవ్వారు!

ఆ ముగ్గురు అతనితో ఏవో పరిహాస ప్రసంగా లారంభించారు. ఆ ప్రసంగాలాక మొదలు తుద లేకుండా అలాగే సాగిపోయాయి. వారేమి ప్రసంగిస్తున్నారో వారికే తెలియదు! మహోత్సాహంతో ఉరకలువేస్తూ కలకలలాడే వారి వినోద ప్రసంగాలు అడివిలో లేడిపిల్లల్లా గెంతు గెంతున గంతులువేస్తూ ఆ మహారణ్యంలో కనులకు మిరుమిట్లుగొలిపే అత్యద్భుత దృశ్యాలవైపు, మృగపక్షి మిథునాలవైపు పరుగులు పెట్టాయి.

పరిసరవృక్షచ్ఛాయల్లో ఒంటరిగా తిరుగుతున్న ఒక మొగనెమలి లీలగా పురివిప్పి ఎక్కడో పొదల్లో దాగిన ఆడనెమలి కోసం గట్టిగా కేక పెట్టింది.

"పంచరంగు వన్నెల వీవనలా ఆ నెమలి ఎంత సొగసుగా నృత్యం చేస్తూందో".

నిట్టూర్చింది మనోరమ.

"దాన్ని పట్టుకు తీసుకురాగలవా?"

కన్నుగీటి చిరునవ్వుతో ప్రశ్నించాడు స్వరోచి. ఉన్న ముగ్గురిలోను తన్నే అంత ఆత్మీయంగా పిలిచి ఆ నెమలిని పట్టుకుని తీసికొనిరమ్మని స్వరోచి ఆజ్ఞాపించినందుకెంతో మురిసిపోయింది మనోరమ.

**పి. గణపతిశాస్త్రి**

"ఆఁ! క్షణంలో పట్టుకుని తీసుకు వస్తాను!"

అని మనోరమ ఆ నెమలిని పట్టుకోడానికొక్క పరుగు పెట్టింది. ఆ అదను కనిపెట్టి స్వరోచి కళావతి కళ్లురెండు గట్టిగా మూశాడు.

అతనికి తనమీద ఉన్నంత అనురాగం ఇక మిగిలిన ఇద్దరిమీద లేదనీ, కనుకనే అతడంత గట్టిగా తన కళ్ళు మూసి ఒడిలో కూర్చోబెట్టుకొన్నాడనీ కళావతి ఎంతైనా సంతోషించింది.

కాని స్వరోచి సవ్వడి కాకుండా ఆ ప్రక్కనే కూర్చున్న విభావసి చెక్కిలిపై చిక్కని ముద్దు ముద్రించాడు. ఆ మాయా నాటకం అంతా తనకోసమేనని విభావసి ఎంతైనా మురిసిపోయింది. ఆమె హృదయం ఆనందపారవశ్యంతో ఎగిరి గంతేసింది.

కాని స్వరోచి నేత్రాలు నెమలిని పట్టుకోవడానికి బయలుదేరిన మనోరమవైపు తిరిగాయి. ఆమె ఒకమారు వెనక్కి తిరిగి చూచింది. అంతలో స్వరోచి కొంటెతనం ఆమె కవగతమయింది. ఇక ఎంత తరిమినా ఆ నెమలి దొరకడంలేదని గిరుక్కున వెనక్కి తిరిగి వచ్చివేసింది.

"ఇప్పుడు మీరు ముగ్గురు పూర్తిగా ఓడిపోయారు!"

అని హేలగా నవ్వాడు స్వరోచి. వారు ముగ్గురు అతని కొంటెతనానికి కోపగించిన తీరులో కొంచెంసేపు క్రోధ నటించారు. కాని ఆపైన తమలో పొంగి పొరలుతున్న నవ్వాపుకోలేకపోయారు.

ఆ సుందరుల గానరాగాలు, ఆ ప్రశాంత సరోవరతీరంలో వినిపించే మృగపక్షి మిథునాల కోలాహలాలు స్వరోచిని బాగా మైమరపింపజేశాయి.

తనవంటి భాగ్యశాలి ఇక "నభూతో న భవిష్యతి" అనుకొన్నాడు స్వరోచి. మనోరమ ఇందీవరాక్షుని తనూజ. అతడొక గంధర్వుడు. ఒక మహారణ్యంలో ఒక రాక్షసుడామెను కబళించివెయ్యాలని తరుముకు వస్తూంటే స్వరోచి ఆమె కభయం ఇచ్చి



సంరక్షించాడు. చివరికి రాక్షసుడే ఇందీవరాక్షుడుగా మారిపోయి, తన శాపవృత్తాంతం అంతా స్వరోచికి తెలియజేశాడు. మనోరమ స్వరోచికిచ్చి వివాహంచేశాడు. ఆ ఉపకృతికి ప్రత్యుపకృతిగా ఆమె అతనికి అస్త్రహృదయవిద్య ఉపదేశించింది. ఇందీవరాక్షుడల్లునికెన్నెన్నో కానుకలుబహూకరించాడు. తానెంతో శ్రమించి అభ్యసించిన ఆయుర్వేదరహస్యంకూడా అతనికుపదేశించాడు.

ఇక మిగిలిన విభావసీ కళావతు లిద్దరు మనోరమ చెలికత్తెలు. విభావసి మందార విద్యాధరుని కుమార్తె. ఆమె మృగపక్షి భాష లవగాహనచేసుకునే విద్యలో గట్టిదిట్ట.

కళావతి పారర్షి కుమార్తె. ఆమెకు పద్మినీవిద్య కరతలామలకం. ఆ విద్యారహస్యం తెలిసినవారికి కాకలదప్పికల బాధలుండవు.

విభావసీకళావతు లిద్దరు మనోరమతో కలిసి అరణ్యంలో హాయిగా విహరిస్తూ ఒక వృద్ధముని కోపధాటికి గురయై దారుణ శాపాల పాలైనారు. ఆ శాపాలమూలంగా మనోరమకు రాక్షస బాధ సంప్రాప్తించింది. విభావసీ కళావతుల నిద్దరిని క్షయరోగం

 # మృగహేశన 

పట్టుకుని పీకించింది.

మనోరమా వివాహం జరిగిన పిమ్మట స్వరోచి ఆమె చెలికత్తె లిద్దరి విషాదగాథ విన్నాడు. తన ఆయుర్వేద విద్యతో వారి రాజయక్ష్మ రోగాలు పూర్తిగా నయం చేశాడు. వారిద్దరుకూడా అతనిని వివాహం చేసుకొన్నారు. స్వరోచి చేసిన మహోపకృతికి ప్రత్యుపకృతిగా విభావసి అతనికి మృగపక్షి సంభాషణ లాకళించుకునే విద్యామంత్రం బహూకరించింది. కళావతి పద్మినీ విద్యా రహస్యం బోధించింది.

ఆనాటినించీ వారు ముగ్గురు ఒకక్షణ మైనా ఒకరినొకరు ఎడబాయకుండా హాయిగా విహరించారు.

వారి అపూర్వ సౌందర్యాలు, హావభావాలు, ఆ మనోహరారణ్యసౌందర్యము తలచుకొన్న స్వరోచికి తానున్నది స్వర్లోక మేనని గట్టి నమ్మిక కలిగింది. ఆ ఆనందానుభూతిలో అతని నేత్రాంతాలు ప్రయత్నంగా ముకుళించాయి. అతని పార్శ్వంలో కూర్చున్న భార్యలు ముగ్గురు కొంతసేపేదో ఇష్టాగోష్టిలో పడ్డారు. ఆసమయంలో స్వరోచికి వేవో చిత్ర చిత్రమైన సంభాషణధ్వనులు వినిపించాయి.

## 2

"ఆహా! ఈ సుందరీమణులిటువంటి అందగానితో కలిసి మెలిసి విహరించడానికి పూర్వజన్మలో ఎంతటి మహా తీవ్రమైన పుణ్యం చేసుకొన్నారో గదా!

"లోకంలో సామాన్యంగా ఒక వనితకొక మగవానిపై వలపు కలగవచ్చును. ఒక మగవాని కొక తరుణిపై మమత గుభాళించవచ్చును! కాని ఇద్దరికీ ఒక రొకరిపై సమానంగా అనురాగం కలగడమనేది ఈ లోకంలో అరుదు! ఈ అందగాని కీముగ్గురు జవ్వనుల మీద వల్లమాలిన వలపేర్పడింది. అలాగే ఈముగ్గురు సుందరీమణులకు అతనిపై గాఢానురాగం కలిగింది. అతడు వీరందరి హృదయాలలోను పూవులలో తావిలా, పూసలలో దారంలా కుదురుకొన్నాడు. వీరందరినీ కళ్ళారా చూస్తుంటే నా కంట్లో ముచ్చట వేస్తున్నదే!"

"చాలు! చాలులే! ఈ పొగడ్త! ఇదీ ఒక అనురాగమేనా?"

మొట్టమొదట వినబడిన ఆ ప్రశంస, తరవాత వినబడిన ఆ ఈసడింపు స్వరోచి హృదయంలో సూటిగా గుచ్చుకొన్నాయి. అయితే ఆ స్తుతి నిందలుచేసినవా రెవరో అతనికి తెలియలేదు! ఆ పరిసరాలన్నీ అతి శ్రద్ధగా గాలించి చూచాడు. మానవులజాడ ఎక్కడా పొడగట్టలేదు. అతనికొ సమయంలో మృగపక్షి భాషణ విజ్ఞాన విద్య జ్ఞాపకంవచ్చింది. ఆ విద్యా మంత్రం ఒకమారు పునశ్చరణ చేసుకొన్నాడు. అప్పటి కతనికా స్తుతి నిందలకు కారణభూతు లెవరో బోధపడింది.

అతని కెదురుగా విశాల సరోవరంలో తామరాకుమీద నిలిచిన ఆడచక్రవాకపక్షి, తామరాకు గొడుగునీడలో నిలిచివ ఆడ హంస కనపించాయి. ఆ చక్రవాకి ఇంకా ఆదే ధోరణిలో హంసితో ఏదో చెబుతూంది. దాన్నిబట్టి ఆ హంసి మొదట ప్రశంస చేసిందనీ, అటుపిమ్మట ఆ చక్రవాకి దూషణ ప్రక్రమించినదనీ స్వరోచిగ్రహించుకొన్నాడు. ఆ చక్రవాకిదూషణం అతనికి తిరిగీ కర్ణ కఠోరంగా వినిపించింది.

"ఈ వనితలు ముగ్గురికీ తమ ప్రాణేసుడు మరి ఒక అందగత్తెతో అనగి పెనగి క్రీడించిన సంగతి తెలుసునుగదా! అయినా వీరి కతనిమీద రోత బయలుదేర లేదు! తెగుదు నమ్మా! అని మానాభిమానాలు విడిచి అనుక్షణము అతని వెంటనంటి సంచరిస్తున్నారు. మనలో మరి ఒక వనితతో క్రీడించిన భర్తపై ఇటువంటి మమకారా లెక్కడైనా ఉన్నాయా! ఇదంతా నీ వదేపనిగా భట్రాజులా పొగడడం చూస్తే నాకేమీ రుచించడం లేదుసుమా!

"పలువురిమీద బయలుదేరిన మమకారం ప్రేమ అనిపించుకోదు! అందుచేత అతనికి వారియెడల కలిగినది ప్రేమ కానేరదు. ఆపైన వారిమాట అంతే!

"అంతఃపురంలోని దాసీ జనంతో రారాజులెంతో ఆప్యాయంగా ప్రసంగిస్తూ పరిచర్య లందుకోవచ్చును! అంత మాత్రంచేత అది ప్రేమ అనిపించుకుంటుందా! ఈస్వరోచి కీజవ్వనులపై కలిగిన మమకారం కూడా అటువంటిదే!

"నిజంగా వీరిదే ప్రేమఅయితే ప్రపంచంలో మరి ప్రేమానురాగాలే లేవన్నమాట!

"అందుచేత కేవలం దాసీజనంలా ఈ వయసుకాని వెంటబడిన ఈ అందగత్తెలను గురించి మరి నాయెదట మాటాడకు!"

ఆచక్రవాకి మరింత దురుసుగా స్వరోచినీ అతని భార్యలను కసిదీరా ఈసడించి వేసింది.

స్వరోచి ఉసూరుమని ఒక్క వేడి నిట్టూర్పు విడిచిపెట్టాడు. మృగపక్షి భాషా రహస్యం తెలిసిన విభావసి ఆసమయంలో కళావతీ మనోరమలతో ఒక మొదలు, ఇ లేకుండా ఏమేమో ప్రసంగిస్తూంది. అం చేత ఆమె కా ఈసడింపు వినబడనేలే చక్రవాకి మళ్ళీ మరింత దురుసు మొదలుపెట్టింది:

"అజన్మాంతము ఒకే ఒక పురుష యెడలగాని, ఒకేఒక స్త్రీయెడలగాని కలిగిన నిజమైన ప్రేమ!

"నాకే అటువంటి మహా ప్రేమభాగ్ కలిగింది. నాకు నాథర్తపై మిక్కుటమై ప్రేమ ఏర్పడింది. ఆయనకున్ను నాయెడ అటువంటి మహా తీవ్రప్రేమే కలిగింది. అం చేత వీరందరి అనురాగాలకన్నా మా ప్రే గొప్పది! ఈవిషయంలో మేమే ధన్యులం!

అని సగర్వంగా ఒయ్యారంగా ఒళ్లు తిప్పుకుంటూ ఆచక్రవాకి అప్రసంగం అంతటితో ఆపివేసింది. హంసి మరి మాటాడలేక తలవంచుకుంది.

స్వరోచి మరింత ఖిన్నుడయ్యాడు. అతని శిరస్సు ఇంకా కిందికి వంగిపోయింది.

అతడక్కడినించి లేచి అక్కాలని కనతిదూరంలో మరిఒకచోట కూర్చున్నాడు. భార్య లతని వెంటబడ్డారు.

వారి కతని మనోవైకల్యాని కారణ మేమో తెలియలేదు. అందరు అనేకవిధాలుగా అతని కుల్లాసం కలిగించారు. అడివిపళ్లు, పుట్టతేనె మొదలైన భక్ష్య భోజ్యాలెన్నెన్నో అతని ముందుంచి బలవంతంగా ఆరగింప జేశారు. క్రమక్రమంగా అతని హృదయం కలత దీరింది.

కామవ్యామోహం మహా చెడ్డది. మళ్ళీ కొంతకాలానికి స్వరోచి వారి భోగజాలాలలో తగుల్కొన్నాడు. అలాగలాగ మరి కొన్ని ఏళ్ళు గడిచిపోయాయి. మరికొంత కాలాని కతడాచక్రవాకి దూషణమే మరిచిపోయాడు.

## 3

ఒకనాడు స్వరోచి తన ముగ్గురు భార్యలతోను కలిసి అరణ్యసరోవరాని కనతి దూరంలో విహరిస్తూ ఒక శిలాఫలకంమీద విశ్రమించాడు. భార్యలు ముగ్గురు అతన్ని చుట్టిముట్టి కూర్చున్నారు. కొంతసేపేదో ఇష్టాగోష్ఠి నడిచింది.

వారి కనతి దూరంలో లేళ్ళ గుంపొకటి ప్రత్యక్షమైంది. స్వరోచి భార్యలకా లేళ్ళ గుంపు చూపించాడు. వాటి స్వేచ్ఛా విహారాలు వారి హృదయా లాకర్షించాయి. అందరు రెప్పపాటు లేకుండా కొంతసేపా వైపే చూచారు. క్రమక్రమంగా స్వరోచి భార్యలు ముగ్గురు మళ్ళీ అతనితో కలిసి ఏదో లోకాభి రామాయణం మొదలు పెట్టారు.

స్వరోచికి ఆ లేళ్లేమైనా మాట్లాడుకొంటున్నాయేమో వినాలని కొంచెం కుతూహలం బయలుదేరింది. క్రమంగా అన్ని లేళ్ళూ అతనికి సమీపానికి వచ్చి నిలబడ్డాయి.

ఆ ముగ్గురు అతనితో ఏదో పిచ్చాపాటీ మాట్లాడుతూనే ఉన్నారు. స్వరోచి వినీ విననట్లుగా వారికేవేవో సమాధానాలిస్తూనే ఉన్నాడు. కాని అతని దృష్టి అంతా ఆ లేళ్ళ మీదనే నిలిచింది.

అంతలో ఆడలేళ్లు రెండుమూడు మొగలేడి ముఖానికి దగ్గరగా మూతులు పెట్టి, చిగురుల వంటి నాల్కలతో మోర మూచాయి. వాటి ఆప్యాయత చూస్తే స్వరోచికెంతో ముచ్చట వేసింది. అంతలో అతనికి మగలేడి మాట్లాడుతున్న సవ్వడి వినిపించింది. చెవులొగ్గి అతడెంతో జాగ్రత్తగా ఆలకించాడు. మగలేడి మాట్లాడిన ఒక్కొక్క మాటే ఈటెలా అతని శ్రుతికుహరాల్లో నాటుకుంది. మొదట ఆ మగలేడి ఆడలేళ్లనన్నిటినీ గట్టిగా కసిరింది. ఆపైన అంతకన్నా గట్టిగా చీవాట్లు పెట్టింది :

“చాలు! చాల్లెండి, ఈ సరసాలు! నేనేమయినా స్వరోచి ననుకున్నారా పొద్దస్తమానము మీతో కాలక్షేపం చేయడానికి? మీకు బొత్తిగా సిగ్గు, లజ్జ లేకుండా ఉందే! అంతగా కోరుకూడదు అనుకుంటే ఇంకొక మగలేడి నెక్కడయినా వెతికి పట్టుకోండి! నాకు మిమ్మల్ని చూస్తేనే రోతపుడుతూంది!

“పదిమంది భార్యలతో కూడి క్రీడించడమన్నది కేవలం భోగవాంఛే గాని మరొకటి కానేరదు! ఈ స్వరోచి భార్యలిచ్చిన విద్యలతో కన్నుమిన్ను కానకుండా మోహపాశాలలో తగుల్కొన్నాడు! ఇతనికిక ఇహము, పరముకూడా శూన్యమే. మరి నాకు కూడా ఇహపరాలు లేకుండా చెయ్యాలని చూస్తున్నారేమో! నే నటువంటి దాన్ని కానేకాను. పొండి! ఇక నా ఎదట నిలబడకండి! నే నిప్పటినుంచీ ఒక నియమం అవలంబించాను. మృగప్రాయంగా సంచరించడానికి నేనేమీ స్వరోచివంటి భోగలాలసుణ్ణి కాను! తెలిసిందా!”

అతని హృదయంలో ఆ మాట లొక్కొక్కటే వరసగా ములుకుల్లా నాటుకొన్నాయి. స్వరోచి తనకు భార్యలయెడల, భార్యలకు తనయెడల కలిగిన మమకారమూ, వ్యామోహమూ, కేవలం ప్రేమే అనీ, తన అంతటి అదృష్టవంతుడిక పుట్టబోడనీ ఎంతయినా అహంకరించాడు. అతని ఆ దురహంకారం అంతా ఆ క్షణంతో పటాపంచలయిపోయింది!

అతడిక కళ్లెత్తి తన భార్యలవైపే చూడలేక పోయాడు. పెడమొహం పెట్టుకుని కూర్చున్న అతని హృదయంలో పూర్వం ఆ చక్రవాకి, ప్రస్తుతం ఆ లేడిచేసిన దూషణ తిరస్కారాలు మాటిమాటికీ అలాగే ప్రతిధ్వనించాయి.

ఖిన్నతలో అతని శిరస్సింకా కిందికి వంగిపోయింది.

అదేసమయంలో అతని హృదయంలో ఆ పూర్వచక్రవాక మిథునం దివ్యానురాగమే అత్యంతమనోజ్ఞమైనదిగా, పునీతమైనదిగా స్ఫురించింది.

ఆకాశంలో ఒక చక్రవాకమిథునం కలకలలాడుతూ పైకెగసి రివ్వుమని అంతరిక్షానే అందుకుంది! ★

# రెబ్బాప్రగడ రేడియో

రెబ్బాప్రగడ సుబ్బారాయుడు ఒక డబ్బా! అది అతని వాగుడికి మెచ్చి, మిత్రబృందమిచ్చిన ముద్దుపేరు. ముద్దుపేరు మొద్దుగా తోస్తే, అసలు పేరు జమాయించి పిలవడం కూడా కద్దు. అందుకని కొందరం డబ్బాలేకుల సుబ్బారాయుడు, సూక్ష్మంగా డి. రాయుడు అంటాము.

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, రెబ్బాప్రగడ ముఖం రేడియో పేరు చెబితే రేడియం డయల్ లా వికసిస్తుంది, గాఢాంధకారంలో కూడా.

అందులోనూ అతనికి రేడియం డయల్ గల రేడియో నూటయాభై రూపాయల లోపున దాదాపు పదిహేను ఇన్‌స్టాల్‌మెంట్సులో ఎవరన్నా ఇస్తామని ప్రకటిస్తే బాగుంటుందనిపిస్తుంది.

రేడియో కంపెనీ వాళ్ళ ప్రకటనలు అన్నీ తప్పక చూస్తాడు. వివిధ చిత్రాలు—రేడియో లవి—కత్తిరించి ఆల్బమ్ కూడా తయారు చేశాడు.

రేడియో కంపెనీలు, వాటి ఎడ్రసులు, అవి తయారుచేసే రకాలు అతనికి కంఠోపాఠం. రెండో పంచవర్ష ప్రణాళికాంతానికి దేశంలో రేడియో సెట్లు అసంఖ్యాకంగా తయారవుతున్నాయన్న వార్త విన్నప్పుడు అమితమైన సంతోషం కలిగి, ఆ వార్త అందరికీ చాటాలనుకుని, సంతోష భారంచేత కదలలేక అట్లాగే కూర్చుండిపోయి ఆఖరికి తన డైరీలోకూడా వ్రాయడం మర్చిపోయేడు.

అసలతనికి రేడియో ఇంజనీరింగ్ నేర్చుకుని, చవకగా రేడియోలు ఉత్పత్తి చేసి, ప్రజలకు అందించాలనే ఉద్దేశం ఉంది. అందుకని కరస్పాండెన్సు ద్వారా రేడియో ఇంజనీరింగ్ అండ్ సర్వీసింగ్ నేర్పే సంస్థలతో చాలా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేడు.

ఒక కార్డుతో వాళ్ళు చెప్పలేనంత ఉచిత సారస్వతాన్ని గుప్పించేవారు. ఐదారు వందలవరకు నెలలవారీగా కట్టాల్సి వస్తుందని చూసేటప్పటికి గుండె ఆగినంత పనయ్యేది. ఐతేనేం 'నేర్చుకొంటూ సంపాదించండి' అనే హెచ్చరిక ఆకర్షవంతమైనదిగా తోచేది.

నెలకు ఇరవై కట్టాలి. ఇప్పటికే అసలు తలక్రిందులవుతుంటే, మిగిలిన జీతంతో ఎలా గడపగలడు. అసంభవం! అందుకని అణగారని కోరికను ఎలాగో అణిచేసుకున్నాడు.

హోటల్లో రేడియో విన్నప్పుడు వొళ్ళు మండుకుపోయి, అయ్యరు దగ్గరకు వెళ్ళి, "కాసేపు అది ఆపు చేద్దురూ" అనేవాడు. మనసులో వినాలనే వుండేది. కాని తీరని కసితో అలా అనేవాడు.

ఏదైనా సినిమాబండి ప్రచారం చేస్తూ వచ్చి, వీధి మొగలో ఆగితే చెవులు రిక్కబెట్టి వినేవాడు.

ధనవంతుల ఇళ్ళలో రేడియోధ్వనులు విన్నా, కారులో రేడియోఉన్నట్టు కనపడినా రెబ్బాప్రగడకోపానికి అంతుఉండేది కాదు. వాళ్ళకి కారులోకూడా రేడియో వుంది; తనకిఇంట్లో లేదుకదా, కనీసం పక్కవాటావాళ్ళకికూడా లేదు. అదీకసి. అందుకని ఈమధ్య సామ్యవాది అయినట్టు మాట్లాడుతున్నాడు.

## శాంతి కృష్ణమూర్తి

అతనికి రేడియో నాటికలు, న్యూస్, క్రికెట్ కామెంటరీలు వినాలనీ, న్యూస్ ఎప్పటిదప్పుడు తెల్సుకోవాలనీ ఉండేది. అది వీలయ్యేది కాదు. మొదటిరోజుల్లో రేడియో గలమిత్రుల్ని అడగాలని అనుకునేవాడు. వాళ్ళు 'పోనిలెస్తూ' అంటే అతని పంచప్రాణాలూ హారతికర్పూరంలా హరించుకుపోయినట్టయి, గిజగిజలాడి, చివరికి అది విరమించుకున్నాడు.

రేడియో మెకానిజం కనీసం లోకల్ డీలర్సువద్ద నేర్చుకుందామని వాళ్ళచుట్టూ అరేసి నెల్లు ప్రదక్షిణంచేసేడు. కాని ఎవరి వ్యాపార రహస్యం ఎవరు చెబుతారు? ఆరహస్యం ఎరక్క, వాళ్ళకి కాఫీఖర్చులు పెట్టి, దండుగపాలయ్యేడు.

మొత్తం రెంతుకంటేలకూపాయుల్లో రేడియోలు, వాయిదాలపద్ధతిని ఇచ్చేఅవకాశంరాగానే అతనికి బ్రహ్మరథం ఎక్కినంతపనిఅయింది.

ఒకనెల్లో ఒకటోతారీఖున ఆఫీసునుంచి ఇంటికిపెందరాళే వొచ్చాడు.

"మాశావోయ్, సుశీలా!" అన్నాడు, జేబు బరువునుమోస్తూ.

'మాశానండీ, సుబ్బారాయుడుగారూ' అందామనుకుంది కాని ఎందువల్లో, నాలిక తిరగలేదు; అందుకని, "అదేనాగొప్ప! రేపటికి కరిగిపోకుండావుంటే సరి" అంది. అలాంటి ఒకటో తారీఖులు చాలాచూసిన సుశీల.

"అదిగాదోయ్; దొరగారు రేడియో కొంటున్నారు?"

"ఎంతకీ?"

"రెండువొందలు, వాయిదాల పద్ధతిని"

"భేష్! ఇంకేం? కాబినెట్ చూసి సంతోషించాలా? లేక శబ్దం వినపడుతుందా?" అంటూ నవ్వసాగింది.

అతను నిరుత్సాహపడ్డాడు. "ఏం?"

"లేకపోతే అదేమిటండీ; మాపెద్దన్నగారు ఎనిమిదివందలుపెట్టి కొన్నారు. కనీసం మూడు, నాలుగువందలన్నా పెట్టండే రేడియో ఏమిటి? ఒకవేళ కొన్నా మూనాళ్ళకే ముక్కలవుతుంది."

"గొప్పగావుంది, నువ్వనేది—శుభం పలకరా, మంకెన్న...అన్నట్టు. ధరలుతగినా మనం ఎక్కువపెట్టి కొనాలన్నమాట!"

"పెట్టేధరనిబట్టే సరుకు వుంటుంది."

"అది అన్ని విషయాల్లో నిజం కాదు. కంపెనీ ప్రఖ్యాతుల్ని బట్టి, ఎక్కువ రేట్లకి ప్రజలపై రుద్దుతుంటారు - నీలాగ భ్రమసిపోయేవాళ్ళుంటారుగదా అని."

"మీకు కావాలనివున్నప్పుడు వాదనని ఎలాగైనా మెలేస్తారు; ఇంక నాతో చెప్పడమెందుకు?"

"హోమ్‌డిపార్టుమెంట్‌తో సలహా!"

"పాటించని సలహాలు పొందడమూ అనవసరమే అనుకుంటాను."

"ఇంతకీ నీవనేది ఏమిటి?"

"ఈడబ్బు బ్యాంకులో నిలువ వేసుకోండి. ఓ మూడువందలు అయ్యాక హాయిగా కొనుక్కోవచ్చు. మంచిరేడియో వస్తుంది. తక్కువధరలో లభిస్తుంది, వాయిదాల పద్ధతి కన్నా."

"సలహా బాగానేవుంది. కాని మూడేళ్ళనుండీ అలాంటిదానికే యత్నించాను. కాని అది అసాధ్యం! మనలాంటి తక్కువ జీతగాళ్ళు అప్పుచేసి ఆశల్ని తీర్చుకుంటూ, నెమ్మదిగా కష్టపడుతూ అప్పులు తీర్చుకోవ

ం గత్యంతరం. లేకపోతే కోరికలు సు ప్త
కాల్లా నే వుండిపోతాయి. ఏమంటావ్?"
'మీ ఇష్టం!"
అతను ఆలోచిస్తో కుర్చీలో కూర్చుండి
కూడు. భార్య ఫ్లాస్కులోని కాఫీ
ంచింది.
కాఫీ చప్పరిస్తో చప్పబడిన హృదయాన్ని
త్తుతో అనుకోసాగేడు: "అసలు కళా
దయాలు దేవుడెందుకిస్తాడో? ఇచ్చిన
ను దానితోబాటు డబ్బుకూడా యియ్య
నడూ?"

ఆ తీరనికోరిక ఎంతగానో ఎన్నాళ్లి
చో అతని హృదయాన్ని రంపంతో
సి రాపాడిస్తోంది.

"ఏమిటాలోచిస్తున్నారు?" అంది భార్య,
అతని ఆలోచనల్ని ముఖంమీద చదువుతో
న్నట్టుగా.

"ఆఁ. ఏంలేదు? నిన్నే మాట ఇచ్చాను.
వాళ్ళు మనకోసం ఒక సెట్ రెడీగా వుంచు
తామన్నారు. ఇప్పుడో వంద ఇస్తే చాలు.
మిగిలింది మూడు వాయిదాల్లో యివ్వ
వచ్చన్నారు."

"చాలాబాగుంది. ఇంక అడ్డంకేముంది.
అర్డరిచ్చేశాక అనుజ్ఞలూ, అజ్ఞలూ ఎందుకు
తక్షణమే వెళ్లిరండి."

ఆ రోజంతా ఆలోచనల్లో అతను అసలు
బజారువైపే వెళ్లలేకపోయాడు. సుశీల
ముద్దుల్లో అడ్డడమే అతన్ని దిగజార్చింది.

మర్నాడు సాయంత్రం జేబులో నూరు
రూపాయలకుపైగా నింపుకుని కంపెనీకి
తిన్నగా ఆఫీసునుండే వెళ్లాడు.

అతనికోసం నిర్మించిన సెట్టు అప్పటికే
అమ్మకమైపోయింది.

"సారీ, మిస్టర్! నిన్న వస్తామని మీరు
రాలేదు; ఇదుగో ఇప్పుడే అమ్మేశాను.
మీరు ఓ పది నిమిషాలు ముందు వచ్చినా
బాగుండేది" అన్నాడు, మేనేజర్.

సుబ్బారాయుడు నీరైపోయేడు. కుర్చీ
మీద కూర్చున్నవాడు అట్లాగే రాయైనట్లు
గా కదలకుండా ఉండి పోయాడో క్షణం.

రేడియో ఇంటికి తీసుకువెళ్ళి భార్యని
అనూహ్యంగా ఆశ్చర్య సముద్రంలో ముంచా
లని రిక్షాలో వస్తూ దారిపొడూగునా వేసిన
అంచనా పటాపంచలైపోయింది.

రాత్రి తొమ్మిదింటికి, తెల్లమొహం
వేసుకొని, ఇంటికి చేరాడు.

"సినిమాకి వేంచేశారా?" అంది సుశీల.

"ఊఁ" అన్నాడు అన్యమనస్కంగా.

భోజనాల వద అన్నం చల్లబడి బిరుసు
ఎక్కిందనీ, నెయ్యి పెరుగు పోయిందనీ,
కూరలో ఉప్పు జాస్తిగా వుందనీ, పెరుగు
పులిసిందనీ సాధించేడు.

నిజానికి అన్నీ బాగానే వున్నాయని



# రెబ్బాప్రగడ రేడియో



తెల్సు సుశీలకి కాని ఏమీ జవాబివ్వలేదు. ఇస్తే మరికొంత ధుమారం రేగుతుంది

"అంతకోప మెందుకు, ఆ రేడియో ఏదో కొనుక్కుందురూ. అయిన ఖర్చుల్లో అదొకటి" అంది సుశీల నిద్ర పోయేముందు.

"అన్నయ్యింకి మనం వెళ్ళకపోతే వాళ్ళు అకట్టి అక్కే బెదతారేమిటి? నిన్న నువ్వు పుల్ల వేశావు ఈ వేళేమో అది అమ్మేశారు మన మొహాలకి రేడియో ఏమిటి తే"

నిష్ఠురంగానే సణుక్కున్నాడు

"ఇంక లేవా?"

"మళ్లా పదిహేను రోజుల దాకా ఇవ్వలే నన్నాడు

"అప్పుడే కొనండి"

"అందాకా డబ్బుండొద్దూ?"

"వేరేకంపెనీలో కొనండి"

"అవంత మంచివి కావు"

వారం గడిచింది. రోడ్డుమీద పోతుంటే సుబ్బారాయుణ్ని పిల్చి రేడియో డీలర్ రేడియో వచ్చిందన్నాడు. రెబ్బాప్రగడ మొహం రేడియంలా మెరిసింది. కాని డబ్బు మాటగుర్తుకొచ్చి కాంతి విహీనమైంది

"నాలుగు రోజులుండండి డబ్బు కి రాస్తాను రాగానే తీసుకుంటూ" అని ఆ డీలర్ వద్దే ఒక పోస్టుకార్డు తీసుకుని, వాళ్ళ నాన్నకి ఓవుత్తరం రాశాడు, 100 రూ॥లు పంపమని.

నాన్న ఉద్యోగం చేస్తూ కూడా ఇంటి డబ్బు కాశించడం బాగులేదనీ, రెక్కల మీదే ఆధారపడాలనీ, ఆర్థిక మాంద్యం ఎక్కువగా వుందనీ, ధాన్యం ధరలు అంత బాగా లేదనీ, పైసదగ్గర్నుంచి జాగ్రత్తగా ఖర్చు చేయమనీ పరివిధాల రాస్తూ, తను పంపే డబ్బులో ప్రతీ అణా తన రక్తపు చుక్క సమానమని హెచ్చరించాడు

ఉత్తరం కొంచెం ఉడుకుమోతుతనాన్ని కలిగించినా డబ్బు వచ్చినందుకు సంతోషిస్తూ, షాపుకి బయలుదేరేడు. తండ్రి చాలా పిసినిగొట్టు. అందువల్లే ఈ నాలుగేళ్ళలోనూ ఆయన్ని ఒక కానీ కూడా అడగలేదు. స్వశక్తివల్లే బతకాలని ఆశించాడు.

కాని ఈసారి అడక్క తప్పలేదు. అందుచేత అహంకొంత దెబ్బతింది

చిన్నపిల్లవాడిని మోస్తున్నట్టుగా కాలిమీద పెట్టుకుని, జాగ్రత్తగా రేడియోను ఇంటికి చేర్చాడు, తొమ్మిదింటికి

రేడియోని చూసిన సుశీల ముఖం చిట్లించక పోవడంతో అతనికి ధైర్యం కలిగింది రాత్రి పదకొండు గంటలవరకూ రేడియో వింటూ ఆనందించారు, దంపతులు ఆధ్వని చుట్టుపక్కల వాళ్ళని కూడా ఆకర్షించింది వాళ్ళల్లో కొందరు లోలోపల ఈర్ష్య పొందసాగేరు.

'తనొక్కడికే రేడియో ఉన్నట్టు'

'కాఫీ ఫలహారాలూ రేడియో దగ్గరే నట్యా!'

'ఎలక్ట్రిక్ బిల్లు వచ్చినప్పుడు తెలుస్తుంది' అలా నడిచేయి అమ్మలక్కల గుసగుసలు.

సుశీల మర్నాటివరకూ రేడియో తాకలేదు. కాని భర్త ఆఫీసుకు వెళ్ళినప్పుడు రేడియో తనకు ఎంతగా తోడ్పడేదీ తెల్సుకుని, దానితో కాలక్షేపం చేసింది.

భర్తని 'చవక రేడియో' అని అవహేళన చేసినందుకు కించపడింది. వస్తువుల ధరలు ఎల్లకాలం ఒకలాగే వుండవని గ్రహించి సంతృప్తి పడింది ఆ వేళ సుబ్బారాయుడు నలుగురు మిత్రులతో ఇంటికి ఆరున్నర గంటలకి వచ్చాడు సిలోన్‌నుండి అరవ సంగీతము వినవస్తోంది.

లోపలకి వెళ్ళి సుశీలతో కాఫీ చెయ్యమని చెప్పి తిరిగి ముందు గదిలోకి వచ్చేడు.

మిత్రులు రేడియోపై తమ అభిప్రాయాలు చెబుతో అభినందనలు తెల్పసాగేరు.

ఇంతలో కాఫీ తయారైంది. అంతా దానిని చప్పరిస్తో కూర్చున్నారు.

"మా నాన్న నూరు రూపాయలు పంపేడోయ్! దానితోనే కొన్నాను" రహస్యం బయట పెట్టేశాడు, "ఇవి పాపపు రోజులు, నిజంగా కష్టపడి తిండిమాని దాచుకు కొనుక్కున్నా అనుమానిస్తుంది లోకం" అని భయపడుతున్నట్టుగా

"మిగతా డబ్బు ఎలాగో నేనే సర్దుకుంటాను", అన్నాడు తిరిగి, తృప్తిగా.

"ఏడైంది వార్తలు పెట్టవోయ్" అన్నాడు ఒకడు.

రెబ్బాప్రగడ, వాల్యూమ్ తగ్గించి, బ్యాండ్ మార్చి, 411 మీటర్ల మీద హైద్రాబాద్ స్టేషన్ను మీడియం వేవ్ లో ట్యూన్ చేశి వాల్యూమ్ హెచ్చించాడు.

అందరూ శ్రద్ధగా వినసాగేరు—మూడో ప్రపంచ మహాయుద్ధం ఎక్కడ ముంచుకు వస్తుందో అన్నట్టుగా

"ఆలిండియా రేడియో. వార్తలు.. చదువుతున్నది."

అంతే! తర్వాత శబ్దం రాలేదు. లోపల లైటుమాత్రం వెలుగుతోంది. అతనిగుండె వేగంగా కొట్టుకుంది, స్విచ్ ఆఫ్ చేసి, మళ్లా వేశాడు; ధ్వని రాలేదు

బెజవాడ, మద్రాస్, ఢిల్లీ స్టేషన్లు పెట్టేడు. ఎక్కడా ధ్వని రాలేదు; బజ్ అనే శబ్దం తప్ప

అందరూ నిశ్చేష్టులయ్యారు.

'చవక రేడియో లింతేనోయ్' అన్నాడు ఓమిత్రుడు

'ఏదో డిఫెక్టు' అన్నాడు మరొకడు.

పదినిమిషాలు చాలా ప్రయత్నించాడు, సుబ్బారాయుడు. కాని ధ్వనిరాలేదు. చివరికి ఆపేసి "వాళ్ళు పరీక్షించుకునే ఇచ్చారు. ఏమైందో తెలీడంలేదు. ఐనా గ్యారంటీవుందిగా' కష్టంగానే చిరునవ్వు తెచ్చుకున్నాడు. మిత్రులు మర్నాడు వెళ్ళి దానివిషయం కనుక్కోమనీ, లేకపోతే డబ్బు దండుగవుతుందనీ, మరీమరీ చెప్పి, తమ ఇళ్ళకి వెళ్ళిపోయారు

"శెల, అంతాళని" అన్నాడు వంటింట్లోకివెళ్ళి

"ఏం?"

జరిగింది చెప్పాడు

"అలా ఎందుకైంది? నడవండి చూద్దాం" అంది సుశీల సానుభూతి పూర్వకంగా

ఇద్దరూ యత్నించారు. కాని రేడియో పాడలేదు.

సుశీల "మంచిరేడియో కొనుక్కుందా

...ంటే విన్నారూ? ఇది వాళ్ళ మొహాన్నా
...ట్టి, కొంచెం ఖరీదైంది తీసుకోండి"
...ది.

సుబ్బారాయుడికి తోక త్రొక్కినట్టు...ంది. చర్రున లేచాడు. "మొదటినుండి ...టలే శనిలా తగులుకున్నాయి. ఆ వేళ ...డియోయే అమ్మకమైపోయింది. ఈ వేళ ...క్షేపంలాంటిది పల్కడమే లేదు. అంతా ... ." అని అరిచాడు.

"ఆలోచించుకోకండా చవక బారు ...స్తువుల్ని కొని శని అనుకుంటూ శంకిస్తే ...లాభం?" సుశీల అంటించింది.

ఆనాడు అతనికి భోజనమే సయించలేదు. ఏమీ తోచలేదు.

రాత్రి పదింటింకి తిరిగి రేడియో పెట్టేడు. పాటలు బాగా వచ్చాయి ఆ దంపతుల హృదయాలు తిరిగి ఆనందానుభూతితో నిండేయి.

మర్నాడూ అట్లాగే జరిగింది. రోజంతా బాగానే పనిచేసింది. ఏడింటినుండి తొమ్మిది వరకూ ఆ 'జబ్బు' వచ్చింది. అదేమిటో అతను 'డయగ్నైజ్' చెయ్యలేకపోయాడు.

మూడోనాడు దాన్ని తిరిగి డీలర్ వద్దకు తీసుకు వెళ్ళాడు

అతడంతా విని "మీ లైన్‌లో వోల్టేజ్ ఉన్నట్టుంది." అని ఒక స్క్రూ బిగించి ఇచ్చేశాడు. ఆనాటినుండీ రేడియో బాగానే పని చెయ్యసాగింది.

రోజుకు ఏ పదహారు గంటలో రేడియో పెట్టుకుని ఆనందించసాగేరు, వాళ్లు

ఆ రోజు సెలవు. అతను క్రితం రోజే 'వాణి' కొని, ముఖ్యమైన ప్రోగ్రాంలు క్రింద గీటు పెటాడు.

కాఫీ తాగి రేడియో ముందు కూచున్నాడన్న మాటేగాని అతనికి శ్రావ్య సంగీతమనేదే వినపడలేదు. హైదరాబాద్‌లో ఎవరో 'సరిగమ పదనిసల'తో కుస్తీ పడుతున్నారు. విజయవాడనుండి పిల్లల కార్యక్రమం. ఇంకో స్టేషన్‌లో తబలాలతో పోరాటం. త్రిప్పి త్రిప్పి సిలన్ వేసే తి...గాడు.

అప్పుడప్పుడు తలనొప్పి పోగొట్టే మందు ప్రకటనలు తలనొప్పి కలిగించినా కొన్ని హిందీపాటలు వీనులకు విందు చేయసాగాయి. హిందీ అంతగా అతనికి రాకపోయినా శ్రావ్యమైన తెలుగుపాటకోసం చెవులు రిక్కించుకున్నాడు. ఒంటిగంటకు మద్రాస్ నుండి గాన సుధ అని వుంది. అతను సరిగా ఆ టయిమ్‌కే రేడియో పెట్టాడు. తిరిగి కర్మ

(32-వ పేజీ చూడండి)

# అసంప్రేక్ష్యకారిత్వము


















--- గేయరచన ---
దూరి. రామమోహనరావు
బొమ్మలు.. బాపు





















టి. వెంకమాంబ

ఆ ముసురుపట్టిన సాయంకాలము మా సంభాషణ వేదాంతమునుండి, పురాణాలనుండి, ధర్మాలనుండి రానురాను షేక్స్పియర్ హామ్లెట్ వరకూ వచ్చి, అక్కడనుండి దయ్యాలకథలవరకూ వచ్చింది. శరీరాన్ని విడిచి ఆత్మ గాలిలో కలసిపోతుందని ఒకరూ, ఎవరి కర్మల ననుసరించి, వారు కర్మానుగుణ్యముగా జన్మిస్తారని వకరూ, వాంఛలు వీడలేక ఈ భూమిమీద కొందరి ఆత్మలు సంచరిస్తాయని వకరూ, ఎవరికి తోచినట్లు వారు ఉపన్యసిస్తున్నారు. ఇంతలో మా బంధువైన వక యదార్థవాది తనజీవితంలో జరిగిన సంఘటన యదార్థంగా చెపుతానన్నాడు.

సాధారణంగా యదార్థాలే చెపుతున్నామని చెప్పేవారి మాటలు యదార్థాలే కావు; అవి నిజం కావని తెలిసికూడా వారు చెప్పుతున్నంతసేపూ నిజమనే భ్రమతోనే వింటాము.

అదేకళలో వున్నకళ. వక చిత్రాన్ని చూస్తూ అందులోని రంగులూ అది కాగితం అని తెలిసికూడా, వాస్తవంగా వున్నట్లే భావిస్తూ ఆ కళలో లీనమైపోతాము. మా బంధువైన యదార్థవాది, చెప్పినసంగతి యదార్థమో కాదో తెలియదుగాని వినడానికి చాలా బాగున్నది.

ఆయనిలా చెప్పడం మొదలుపెట్టేడు: నా జీవితంలో అది ఒక "మైలురాయి" ఎప్పుడైనా ఆ సంఘటన జ్ఞప్తికివస్తే ఆ మైలురాయికూడా నా మనసులో బరువుగా వచ్చి కూర్చుంటుంది.

అసలు నేను చిన్నప్పుడు అతి భయస్తుడిని, గాని ఇప్పుడు మా కుటుంబములో అందరికంటే నేనే ధైర్యవంతుడిని. అంటే గొప్పసాహసాలేమీ చెయ్యలేదుగాని దెయ్యాలకథలన్నా, దెయ్యాలన్నా జడుసుకోకపోవడమే నా ధైర్యానికి తార్కాణం. మావాళ్లు తమ జీవితానుభవంలో జరిగిన వివిధ విషయాలలో ఈ దయ్యాల విచిత్ర విషయాలు చెప్పగా నేను వింతగా విన్నాను. గాని కళ్లారా చూడలేదు. మొదట్లో భయంవల్లా తర్వాత నమ్మకంలేక ఆ విషయాలు నమ్మేవాడిని కాను.

జీవితపు మజిలీలలో ఇటువంటి అపూర్వ సంఘటనలు జరుగుతవనీ, అవి కథలుగా అల్లితే మహాగ్రంథములకింద తయారవుతవనీ మావాళ్ళ అనుభవాలవల్ల నేను నిశ్చయించేను. అనుభవంలేనివాళ్లు సులువుగా కొట్టిపారవేస్తారుగాని తప్పక నమ్మవలసినవే ఆ సంగతులని నేను ఢంకామీదకొట్టి చెపుతాను.

ఇంక వినండి నా 'మైలురాయి' గురించిన కథ. నేను ఆరోజు క్యాంపు ఎత్తివేసి ఆ గ్రామం నుండి బయలుదేరేను మా బంట్రోతు వీరాస్వామితో, రెండెడ్ల బండి మీద. ఆ గ్రామంలోవున్న వక్క అప్పన్న రెండెడ్లబండియే ప్రశస్తమైంది. ఏ ఆఫీసరయినా వస్తే ఆ నందివాహనంమీదనే సాగనంపుతారు ఆ గ్రామంలోని పెద్దమనుషులు.

సాయంత్రం నాలుగుగంటలకి గ్రామ మునసబుగారింట్లో ఏవో పిండివంటలతో, శర్కరామధురమైన పాలుఇచ్చి సత్కరించేరు. రెవిన్యూ ఇనస్పెక్టరుగా నేను వారి ఆదరణ అందుకొని బండిఎక్కి ప్రయాణం సాగించేను.

నేను ప్రయాణంచేస్తున్న స్థలము కళింగ దేశ ప్రాంతములో కొబ్బరిచెట్లమధ్యనుంచి మీ రెప్పుడూ కళింగసీమను చూడలేదేమో?

ఆహా! ఆ కళింగదేశపు పేరు వినగానే అశోకచక్రవర్తీ, అశోకుని కళింగ యుద్ధము, బౌద్ధమతము, మీకు జ్ఞప్తికిరాదా? ఆ చక్రవర్తికీర్తి దేశదేశాలునిండడం, బౌద్ధధర్మాలు, బౌద్ధస్తూపాలవల్ల నేకదా?

"హ్యూయన్‌త్సాంగు" వర్ణించిన కళింగ ప్రాంతపు కీకారణ్యములు ఇపుడు చాలా వరకూపోయి మనోజ్ఞములైన కొబ్బరి, అరటి తోటలతో, చల్లటి సాగరతరంగాలమీద నుండి వుయ్యాలలూగుతూవచ్చిన మలయ మారుతముతో, మహేంద్రనగ శిఖర రమణీయతతో మనోహరముగా వుంటుంది.

ఆ చల్లటి కొబ్బరి తోటల మధ్యనుంచి మా బండి తిన్నగా సముద్రతీరపు ఇసుక దారి పట్టినది. ఒక ప్రక్క వుత్తుంగ తరంగాలతో నింగికంటుతున్న కడలి కెరటాలు, ఇంకొక ప్రక్క పెండ్లిపందిరి వలె దట్టమైన కొమ్మలతో నింగికంటుతున్న నారికేళ వృక్షాలు, తెల్లటి ఇసుక బాట, చల్లటి గాలి, ఎంత బాగున్నది, ఆ సాయంకాలపు నా ప్రయాణము!

మా వీరాస్వామి బండిలో కూర్చొని సాగరసంగీతము జోలపాట అనుకున్నాడో? ఏమో? అలా నిద్రాదేవి వడిలో వరిగిపోయేడు. మా బండి అప్పలస్వామి మట్టుకు ఏదో ఏలపాట కడలి కెరటాల ధ్వనికి శ్రుతిగా పాడుతున్నాడు.

నాలో మంచి హుషారు పుట్టినది. బండితోపాటు నా మనసు కూడా ప్రయాణం సాగిస్తున్నది, మధురమైన సాహిత్య వీధుల్లోకి.

నాకే కవిత్వం వస్తే ఈ ప్రకృతి దృశ్యాలని ఎంత చక్కగా వర్ణించి వుండే వాడిని? గాని నాకు వూహాలు తప్ప పద్యాలల్లడం చేతకాదు, పోనీ వెంట నొక చక్కని అమ్మాయివుంటే ఎంత బాగుండేది? ఇద్దరం కలసి ఈ చల్లటి సంధ్యా రాగంలో మా రాగాలు కూడా కలపి వుండే వాళ్లము.

ఈ వూహాలలో నేను వుండగా బండి అప్పన్న ఏవో తన చిన్ననాటి ముచ్చట్లు, ఈ కళింగప్రాంతపు యువతీమణుల సౌందర్యము, వారి చర్యలు, తన అనుభవాలు చెపుతున్నాడు. అప్పన్న మాటలు చెవులలోకి వెళ్తున్నవిగాని మనసులోకి వెళ్ళలేక పోయినవి.

ఇంతలో గెలలతో వూగుతున్న కొబ్బరి చెట్లని చూడగానే తియ్యని నీళ్లు తాగాలనే బుద్ధి పుట్టింది. ఇంకా మా గమ్యస్థానం చేరేటప్పటికి రెండు మూడు గంటలు పడుతుంది. ఈలోపున కొన్ని కొబ్బరి బొండాలు మా బండిలో పెట్టుకుంటే ఎందుకైనా మంచిదని బండి అప్పన్నతో నా అనుమానం చెప్పేను. సరే లెండి ముందువచ్చే తోటలో తీసుకుంటా నన్నాడు.

ఆ తోటదగ్గరకు మా బండి వచ్చింది. కంచె ముందు బండి ఆపి తోటలోకి వెళ్ళి నాలుగు కొబ్బరికాయలు పట్టుకు వచ్చేడు. నేను డబ్బు లివ్వబోతుంటే, "వద్దు బాబు! వారు పుచ్చుకోరు. మీలాంటివారు తోవలో అడిగితే ఇస్తారుగాని అలా డబ్బు తీసుకోరు. చాలా మర్యాదస్థులండి ఈ కాళింగులు," అంటూ రెండు కాయలు కొట్టి నా చేతికిచ్చి వాడు బండి ఎక్కి తోలడం మొదలుపెట్టేడు. ఆ చల్లటి కొబ్బరి నీరు తాగి అవట్టి కాయలు విసిరి వేయడానికి అటువైపు తిరగగా నా కళ్లు వక్కసారి జిగేల్ మన్నవి.

* * *

## 2

ఇంతసేపూ ఆ ప్రదేశంలో ఎవ్వరూ లేరు. మనుష్యుల జాడే లేదు? ఒక్కసారే ఏ దివ్య

దపేక్షాలనుండో నన్ను కటాక్షించటానికి వొచ్చిన దేవకన్యవలె ఒక సుందరి నా బండి వెనకనే వస్తున్నది. నేను కలేమోననుకొని కళ్ళు బాగా నలుపుకొని చూశాను నిజంగా పూర్తి తెలివిలోనే వున్నాను.

కలలు కాదు? యదార్థంగా చక్కని లావణ్యవతి నా వెనకనే వస్తున్నది. ఎంత అందం! ఎంత సౌకుమార్యం?

ఆమె పాదాలు ఎంత సున్నితంగా వేసి నడుస్తున్నది. అవి భూమికి తగిలితే కందిపోతవేమో నన్నంత వయ్యారంగా నడుస్తున్నది. గాలిలో ఆమె కట్టుకొన్న తెల్లటి చీర ఎగురుతూ వంపులుతిరిగిన ఆమె శరీరలావణ్యాన్ని ప్రకటిస్తున్నది. గాలికి ఎగిరి ముఖంమీద పడిన ముంగురులు చంద్రబింబంమీద పడుతున్న నీలి మేఘాలవలె వున్నది. తామరతూండ్లవంటి తెల్లని చేతులు, సన్ననైన నడుము బిగించి కట్టిన నడికట్టులోనుండి వెడల్పాటి జరీ చీర చెరగులు తళతళ మెరుస్తున్నవి.

అస్తమిస్తున్న సూర్యకాంతి మీదపడి ఆమె బంగారుపూతపూసిన దంతపు బొమ్మవలె వున్నది. ఆమె బట్టకట్టు, తలకట్టు చూస్తే కళింగదేశసుందరి అని స్పష్టపడుతున్నది. గాని ఆమె చక్కదనం చూస్తే, ఏ ఊర్వశో అనుకోవాలి. ఎంత వయ్యారంగా నడుస్తుంది!

మన పూర్వకవులు వర్ణించిన కలహంస నడకలు ఇవేగాబోలు ననుకున్నాను. వోరగా కొంటెగా ఆమె చూసినచూపులు నా గుండెల్లో గుచ్చుకొన్నవి. గాలం వేసినట్టు నా మనస్సుని లాగుకొన్నవి.

ఆ కళింగసుందరిని చూసి చూపు త్రిప్పుకోలేక మాట నోటినుండి రాక అలా చూస్తూ కూర్చున్నాను. ఆమె మా బండివెనక వయ్యారంగా నడుస్తూ నావైపు కొంటెగా చూస్తూ నేను నీరుతాగి పడవేసిన కొబ్బరికాయను పట్టుకొని తినడం మొదలుపెట్టినది.

ఈ కళింగంలో కొబ్బరికాయలకు ఫల సంపదకూ లోటులేదు. అందరూ పుష్టిగా, బలంగా వుంటారు. స్త్రీలు అతి చక్కని వారని పేరు. అందులో ఈమె మంచి హోదాబరి అయిన కళింగ గృహస్తుని కుమార్తెవలె వున్నది. వారికి ఇటువంటి కొబ్బరికాయలు వక లెక్క కాదు.

నామీద ఆమెకుగల అనురాగం వ్యక్తం చెయటానికి ఈ తినిపడవేసిన కాయను ఆమె తినడం. ఆమెకు అంతకన్నా భావం వ్యక్తం చేసే సులువు తట్టలేదేమో?

అయ్యో! నాగురించి ఆమె లేత సుకుమార పాదాలు కందగా నడచివస్తోంటే నేను బండిమీద హాయిగా కూర్చొని చూస్తున్నానే? నేనుకూడా దిగి ఆమె ననుసరిస్తే?

ఏమో? తీరా వెళ్ళినతర్వాత ఏ కొబ్బరి తోటలలోకో ఆమె మాయమయితే? నేను వోర్చుకోగలనా?

ఇంతకూ ఆమె వుద్దేశమేమిటో తెలుసుకోకుండా నేను ఇలా భావిస్తే తర్వాత అవమానింప బడతానేమో? ఏమో ఎవరికెరుక?

"క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్"

అని వూరకే అన్నాడా పెద్దనార్యుడు.

ఆహా! ముందే ఏమన్నా అంటే తెలియనట్లు తప్పుకుంటారు. పోనీ? కొంచెంసేపు చూద్దామని నిబ్బరంగా కూర్చున్నాను. గాని నా చూపులు ఎంత తిప్పుకుందామన్నా ఆమెనుంచి తిప్పలేకపోయేను. ఈ కొద్ది సేపటికే నన్ను ఎంత ఆకర్షణలో ముంచినది. ఆమె అందం ఆమె జాలిచూపులు నా గుండెల్లో దూసుకొని మరుని వాడి ములుకులవలె గుచ్చుకొన్నవి.

## 3

ఇంతట్లో మా బండి తోటలు దాటి పొలాల గట్ల వరకూ వచ్చింది. ఇంకొక రెండు మైళ్ళు వుంటుంది మా గ్రామం సమీపించడానికి. ఆమె ఏ గ్రామం వెళుతున్నదో? సరుకులకోసరమై పక్క గ్రామానికి వెళుతున్నదేమో? లేక..................

ఆ వుదయిస్తున్న చంద్ర కిరణాలు ఆమె కెరటాల జుట్టుమీద, నునుపైన చెంపలమీద పడి మెరుస్తున్నవి. చీరచెరుగు జరీ మెరుస్తున్నది. అభిసారికవలె ఆమె బెదరు చూపులతో నడుస్తున్నది. అది కార్తిక బహుళ పాడ్యమి గాబోలు. వక గడియ ఆలస్యంగా వుదయించెడు, వక కళనుపీడిన శరచ్చంద్రుడు. శరదృతువు అందమంతా చంద్రుని లోను వెన్నెలలోను వుంటుంది. తేలికైన మబ్బులు దూది పింజలవలె ఒక ప్రక్కనుండి వక ప్రక్కకు కదులుతూ వెన్నెల కాంతిపడి శారదాదేవి వాహనాలయిన హంసలవలె కదలుతున్నవి.

హంసనడకలతో మాతోపాటు శరల్లక్ష్మి వస్తున్నదా అన్నట్లు తెల్లటి చీరతో అలుపులేని నడకతో వస్తున్నది ఆమె. నన్ను చూసి ఏమనుకొన్నదో? రసికత్వములేని నవనాగరికతా వేషధారి ననుకున్నదేమో?

అప్పన్నను సలహా అడిగితేనో? తీరా అప్పన్న హేళనచేస్తే ఆమె ఏమనుకుంటుంది?

నేను కూర్చున్న రెండెడ్లబండి దివ్యరథమువలె వున్నది. అది దేవలోకానికి బాటవలెనే వున్నది. ఆమె కేవలం నన్ను కటాక్షించడానికి వచ్చిన ఊర్వసి! ఇంకా ఏవో వూహిస్తున్నాను.

మా వీరాస్వామి నిద్రలో ఏదో పలవరించేడు. అప్పన్న నన్ను హెచ్చరించి, మళ్ళీ ఏదో చరణం అందుకొన్నాడు. మెల్లిగా అప్పన్నను పిలిచి 'మన బండితో ఎవరో వక చక్కని అమ్మాయి వస్తున్నది. నా వైపే చూస్తున్నది' అన్నాను గుండె నిబ్బరం చేసుకొని.

అప్పన్న తిరిగి చూడకుండానే వెక్కిరింపుగా అన్నాడు.

"మళ్ళీ తయారయిందీ? అది అలాగేలెండి. మీవంటి మారాజులువస్తే ఆరెంట పడతాదండి, మీరు దానిపక్క సూడకండి, వూరు దగ్గర పడ్డాది. మనకి దాని తంటా వదలిపోతాదిలెండి, బాబూ" అంటూ మళ్ళీ ఏల పాట పాడడం మొదలెట్టేడు.

"జొన్నచేనిలోని, సొగసుకత్తెను మాని
నిన్నటేలనుండి, నిదుర లేదు
దానినన్ను కలిపి దయచేయు మాధవా
పొన్నపూలతోటి పూజసేతును"

అంటూ ఏదోహుషార్‌గా పాడుతున్నాడు. నిజంగా, ఏదేముకున్నా నాకు ఈసుందరితో హాయిగా ఈ పచ్చని చేలలో ఈసాగర తీరాన్ని మనసులు కలిసేటట్లు అనుగ్రహిస్తే పొన్నపూలతోనే పూజచేసివుందును అని అనుకున్నాను. ఈ అప్పన్నతో ఎందుకు చెప్పేను? వాడెంత చులకనగా అన్నాడు, గాని వాడభిప్రాయంతో నాకేమి?



# మైలురాయి



ఈ అప్పన్న బండినీ, ఈ వీరాస్వామినీ వీళ్లందరినీ వదలి నేను ఇక్కడ దిగిపోయి ఈకళింగ సుందరితో దివ్యలోకాలలో తేలి పోతేనో!

ఈమనసు తెలిసికోలేని మనుష్యులూ, ఈ వుద్యోగం ఇవన్నీ వదలి, ఈ స్వప్నలోకం వంటి సొగసైన ప్రదేశంలో ఈ స్వప్న సుందరితో కలలలో కరగిపోతే ఎంతహాయి! మళ్లీ ఆమె నావైపు దీనంగా చూసింది. ఎంత జాలిగా ఆమె మనసులోని బాధను, వాంఛను వ్యక్తంచేసే చూపు! గాలంవలె గుచ్చుకొనే చూపు! మాటలతో చెప్పలేని మూగభావాలు వ్యక్తంచేసేచూపు! మెల్లిగా బండిదిగడానికి ప్రయత్నించేను. మాగ్రామ సమీపంలోని మైలురాయివద్దకు మాబండివచ్చింది. కోనేటి వద్దునేవున్న మైలురాయివద్ద ఆమెనిలిచింది.

నేను బండిలోనుండి వక్కగెంతు గెంతిబోయాను, గాని నేను గెంతకుండా మా వీరాస్వామి బలిష్ఠములైన చేతులు అడ్డినవి. ఇంతట్లో బండి అప్పన్న వక్క కేక పెట్టేడు. నేను నిశ్చేష్టునివలె వుండిపోయేను. ఇంతట్లో ఆసుందరి ఒక్క దీనమైన చూపుచూసి ఆ కోనేట్లో గెంతివేసింది.

నేను కెవ్వుమని కేకవేసేను, అప్పన్న నన్ను వుద్దేశించి అంటున్నాడు.

"సరిపోయింది బాబూ? వీరాస్వామి చూడకపోతే ఈవేళ దానితో గెంతివేసి ఏమైపోయేవారో! దాని వగలకు మాయలకు ఎందరో ఈలా అయేరు. మంచిపని చేయబోయారు? అని నవ్వుతున్నాడు. వాడి నవ్వు అంతకంతకూ వికవికలూ, పకపకలుగా మారింది. నాకు అప్పన్న మీద చాలా కోపం వచ్చింది. వాడికేమి తెలుసు ఆ చూపులలో సౌందర్యం అనుకున్నాను. 'అయ్యో ఎంత సాహసం చేసింది. మగవాడినయిన నాకు ఆసాహసం లేకపోయింది' అని అన్నాను గట్టిగా, మళ్లీ అప్పన అందుకొన్నాడు.

'అది ఇప్పుడేలేస్తాది ఆకోనేట్లోనుంచి. దానికేమిపని మరి' అన్నాడు. అయితే ఆమెకు ఈతవచ్చు కాబోలు? ఆ చల్లని జలములో కొంచెంసేపు విశ్రాంతి తీసుకుంటుంది గాబోలు అనుకున్నాను.

ఆ మైలురాయి నాదృష్టిపథంలో ఇంకా వున్నది. అప్పన్న మళ్లీ అంటున్నాడు. "ఆమైలురాయి దాని నివాసం. అదిదాటి ఇటువైపు రాదు. ఇంతసేపు మీరు దాన్ని చూసి ఏమనుకున్నారు?" అన్నాడు.

"చక్కటి కళింగసుందరి" అనుకున్నాను అన్నాను నేను. "బలే, బాగా అనుకున్నారండీ! ముందే చెప్పితే మీరు జడుస్తారని నేను చెప్పలేదు. అది ˈ ˈమినీ దెయ్యం" అన్నాడు. వళ్లంతా వక్కసారి చల్లబడిపోయింది. నోటమాట రాలేదు, గాని ఆమె దెయ్యం అంటే నమ్మలేకపోయేను. ఇప్పటికీ నేను అలా భావించలేను. కళింగ సుందరి అనే నేను తలుస్తాను.

తన కథ సమాప్తి చేసేడా యదార్థవాది. మా అందరి హృదయాలలోనూ పెద్ద మైలురాయి బరువుగావచ్చి కూర్చున్నది ఆసుందరితోసహా. మాహృదయాలుకూడ బరువైనవి.



# రెబ్బాప్రగడ రేడియో

[27 వ పేజి తరువాయి]

టక సంగీత రణగొణ ధ్వని అతని కర్ణాలకు సోకింది. వెంటనే రేడియో ఆపేశాడు.

అసలు ఏదైనా కళ ప్రయోజనం ఆనందించడం. మనది కదా అనే వుదేశంతో ప్రతీదాన్ని గొప్ప చేసుకుని, మార్పు సహించక, బాధగానైనా భరించాలనుకోవడంలో తెలివి ఏమిటో అనుకున్నాడు. నాలుగున్నరకు సిలోన్ నుండి తెలుగులో పాటలు వచ్చాయి. వాయిస్ ఆఫ్ అమెరికా వాళ్ళుకూడా తెలుగులో పాటలు ప్రసారం చేస్తారని వాళ్ళ కార్యక్రమంలో అనగా విన్నాడు. అయినా అతనికి సంతోషంకలగలేదు. తెలుగు వారికి ఇన్ని బ్రాడ్ కాస్టింగ్ స్టేషన్‌లు వుండగా పాటల కోసం సిలోన్, అమెరికాల వైపు తిరగాల్సినదుస్థితి రావడం దురదృష్టం అనిపించిందతనికి.

రాత్రి అతను విచారకరంగా కనపడ్డాడు. భార్య, "ఏమిటండీ, అట్లా వున్నారు?" అంది.

"రేడియో కొనడం శుద్ధ దండుగ"

"ఎందువల్ల?"

"రోజుకి ఓగంటైనా—కనీసం—తెలుగులో పాటలు వినడానికి ఆంధ్రులు నోచుకోలేదు. పట్టుమని పదినిమిషాలకంటే రానే రావు. దానికైనా కనిపెట్టుకుకూర్చోవాలి" అన్నాడు.

"మీ రెప్పుడూ ఇంతే లెండి. రేడియో కొనేవరకూ ఓ ఆత్రుత; కొన్నాక ఓ ఆందోళన. అదీగాక ఈమధ్యేగా ఆంధ్ర ప్రదేశ్ వచ్చింది. ఆంధ్రుల అదృష్టమంతా ముందే వుంది. విచారించకండి, మీకు ఓగంటైనా తెలుగులో లఘు సంగీతంగాని, సినిమా పాటలుకాని వినే అవకాశం కల్పిస్తాం" అంది ఓ స్టేషన్ డైరెక్టర్‌లా.

"అదీ చూద్దాంగా" అని రెబ్బాప్రగడ వ్యంగ్యంగా అన్నాడు.







# పరిణామం

"ఏమోయ్! ప్రొద్దున నేను చెప్పిన లెఖ్ఖలు చేశావా" అన్నాడు సత్యనారాయణ లోపలకు వస్తూ.

"లేదండీ! మా తమ్ముడేమో...లెఖ్ఖల పుస్తకం ఎక్కడో దాచేశాడు. ఇవ్వమంటే ఇవ్వడు. దానికోసమే ఇందాకటినుంచీ, వెతుకుతున్నాను" అన్నాడు మధు కొద్దిగా తడబడుతూ.

"అదేమిటోయ్! పుస్తకం తీస్తుంటే నువ్వు చూస్తూ వూరుకున్నావా! మరీ అజాగ్రత్తగా వుంటే ఎలా? తీయంగానే వెళ్ళి చేతులోనుంచి లాక్కొనక పోయావా?"

"లాక్కుందామనే అనుకున్నానండీ! కానీ అలా చేస్తేవాడు వూరంతా వినిపించేటట్లు గొంతెత్తి ఏడుస్తాడండీ! అప్పుడు మా అమ్మవచ్చి వూరుకోలేక చెరివొకటీ అంటిస్తుంది."

"నీ తప్పు లేకపోతే నిన్నెందుకు కొడుతుందోయ్! మరీ వింతగా చెపుతావు. సరేకాని, ఇంట్లోకి వెళ్ళి ఆ పుస్తకం అడిగి తీసుకురా."

ఇక తప్పేటట్లు లేదు. అయినా మరో అబద్ధం ఆడి తప్పించుకుందామని "మా తమ్ముడు ఎక్కడ పెట్టాడో నాకు తెలియదండి. వాడు ఇంట్లో లేడు. ఎక్కడకు వెళ్ళాడో యేమో!" అన్నాడు మధు ఇంట్లోకి తొంగి చూస్తూ.

కాంతమ్మగారు బయటకు రానే వచ్చింది. వస్తూనే "ఏమిటిరా! అబద్ధాలు చెపుతున్నావు. కిష్టిగాడు నీ పుస్తకం తీశాడంటావు! అసలువాడు నీ జోలికే రానిదే!"

"ఏమిటోయ్ మధూ! అబద్ధాలు చెప్పటం కూడా నేర్చుకున్నావు" అన్నాడు సత్యం కొద్దిగా వురిమి చూస్తూ.

మధు ఏదో చెప్పబోయాడు. కానీ తల్లి అడ్డు వచ్చి "అది కాదోయ్ సత్యం! ప్రొద్దున నువ్వు అటు వెళ్ళగానే వాడు ఎక్కడ పుస్తకాలు అక్కడే పడేసి ఆడుకోవటానికి పోయాడు. ఆ పోవటం మళ్ళీ మధ్యాహ్నం దాకా రాలేదు. భోజనానికి ఇంటికి వచ్చినప్పుడు నాలుగు చివాట్లూ పెట్టాను. లెఖ్ఖలు చేసుకుంటూ కూచోమని మొత్తుకున్నాను. వుహూ! వింటేగా! అన్ని మాటలన్నీ అప్పుడే దులిపేసుకుని, మళ్ళీ ఆ పిల్లలతో బొంగరాలు ఆడుకోవడానికి పోయాడు. ఇక వాడికి చదువేమి వస్తుంది చెప్పు! మరీ భయం లేకుండా పోతున్నది. ఇలా కాదు కానీ, నువ్వు వాడికి కొంచెం భయం పెట్టు. లెఖ్ఖలు చేయక పోతే, వీపుమీద రెండు దెబ్బలు వేయి! రోగం కుదురుతుంది" అంది కోపమంతా వెళ్ళగక్కుతూ.

"దెబ్బలు కొట్టి లాభం లేదండీ!" వాళ్ళకు చదువుమీద శ్రద్ధ వుండాలిగానీ."

"అలా అని వూరుకొని లాభంలేదు నాయినా? అంతకంతకు మితిమీరిపోతున్నాడు. నువ్వు కొంచెం భయంపెట్టి చదివించకపోతే లాభంలేదు."

సత్యంకు నవ్వువచ్చింది తనెంత! తన వయస్సెంత! తను మధుకు భయం పెట్టేవాడా! అతనికి, తనకూ తేడాయేమిటి. తనేమో స్కూలు ఫైనలు పరీక్షకు వెళ్లాడు! మధు నేమో హైస్కూలులో చేర్పించాలి. ఇద్దరూ విద్యార్థులేగా!...

అలాగేలెండి! అయినా నేను భయం పెట్టే ఆగుతాడే "అని నవ్వుతూ" ఏమోయ్

## బి. విద్యాసాగర్

మధూ! నువ్వు ఇలా చదివితే లాభంలేదు. హైస్కూలులో చేర్చుకోరు. తర్వాత నువ్వుఏడ్చి మొత్తుకున్నా లాభంలేదు" మందలింపుగా అన్నాడు సత్యం పెద్దవాళ్ల ధోరణిలో.

"వింటున్నావా! శ్రద్ధగా చదువుకో! వూరికే అల్లరి చిల్లరిగా తిరిగితే ఈ యేడు కూడా తప్పతావు. తెలిసిందా!"

"అతనికేమి భయంలేదులెండి! ఈ యేడు తప్పకుండా ప్యాసవుతాడు. ఏమోయ్! అంతేనా" అంటూ చిరునవ్వు నవ్వాడు.

అవునన్నట్లు బిక్కమొహంవేసి తలవూపాడు మధు. కాంతమ్మకు ఆపేక్షవచ్చి మా చిట్టినాయన! చక్కగా చదువుకుంటాడు...ఏదో నువ్వుకొంచెం తీరికగా వున్నావు కనుక, ఈ మాత్రమన్నా వాడికి చదువుమీద బుద్ధి పుట్టింది. నీఋణం ఎలా తీర్చుకుంటామో కాని"

"ఇందులో నాదేముందిలెండి! శెలవులే కనుక ఈ మాత్రమన్నా తీరుతోంది. ఊరికే కూర్చుని నేను మాత్రం యేమిచేస్తాను."

"సరే! నాకు ఇంట్లో బోలెడు పనివుంది. వాడిని కొంచెం శిక్షించున్న చోటనుంచి లేవనీయకుండా లెఖ్ఖలు అవీ చేయించు." అంటూ ఆవిడ ఇంట్లోకివెళ్లిపోయింది.

సత్యంకు కొద్దిగా బరువుతీసి నట్లయ్యింది. ఆవిడ ఎదుట ఎందు వలనో పాఠం చెప్పాలంటే బిడియపడతాడు.

మధుంకు వొక లెక్క చెప్పి, యింకో రెండు లెఖ్ఖల చేస్తూవుండమని చెప్పాడు. ఈలోగా తను మధుకు చెప్పవలసిన ఇంగ్లీషు పాఠం వొకసారి తనలో చదువుకున్నాడు. మధు లెక్కచేసి చూపించాడు. అంతా తప్పింది. తను చెప్పిందంతా వృథా అయింది. సత్యంకు కొద్దిగా చిరాకువేసి

"ఇలాగయితే ఎలాగోయ్! ఇంతకు ముందేగా చెప్పింది. నీకు చెప్పిన కొద్దీ మరీ బుఱ్ఱపోతున్నది. చెప్తే గ్రహింపు వుండనక్కరలే!" అన్నాడు కొద్దిగా బాధపడుతునే.

మళ్ళీ ఆ లెక్క చెప్పి, ఈసారి అర్థమైందో లేదో వొకటికి రెండుసార్లు కనుక్కున్నాడు. మధుకు ఆపద్ధతి బాగా అర్థమయ్యేదాకా నాలుగు లెక్కలుచేసి చూపించాడు. తర్వాత కాసేపు ఇంగ్లీషు చెప్పాడు.

ఆరోజుకు పాఠంపూర్తి అయింది. సత్యంకు కొద్దిగా విసుగు ఎక్కువవుతున్నది. అయినా అది బయటకు చూపించకుండా, మధుకు పాఠం చెపుతున్నాడు. ఎంత చెప్పినా తనకే తృప్తి వుండటంలేదు.

"సరే? రేపు ప్రొద్దున నేను వచ్చేటప్పటికి ఈ నాలుగు లెక్కలూ, నీవు చేసి చూపెంచాలి" అంటూ కుర్చీలోనుంచి లేచి ఇంటిముఖం పట్టాడు.

 

# పరిణామం



సత్యం ఆయేడే స్కూలు ఫైనలు పరీక్షకు వెళ్ళి వచ్చాడు. వేసంగి శెలవులలో ఇంట్లో ఖాళీగా కూర్చున్నాడు. ఏమీ తోచకపోతే గుంటూరువెళ్ళి వద్దామా అనుకున్నాడు. కాని తల్లే అడ్డుపెట్టింది. 'శెలవులలోనైనా తీరికగా ఇంట్లో కూర్చోక, అక్కడికి, ఇక్కడికీ ఎందుకు? వద్దు' పొమ్మంది. సరే! ఇక చేసేదీ లేక వూరికే కూర్చున్నాడు. మధ్యలో కాంతమ్మగారు వచ్చి "మా అబ్బాయికి కాస్త రోజూ వచ్చి చదువు చెప్పిపో, నాయినా!" అంది. మాట తీసెయ్యలేక పోయాడు సత్యనారాయణ. ఒకవేళ తను వీలులేదన్నా తల్లి వూరుకోదు. దానికి తగ్గట్టుగానే మహాలక్ష్మమ్మగారు ఆవిడ ఎదుటే "నాయనా! కాస్త ఆ అబ్బాయికి చదువు చెప్పరా! మరీ చెడిపోతున్నాడు." అంది. సత్యంకు మొదట్లో ఇష్టం లేకపోయినా, తీరా ఆ అబ్బాయికి పాఠం చెప్పటం మొదలుపెట్టిన తరువాత సరదాగానే వుంది. తనువొక్కసారిగా పెద్దవాడయినట్లు అనుకున్నాడు. తనూవొక మేష్టరయినాడు! తనను చూస్తే మధు భయపడతాడు. ఏమిటో! తనకే నవ్వు వస్తోంది. తన వయస్సెంత! తనెంత! పదిహేనేళ్ళయినా నిండని తనేమిటి! ఒకరి మీద అధికారం చెలాయించట మేమిటి!

ఆయేడు ఎలాగో శ్రమపడి మధును, హైస్కూలు ప్రవేశ పరీక్షలో ప్యాసు చెయించాడు. మధు మొదటి ఫారంలో చేరాడు. సత్యంకు నెత్తిమీద పెద్ద బరువు తీసినట్లయింది. తండ్రిలేని పిల్లవాడు! తన మూలంగానయినా బాగుపడినందుకు సంతోషించాడు.

స్కూలుఫైనలు పరీక్షా ఫలితాలు ప్రకటించారు. సత్యం ప్యాసయినాడు. ఇక ఏమి చేయాలన్నది అతనికి సమస్య కాదు. హాయిగా గుంటూరులో అన్నయ్యగారింట్లో వుండి కాలేజీలో చదువుకోవచ్చు. ఇంకా కాలేజీలు ఎప్పుడు తెరుస్తారా అని నిరీక్షణలో పడ్డాడు. ఆ నిరీక్షణలోనే మళ్ళీ అయిపో వచ్చిన వేసంగి శెలవులు గుర్తుకు వస్తే మనస్సుకు బాధకలుగుతున్నది. అప్పుడే తన శెలవులు అయిపోతున్నాయి. తను మరో వూరుపోతున్నాడు. తల్లిదండ్రులవద్దహాయిగా వుండే రోజులు అంతరించినాయి. అయినా తన పిచ్చికాని, తనుమాత్రం పరాయి ఇంటికి వెళ్ళటం లేదుగా! స్వంత అన్నయ్య ఇల్లేగా!

కాలేజీలు తెరిచారు. సత్యం గుంటూరు వెళ్ళి కాలేజీలో చేరాడు. ఇంకా పాఠాలు మొదలుపెట్టలేదు. సరదాగానే వుంది రోజూ కాలేజీకి వెళ్ళిరావటం—అయినా ఎన్నాళ్ళుంటుంది ఈసరదా! క్రొత్తగా కాలేజీ విద్యార్థులతో పరిచయ మేర్పరచుకుంటున్నాడు. హాయిగానే గడుస్తున్నాయి రోజులు. చీకూ, చింతా లేదు. పెద్దగా ఏమీ చదువు కోనక్కరలేదు.

ఇరవై రోజులు గడిచినాయి. పాఠాలు మొదలుపెట్టారు. పుస్తకాలు కొనుక్కొని చదవటం మొదలుపెట్టాడు. కొద్దిగా కష్టంగానే వుంది. హాయిగా నాలుగైదు నెలలు, పుస్తకం చేతపట్టుకోకుండా తిరిగిన సత్యం ప్రాణానికి ఇది మళ్ళీ జైలులో వేసినట్లుంది. ఇంటిదగ్గర శెలవులలో పెందరాళే నిద్రపోయేవాడు. ఇక్కడేమో అలా వీలులేదు. అట్లాగే దీపం ముందు కూర్చుని సత్యం చదవటం మొదలుపెట్టాడు. ఎందువలనో బద్ధకంగా వుంటున్నది. ఒకటో క్లాసు పిల్లవాడల్లే పుస్తకం పుచ్చుకు కూర్చోవాలంటే బాధగానే వుంది. అందులో మూడు నెలలపాటు విద్యార్థి దశవదిలి, మేష్టరు హోదా వెలగపెట్టిన సత్యానికి ఈ కాలేజీ చదువు మళ్ళీ క్రొత్తగానేవుంది. తనూ అందరిలాగే మళ్ళీ విద్యార్థి అయ్యాడు.

మూడు నెలల పరీక్షలు దగ్గర కొస్తున్నాయి. సత్యం శ్రద్ధగా చదవటం సాగించాడు. కాలేజీలో చేరిన రోజున ఉన్న ఉత్సాహం ఈనాడు లేదు. బద్ధకం పెరిగింది. దీపం ముందు కూర్చుంటే నిద్రవస్తున్నది. మధ్య మధ్య అన్నయ్య అనే మాటలు సూదులులాగా గుచ్చుకుంటున్నాయి. తన అభిమానం దెబ్బతింటున్నది. వుహూ! అలా జరగటానికి వీలులేదు. తనూ పెదవాడవుతున్నాడు.

ఆవేళ రాత్రి సత్యంకు లెక్కలు తెలియకపోతే అన్నయ్యను అడిగాడు. కేశవరావు కూడా చాలా వోపికగా కూర్చుని చెపుతున్నాడు. అయినా సత్యం ఏదో ఆలోచిస్తూ పరధ్యాన్నంగా వుండటంవలన, చెప్పేది బుర్రకెక్కటం లేదు. 'వూ' కొడుతున్నాడే కాని, మనస్సు అక్కడలేదు. ఉన్నట్లుండి కేశవరావు ఏదో ప్రశ్న వేశాడు. సత్యం తెల్లమొహం వేశాడు. కేశవరావుకు కొద్దిగా విసుగుపుట్టినా, వూరుకుని మరో రెండు ప్రశ్నలు వేశాడు. వాటికి తప్పు సమాధానాలు చెప్పాడు. ఇక వూరుకోలేక నాలుగు చివాట్లు పెట్టాడు:

"నీకు కళ్ళు నెత్తిమీదకు వచ్చినాయిరా! నువ్వు ఈవూరు చదువుకోటానికి వచ్చావురా!... రోడ్లవెంబడి ఇష్టం వచ్చినట్లు తిరగటానికి కానీ..."

సత్యం అభిమానం దెబ్బతింది. కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఆనాడు మధుసు తను అన్న మాటలు గుర్తుకొస్తున్నాయి!

"ఏమిరా! మాట్లాడవేమి! అలా బెల్లం కొట్టిన రాయిలాగా వూరుకుంటావేమి!... ఈ లెక్క ఎలా చేస్తారో చెప్పు" వురిమి చూశాడు కేశవరావు.

సత్యం ఏదో చెప్పాడే కానీ, సమాధానం తప్పింది. కేశవరావు రెచ్చిపోయాడు.

"మట్టిబుర్ర!... నీకు చదువెందుకు వస్తుందిరా!" అన్నాడు.

సత్యం మనస్సులో విసుక్కున్నాడు. ఎంతమాట అన్నాడు! దాదాపు ఈ మాటలే తను కాంతమ్మగారి ముందు, మధుతో అన్నాడు. అయితే ఆనాటి తన మాటలలో అధికారం ధ్వనించలేదు. జాలిగా బుజ్జగించే ధోరణిలో అన్నాడు. కానీ, ఈనాడు తనే మాటలు పడుతున్నాడు. తనది మట్టిబుర్రట! హు! ఎంత చులకనగా వుంది.

ఆ రాత్రి అంతటితో పాఠం పూర్తి అయింది. కేశవరావు అన్న మాటలు, సత్యం మనస్సులో ఇంకా బాధిస్తూనే వున్నాయి. తన దృష్టిలో ఆనాడు మధు తెలివితక్కువ వాడయ్యాడు! కానీ, ఈనాడు తనే అన్నయ్య దృష్టిలో వొక దద్దమ్మ అయ్యాడు. ఇంతలో ఎంత పరిణామం! అనుకుంటూ ఆ రాత్రి కలత నిద్రపోయాడు. ★

# వనితా లోకం

## మీకు తెలియదని కాదుగాని:   

ఉద్యోగాలుచేసి మగవాళ్ళకు సాయం కావటం మంచిదే. కుటీర పరిశ్రమలు, హిందీ ట్యూషన్సు, సంగీతం నేర్పుట ఇత్యాది పనులద్వారా కొంతమంది స్త్రీలు, భర్తలకు చాలా సహాయం చేస్తున్నారు. కొందరు ఉద్యోగంలో తిరిగే భర్తయొక్క సదుపాయాలు సమకూర్చడమూ, స్కూలుకు పోయే పిల్లలను సముదాయించుకొనుటకు రోజంతా సరిపడుతుంది. పోగా 12 గంటల నుంచి 2 వరకు ఆమెకు తీరిక ఉంటుంది. మళ్లీ పని సరిపోతుంది. ఆ తీరుబడి సమయంలో పిల్లలు చిందరవందరచేసిన సామానులు సర్దుకుపోవడమో, లేకుంటే నిలవుంచే సరుకులు అనగా అప్పడాలు, వడియాలు, పచ్చళ్ళు మొదలైనవి తయారుచేసుకోవటమో జరుగుతుంది. లేకుంటే కొందరు శ్రద్ధగల వాళ్ళయితే మధ్యాహ్నం తీరికవేళల పిల్లల ఫ్రాకులకో, దిండువరలకో డిజయినులు కుట్టుకోవటం జరుగుతుంది. ఏది ఎల్లాగున్నా ఉద్యోగాలుచేసి గడించినా, మానినా భర్త తీసుకొచ్చిన వస్తువులు దూబరా చేయకుండా జాగ్రత్తగా వాడి ఇంటిని చాకచక్యంతో గడుపుకుంటే అదే చాలు. కొందరు స్త్రీలు పిల్లలవి, పెద్దలవి బట్టలదగ్గరనుంచి, దినుసుల వరకు అతి దూబరాగా వాడుతారు. ఇట్లాంటి స్త్రీలు భర్త ఏ కలెక్టరో, ఏ గెజిటెడ్ ఆఫీసరో అయితే అంత ఫరవాలేదు కాని "ఎంత చెట్టుకు అంత గాలి" అని ఎవళ్ళకు తగ్గఖర్చులు వాళ్ళకుంటాయి. అలా దూబరా చేస్తే యే సంసారీ వేగలేదు. (దూబరా అనగా నా ఉద్దేశ్యం ప్రతీ దాంట్లోనూ అని) ప్రతీ దమ్మిడీ కూర్చుతేనే రూకలయేది. ఆ ఇందులో వచ్చిందేమిటి అనుకోరాదు.

కొందరు ఆడువారికి వంటవిషయం కొత్తిగా తెలియదు. వంటకాలు అవసరమొచ్చినప్పుడు యెక్కువ చేసుకొన్నా అక్కర్లేనప్పుడు కొంచెం తగ్గించి చేసుకోవాలి. కొందరు బియ్యం కొలిచేటప్పుడు యెడ చారెడు పెడచారెడు బియ్యం పోసేస్తారు. (చారెడు అనగా చేతినిండా అని అర్థం.) వండినది అందరూ తినగా, మిగిలే అన్నం ఇద్దరు తినొచ్చు. అపుడు అన్నం మిగిలిందికదా అని రాత్రి తినాలి. లేకపోతే పనిమనిషికి వెయ్యాలి. ఇంక కూరలు తరిగే విషయంకూడా అంతే. చాలదనే భయం కొద్దీ యెక్కువ వండడం. అవి కొస్త మిగలడం జరుగుతూంటుంది. ఇంక నిత్యమూ ఇల్లు తుడిచిన పెంటలో 4 పచ్చిమిరపకాయలు అల్లం దొండకాయలు యిలా ఒకటి రెండూ చొప్పున పారేస్తూంటారు.

## ఆ చేత్తో ఆ పని

ఒకసారి దూరపు బంధువులింటికి వెళ్ళేను. ఆవిడ నాకంటే పెద్దది. మేమొచ్చామని చాలా మర్యాదచేసేరు. నలుగురు పిల్లలున్నారేమో తగని అల్లరి. కాఫీ కాచి అందరకూ యిచ్చింది. ఆ పిల్లలు కాఫీ ఇంకా కావాలని ఒకటే మారాం. పెద తవ్వ గ్లాసుల్తో కాఫీలు యిచ్చింది. కాఫీలయాక గ్లాసులు అవీ తోమేందుకు నేను సిద్ధపడ్డాను. ఆమె వద్దంటే వద్దని చేతిలో నుంచి గ్లాసులు లాగేసుకొని పసిపిల్ల వానికి పాలిస్తూ ఖబుర్లు మొదలెట్టింది. ఆ కాఫీ పొడీ పంచదార, ఆ చేత్తో యెత్తి దాచనందుకు ఎడపిల్లవాడు శుభ్రంగా క్రింద పారబోశాడు. ఆమె లబోలబో మంటూ వాణ్ని చావకొట్టింది. ఆ చేత్తో వెనుక వెనుకనే తల్లులు సామానులు భద్రం చేసుకోకపోతే పిల్లలకా దెబ్బలు; అటు సరుకూ నష్టం అవడం.

ఇంక వంట. ఆవిడ బూర్లెమూకుడుతో పోపు వేయించింది. పచ్చడిచేసి కారము చూడమని నా చేతిలో వేసింది. సగం పోపు వేసింది. అప్పుడు నేను రుచి చూశాను. కారం నషాళాన్ని అంటింది. ఇంకా సగం మిరపకాయలు మిగిలిపోయాయి. అవన్నీ నష్టమేకదా! నేను వుండబట్టలేక పిన్నీ ఆ మిరపకాయలన్నీ పోవలసిందేనాఅన్నా— దాంతో ఆవిడకు కోపంవచ్చి "ఏమోనమ్మా యిప్పుడంటే ఈకరువొచ్చిందికాని మా పుట్టింట్లో మళ్ళకు మళ్లు మిరపకాయలు పడుండేవి. తిన్నంత తినేవాళ్ళం; ఒకళ్ళకింత పెట్టేవాళ్ళం" అని పాతకాలం గొడవలు ఏకరువు పెట్టింది. ప్రతి ఇంట్లో కాకపోయినా కొందరిళ్లల్లో ఇలాంటి రద్దులు జరుగుతూంటాయి. నెయ్యి, నూనె వగైరా సరుకులు పిల్లలకు అందకుండా దాచాలి. లేకుంటే వాళ్ళు నేరిపాలు చేస్తారు. తరువాత వాళ్లను చితకొట్టినా సరుకు తిరిగి రాదు. వడ్డనలోకూడ చాలామంది యెక్కువగా వడ్డిస్తారు. మరోమాటు తిరిగినా సరే కాని కొంచెం వడ్డించి అది తిన్నాక మళ్లీ వడ్డించాలి. చాలమంది పిల్లలు పౌడర్లు కింద పారపొయ్యటం, హెయిర్ ఆయిల్ సీసాలు బద్దలు గొట్టడం, అద్దాలు బద్దలు గొట్టడం, దువ్వెనలు నేలపెట్టె రాయడం మొదలయిన అల్లరిపనులు చేస్తుంటారు. అలాంటివి తీసినప్పుడు నేర్పుగా మరపించి యేదయినా ఆటవస్తువు గాని, తినుబండారం గాని చేతికిచ్చి ఆ వస్తువులు వాళ్ళు చూడకుండ దాచేయాలి. అందులోనే వుంది తల్లి నేర్పరితనం. తల్లులు ఆ చేత్తో ఆ పని చేసుకోటం మంచిది. తల్లులు యెలాచేస్తే పిల్లలుకూడా అలానే అనుసరిస్తారు. అలా చేయకపోతే తల దువ్వ

## అసలుకి ముప్పు తేకుంటే ఆర్జించినంత ఫలం

కాని నూనె, దువ్వెన అక్కడే వదిలేసి, నీళ్లు పోసుకొని సబ్బు తువ్వాలు అక్కడే వదిలేసి చదువుకొని పుస్తకాలు అక్కడే వదిలేసి, విడిచిన బట్టలు యిల్లంతా జిమ్మేసి చిందర వందర చేస్తారు. చిన్నప్పటినుంచి పిల్లలు ఆ చేత్తో ఆ పని చేసుకోడం అతి అవసరము. అది నేర్పడం తల్లి విధి.

కొందరు స్త్రీలే పొయ్యిగాని కుంపటి గాని మంటబెట్టి మిగతా పనులు చూసుకొంటారు. దానివలన అనవసరంగా బొగ్గులు కాలిపోవడం జరుగుతుంది. అన్నం దించే వరికి కూరగాని మరేదన్నా గాని సిద్ధముగా ఉంచుకుంటే అనవసరంగా బొగ్గులు కాలవు. కొందరు పని పూర్తిఅయాక కూడా కుంపటార్పడానికి బద్ధకించి వదిలేస్తారు. దాని వలన చాలానష్టం జరుగుతుంది.

### ఆరబెట్టే బదులు ఊరబెడతారు

కొందరు స్త్రీలు ప్రొద్దుట తడిపిన బట్టలు సాయంత్రం వరకు వదిలేస్తారు. అందువల్ల బట్టలు చీకిపోవటం జరుగుతుంది. ఆ చేత్తో ఆ పని చేసుకున్నట్టయితే ఇలా జరగాటానికి ఆస్కారం ఉండదు. పెద్ద వాళ్ళ బట్టలు కాని, చిన్న పిల్లల బట్టలు కాని ఒక చిన్న చిరుగు చిరిగిన వెంటనే తక్షణంగా కుట్టుకోవాలి. అలా కుట్టుకోడానికి తగని బద్ధకం కొందరికి. 'ఆడదాని చేతిలో సూది, మగవాని చేతిలో నాగలి ఉన్న దేశంలో కరువు అనేది ఉండదు' అని రష్యన్ సామెత ఊరికే రాలేదు.

### ఎవరికి నష్టం?

ఇంక రెండవరకం దుబారా భరించడం మరీ కష్టం. కొందరు స్త్రీలు ఇంట్లో సరుకంతా పుట్టింటికి జేరవేస్తారు. భర్తకు తెలిసినట్లు, కొంత తెలియకుండా కొంతదోచి పెడుతుంటారు. దానివల్ల ఎవరికి నష్టమో వారికి తెలియదు. పొరుగూరు పుట్టిల్లైతే ఏమోగాని, ఊళ్ళో ఊరు అయితే మరీ అన్యాయం. పప్పులో పప్పు ఉప్పులో ఉప్పు అన్నీ అక్కడికి జేరవేస్తారు. ఈ అమాయకురాళ్లను ఏమనాలో తెలియదు.

ఒక వూళ్లో మేమున్నప్పుడు పక్కవాటాలో ఒకళుండే వారు. భర్త ఆఫీసుకు వెళ్లగానే చేగోడీలు, మిఠాయిలు మొదలగునవి సగం పుట్టింటికి పంపేసేది. సగం అటకమీద కెక్కించేది. ఆర్జించి తెచ్చిన అతనికి కడుపారా పెట్టేది కాదు. ఇంతకన్నా ఉందా అన్యాయం. మా దూరపు బంధువు ఒకామె ఐదారు వేల రూపాయల ఆస్తి పుట్టింటారికి పెట్టేసింది. ఆడపిల్ల డబ్బుతినే అధములుంటారా? అని మీరనవచ్చు "అంతకు తగ్గ బొంతలుం"డబట్టే యిలా రాయాల్సొచ్చింది.

### ఇంతకన్నా ఘోరం

కొందరు స్త్రీలు పల్లెటూరులో (ధాన్యాలు బాగాకలవారు) భర్తకు తెలియకుండా విక్రయం మొదలెడతారు. ఆ పని తాము చేస్తే ఎవరికీ తెలియదనుకుంటారు. పిల్లి కళ్లుమూసుకొని పాలు త్రాగుతూ ఎవరికీ తెలియదనుకుంటుంది. కాని వీళ్ళ దగ్గర కొన్న జనమే వాళ్ల గౌరవాన్ని మంట కలుపుతారని ఆ అమాయకులకు తెలియదు, భర్త ఆమెకు సరిపడ్డ స్వాతంత్ర్యం ఇచ్చి కావలసిన వస్తువుల్ని కొని పెడితే ఆ స్త్రీలు అలాంటి నీచానికి పాలు పడరని నా నమ్మకము.

మరోరకం స్త్రీలు, తమబిడ్డలకు (అనగా ఆడబిడ్డలకు) అతిగా పెడతారు. డబ్బు తెచ్చే అతని కష్టసుఖాలు కొంచెంకూడా చూడరు. ఒక్క మనిషి వస్తే ఖర్చు యెత్తి చూపే ఈ రోజుల్లో నెలలతరబడి అవసరమున్నా లేకున్నా నెలల తరబడి కుటుంబాన్ని భరించడం యెలాగా అని దూరాలోచనచేసే శక్తి వారికి ఉండదు. ఏది యేమైనా గృహిణి తన భర్త కష్టసుఖాల చూచుకొని వచ్చిన దాన్ని జాగ్రత్తగా సర్దుకొని ఒకనాడు 2 కూరలు తిని, ఒక రోజు కూరలు లేకుండా తినక, నెల మొదట్లో పరమాన్నం తిని నెలాఖరుకు బియ్యం అప్పు చేయక, జాగ్రత్తగా యిల్లు చక్కదిద్దుకొన్న మహిళయే యిల్లాలనిపించుకొంటుంది. అసలు మోసం చేయకుండా ఉంటే ఆర్జించినంత ఫలం. ★

## అందంలో ఆనందం

జీవితంలో ఆనందానికి అందం గీటురాయి. ప్రకృతి అంతా అందమే. ప్రకృతిలోని అందాన్ని చూచి మానవుడు ఆనందిస్తాడు. "ఎ థింగ్ ఆఫ్ బ్యూటీ ఈస్ ఎ జాయ్ ఫర్ ఎవర్..." అన్నాడు ఆంగ్లకవి కీట్స్. అందం అనేది రెండు రకాలు. ఒకటి భగవంతుడు ప్రసాదించినది. రెండోది కృత్రిమ మయినది. కృత్రిమ అందం సహజ సౌందర్యాన్ని ద్విగుణీకృతం చేస్తుంది. (కొంత వరకు మాత్రమే) మనిషి తీరుతెన్నూ ఉన్న అందాన్ని నూరురెట్లు రాణింపచేస్తాయి.

**పి. ఉమాశశి**

**(తిరుపతి)**

అందం ముఖ్యంగా స్త్రీల సొత్తు. భగవంతుడిచ్చిన అందాన్ని స్త్రీలు సమమైన మార్గంలో ఉపయోగించుకోవాలి. కొందరు స్త్రీలు ఉన్న అందాన్ని వీలయినంతవరకు చక్కగా కాపాడుకొంటారు. కొందరు ఉన్న అందాన్ని వక్రంగా తయారుచేసుకొని పాడుచేసుకొంటారు. ఈ పాడుచేసుకోడం అనేకరకాలు. సహజంగా ముక్కు వంకర, మూతి వంకర లేకపోయినా మాట్లాడేప్పుడు చేతులు తిప్పడం, మూతులు తిప్పడం కొందరికి అలవాటు. ఈ విధంగా చేయడం చూసే వారికి అసహ్యంగా వుంటుంది. ఇది ఒక విధంగా అందాన్ని పాడుచేసుకోవడమే అవుతుంది.

ఇంక ముఖ్యమైనది ఏమిటంటే గూని పెట్టడం. ఇది స్త్రీలలో అమితంగా కనిపిస్తుంది. పురుషులలో కూడ లేకపోలేదు. కాని తక్కువ అనే చెప్పాలి. గూని సాధారణంగా ఈ కాలపు విద్యార్థినులలో ఎక్కువగా వుంటోంది. చిన్నతనంలో ఆడపిల్లల్లో గాని మొగపిల్లల్లోగాని ఈ గూని అణుమాత్రమేనా కన్పించదు. అయితే ఆడపిల్లలకి యుక్తవయస్సు వచ్చేటప్పటికి ఈ గూని అనే విషబీజము మొలకెత్తుతుంది. ఇది అప్పటికి ఎక్కువగా కాక కొద్దిగానే యుంటుంది. అప్పుడే దీనిని సరిచేసుకోడానికి ప్రయత్నించాలి.

గూని రెండు రకాలు. మొదటిది భుజాల దగ్గర కనిపిస్తుంది. అంటే భుజాలు రెండు ముందుకి వొంగివుంటాయి. ఇంక రెండో రకం గూని నడుముదగ్గర వుంటుంది. నడుము నిటారుగా వుండకుండా ముందుకి వొంగి వుంటుంది. మొదటిరకం గూని కొందరు స్త్రీలలో కనిపిస్తుంది. రెండోరకం మరి కొందరిలో అగుపిస్తుంది. ఈ రెండూ కలిసి కొందరిలో వుంటాయి. గూని పెట్టడం కూడ, సిగ్గులో, వయ్యారంలో ఒక భాగం అని కొందరి స్త్రీల అభిప్రాయం. కాని ఇది శుద్ధతప్పు. గూని పెడితే ఎంత ఘోరంగా వుంటుందో చెప్పలేం. గూని మనిషులు ఎదుటివారికి చాలా అసహ్యంగా కన్పిస్తారు.

# పసుపు: కొన్ని ఉపయోగాలు

స్నబ్బులు, పౌడర్లు, వచ్చిన తరువాత మనలో చాలామంది నవనాగరికత పేరు చెప్పి మన పూర్వ సంప్రదాయాన్ని విడిచిపెట్టేస్తున్నాం. ప్రకృతి మనకు ఇస్తున్న వస్తువుల అందాన్ని ఉపయోగాల్ని విస్మరించి కృత్రిమమైన వస్తువులకై మోజుపడుతున్నాము. మనచుట్టూ ఉన్న అమూల్యవస్తువులను ఉపయోగించుట మానుకొంటున్నాం. అట్టి అమూల్యవస్తువుల్లో పసుపు ఒకటి. హిందూస్త్రీలు యుగాలతరబడి శుభకార్యాల్లోను, పూజలకు, కొన్ని ఆహారపదార్థాల్లోను ముఖ్యంగా పసుపును వాడుతున్నారు.

అయినా ఈనాడు నాగరికత విషయమై ఏర్పడ్డ దురభిప్రాయాల మూలంగా మనలో చాలామంది స్త్రీలు పసుపును విధిగా విడిచిపెటవలసిన అగత్యం యేర్పడింది. తెగించి ధైర్యంచేసి వాడితే కాలేజీ విద్యార్థుల విమర్శలు, వేళాకోళాలు, పేర్లుపెట్టడం—కాళిక, భద్రకాళి, అమ్మోరు—ఇత్యాది పదజాలదాడి భరించలేకుండా వున్నారు. మంచిచెడ్డలు తెలుసుకోకలిగినవాళ్లూ సంస్కారం ఉన్నవాళ్లూ ఫాషన్ తత్వం అర్థం చేసుకున్నామనుకున్న వాళ్లూ కూడా పసుపు వుపయోగించినవాళ్ళని చూచి నిరసిస్తున్నారు. 'మోటువాళ్లు' పల్లెటూరివాళ్ళంటారు. కాని మంచిగా మాట్లాడేవారు లేకపోలేదు, "ఈ ఇల్లాలు లక్ష్మీదేవిలావుందిసుమీ. తెల్లారిచూస్తే మన పాపాలే పోతవి" అనేవాళ్లు.

క్రియకు ఈ పసుపు మనం శరీరాలంకరణకు వాడటంలేదు సరిగదా గృహకృత్యాల్లోకూడా ఎంతవరకూ తగ్గించేశామంటే గడపలకు (గుమ్మాలు) రాయుటకు కూడా బద్ధకించి, మానేసి రంగులు పూసేస్తున్నాం.

---

నా స్నేహితురాలు ఒకమ్మాయి వుండేది. ఆ అమ్మాయి తెల్లగా, అందంగా, తీర్చిదిద్దిన కళ్లతో, కలకలలాడే ముఖంతో ఎంతో చూడ ముచ్చటగా వుంటుంది. కానీ ఏం లాభం? ఆ అమ్మాయికి విపరీతమైన గూని. తెచ్చిపెట్టుకున్నది. ఆ అమ్మాయిని చూసినప్పుడల్లా జాలివేస్తుంది. దీనికి దారిలేదా అని అనిపిస్తుంది. మొహం బాగా లేకపోయినా గూని కనక లేకపోతే ఏమనిషయినా చూడముచ్చటవుతుంది. అదే అందం. అందులోనే ఆనందం.

గూని, యుక్తవయస్సు వచ్చేటప్పటికి ఆడపిల్లలలో కొద్దికొద్దిగా కనిపిస్తూ వుంటుందని చెప్పాను. నిజమే. ఈ గూని పోవడానికి ముఖ్యంగా తల్లులు శ్రద్ధతీసుకోవాలి. నా చిన్నప్పుడు మా అమ్మగారు నేను గూనిపెట్టినప్పుడల్లా వీపుమీద ఒక్క దెబ్బ వేసేవారు. దాంతో చటుక్కున నిటారుగా కూర్చునేదాన్ని. కష్టపడితే ప్రతీపనీ సులువవుతుంది. అలాగే తల్లులు కొంచెం శ్రద్ధవహిస్తే ఈ గూనిని రూపుమాపవచ్చు. ★

---

సంగాని ప్రభావతి (తాళ్ళరేవు)

మానవశరీరానికి పసుపు వివిధ వుపయోగాలు: రోజూ వాడే వాళ్లకు పసుపు ప్రత్యేక కాంతి, సౌందర్యం, ఇచ్చుటేగాక చర్మమునకు మృదుత్వం ఇస్తుంది.

పసుపు ముఖ్యంగా క్రిమిసంహారి - ఎట్టి చర్మవ్యాధినీ దరి చేరనీయదు. అందుకే చాలా వ్యాధుల్లో పసుపు ముఖ్యంగా వాడతాము. గజ్జి, చిడుము, దురదలు, మచ్చలు, శోభి, గడ్డలు, వ్రణములు, కండ్లకలకలు, శిరోభారము పోగొట్టడంలో, రాకుండా చేయడంలో దీని ప్రభావం అత్యద్భుతం.

నిత్యం పసుపు ఉపయోగిస్తే చర్మవ్యాధులు - అనగా గజ్జి, చిడుము వగైరాలు రావు. అవి వున్నచో త్వరగాపోతాయి.

## శిరోభారం, పడిశములకు

పసుపుజల్లిన వేడినీళ్లతో (అందులో కొంచెం వాముకూడా జల్లాలి) ఆవిరిపట్టినచో ఎటువంటి శిరోభారమైనా, పడిశమయినా, దగ్గు పడిశం రెండూ వున్నా యేమందూ లేకయే పోగొడుతుంది. ఇది ఉదయాన్నే పరగడుపునే చేయాలి.

విధానం: వెడల్పు మూతిగల పాత్రలో సగంవరకూ నీళ్లుపోసి మూతపెట్టి మరగకాచి అందులో రెండుచెంచాల పసుపుగుండ, ఒక చెంచా వాముపోసి, దించివేసి ఆ ఎత్తుకు సరిపోయే పీటమీద రోగిని కూర్చోబెట్టి దళసరి దుప్పటిలేక రగ్గుని, గాలి చోరకుండా పూర్తిగా రోగిమీద కప్పివేసి పాత్రపైన మూత తీసివేసి ఆ నీటిలో ఎర్రగా కాలిన ఇటుకలు, ఒకదాని తర్వాత మరియొకటిగా, మూడు ఇటుకలు వరకూ వేయాలి. రోగికి చెమట పూర్తిగా పట్టుంది. (ఆవిరివల్ల వూపిరి సలపకపోతే ముక్కు దగ్గర గాలికై కొంచెం సందు వుంచాలి) తర్వాత దుప్పటి తీసేసి తల, శరీరం పొడిగుడ్డతో పూర్తిగా తుడిచేయాలి. ఎంతటి బాధకరమైన శిరోభారం, దగ్గుపడిశం, (స్వల్ప జ్వరంకూడా వుండవచ్చును పర్వాలేదు) అయినా తగ్గిపోతుంది. ఒకసారికి పూర్తిగా తగ్గనిచో మరునాడు మళ్లా ఇదే విధంగా చేయాలి. 10 సం॥లపైబడిన వారికి ఇలా చేస్తారు.

2 సం॥ల లోపు చంటి పిల్లల పడిశం, శిరోభారాలకు—

పాల ఇంగువ నీటిలో నానబెట్టి దానిని శిరస్సుమీద (మాడు లేక తాళువుమీద) పట్టువేసి దానిమీద పసుపుగుండ జల్లితే ఒకపూటకల్లా పడిశం, జ్వరం, దగ్గు, తగ్గిపోతాయి.

ఆ పడిశం, రొంపగాని కొంచెం తీవ్రంగాను, భారం ఎక్కువగాను వుంటే పాల ఇంగువకు బదులు ములగచెక్క నిజరసం పట్టువేసి దానిమీద కొంచెం పసుపుగుండ అద్దాలి. ఒకపూటకల్లా మరేమందు అవసరం లేకయే మంచి గుణం ఇస్తుంది.

## పండ్ల సలుపులు

పసుపుకొమ్ము దోరగా, నిప్పులమీద కాల్చి, నమలితే పళ్ల సలుపులు, ఇగుళ్ళ వెంబడి రక్తం కారుట తగ్గిపోవును.

శుభ్రమైన గుడ్డ (తెల్లనిది, మంచిది) పసుపునీళ్ళలో తడిపి, కలిగిన కండ్లను ఆ గుడ్డతో తుడిచిన ఉపశాంతి కల్గును. బాధ తగ్గును. పసుపునీళ్ళలో కాచి, తీయగా వచ్చిన తేట కషాయంతో కండ్లను కడుగుచుండిన కలక త్వరగా తగ్గిపోవును.

పసుపుముద్ద తడిది, దెబ్బతగిలిన కంటికి కట్టిన, వాపు, నీరు కారుట, కంటిగ్రుడ్డు ఎర్రబడుట తగ్గును.

పసుపుగుండ, సున్నం కలుపగా వచ్చిన పారాణి, గోరుచుట్లకి, మడమ శూలలకు, మాదలకు వేపి కట్టిన నొప్పి, బాధ తగ్గించును. 4 లేక 5 దినములు విడవకుండా కట్టిన వ్యాధి తగ్గిపోతుంది. కట్టుమాత్రం తడిగానే వుంచాలి. ఎండకూడదు.

## తేలుకాటుకు

తేలుకుట్టినవారికి పసుపునీళ్లు బెల్లం కలిపి ఒక గ్లాసుడు యిస్తే బాధ వెంటనే [illegible]

(42-వ పేజీ చూడండి)

# వేసవిలో పిల్లల దుస్తులు

వి. మధులత

(గుంటూరు)

వేసవి వచ్చింది కనుక పిల్లలకి ఆహారం పట్ల చూపినంత శ్రద్ధ వాళ్ళ నీళ్ళు, దుస్తుల విషయంలో కూడా చూపాలి. ఏడాదిలోపు పిల్లలకి ఉదయం, సెనగపిండి, నూనె నలుగుతో నీళ్ళుపోసినా, సాయంకాలం మటుకు వాళ్ళని నీళ్ళలో ఆటేసేపు నాననీయకుండా



1

త్వరగా గోరువెచ్చటి నీటితో స్నానం చేయించి, సబ్బుతో ఒళ్ళురుద్దటం మంచిది. నీళ్ళుపోసిన వెంటనే శుభ్రంగా తుడిచి పాపకి బేబీ పౌడరువేసి పల్చటి జుబ్బాలవంటివి తొడిగి కాస్త చల్లగాలి వచ్చేచోట, వడ తగలని జాగాలో పడుకోపెడితే హాయిగా ఆడుకుంటారు.

పిల్లలకి వేయవలసిన జుబ్బాలు, బనీన్లు మనం యింట్లో కుట్టుకుంటే నయం. బజారులో కొనాలనుకుంటే సాధారణంగా దొరకవు. కష్టంమీద దొరికినా ఒక్కొక్కటి దగ్గిర దగ్గిరగా రూపాయి ఖరీదు చేస్తాయి. అంతకంటే ఒకటి రెండు గజాల తెల్లని పల్చనిబట్ట, గ్లాస్కో లాంటిది తెప్పించుకుని, తీరిక వేళల్లో కుట్టుకుంటే, స్వతంగా కుట్టి తొడిగామన్న తృప్తేగాక, కొంత ఆదాకూడా—

పిల్లలకి కావలసిన పొడుగు, వదులూ కొలతలు తీసుకుని బట్టని రెండు పొరలుగా మడిచి దాన్ని కొలతలప్రకారం ముందర ముక్కలు కత్తిరించుకోవాలి. తర్వాత మెడ చంకలు కత్తిరించుకోవాలి. కొలతలు కావలసినదానికన్న రెండంగుళాలు ఎక్కువ తీసుకుంటే, ఆనక తడిపినపుడు బట్ట కురచ పోయినా జుబ్బా వదులుగావుండి, పిల్లలకి బావుంటుంది. చిన్నపిల్లలకి బట్టలు ఎంత వదులుగా ఉంటే అంతమంచిది!

జుబ్బా మెడ మనం మూడురకాలుగా కత్తిరించవచ్చు.

మొదటిది; అరకు మోస్తరుగా మెడపెట్టి, దానికి ఎడమభుజంపై ఓపెనింగ్ పెట్టాలి. మెడ కాస్త యిరుకయినా భుజంకూడా ఓపెన్‌గా ఉంటుంది. కాబట్టి తల తేలికగా దూర్చవచ్చును. ఈ భుజం పైన రెండు ప్రెస్ బటన్స్ (టిక్కుబత్తాములు) ఒకటి మెడవైపూ, రెండోది భుజాన్ని కలిపే చోటా — కుడితేచాలు. దీనికి, మెడకు, చుట్టూ చంకలకి కూడా వేరే అరంగుళం వెడల్పుగల ముక్క, మంచివేపున, గట్టి కుట్టుతో అతుకుపెట్టాలి. తర్వాత దానిని అంటే అతుకువేసిన ముక్కని తిప్పి, రెండో అంచు మడిచి మళ్లా మంచివైపే (రైట్ సైడ్) మొదటిలైను కుట్టాలి, మొదటిలైనుకు కాస్తదూరంలో రెండోలైను కుట్టాలి. కుట్టుకూడా, దగ్గరగా, వంకరలు లేకుండా ఉండేలా, శ్రద్ధగా కుట్టాలి. ఇట్లా డబుల్ లైన్స్ వేసి వేరేముక్కలు అతికి కుడితే — కాస్త శ్రమయినా — రెడీమేడ్‌కి తీసిపోవు. మిగతా అంతా పల్చగా ఉండి యీ కుట్టిన జాగామటుకు మందంగా ఉంటుంది కనుక, చూడటానికి జుబ్బా బాగుంటుంది. కుట్టుకూడా దక్కగా వస్తుంది. అలా కాదు, ఊరికే మడిచి కుటుకుంటామంటే మరి మీ యిష్టం. (బొమ్మ 1)

రెండోరకం మెడ గుండ్రని మోస్తరుది. భుజాలతర్వాత పెద్ద మెడ కత్తిరించి, ఒక వెడల్పు పట్టీ అతుకువేయటం — ఇదికూడా మొదట మంచివైపు అతికి తిరిగి లోపలికి మడిచి కుట్టాలి. దీనిలో బొందుగాని, లేసుగాని ఎక్కించాలి. తొడిగినతరువాత మెడకు కావలసిన వదులుంచి దూముడి వేయాలి. ఇది తొడిగితే మెడచుట్టూ కుచ్చెళ్లలా



3

(వెనకవైపు నుంచి)

ఉండి చూడటానికి బాగుంటుంది కూడా; దీనికి భుజముపైనే ముడిఉండాలి. ఈ రకం వాటికి వంటి వదులు ఎక్కువ తీసుకుంటే మెడదగ్గర చాలా కుచ్చిళ్లువచ్చి బాగుంటుంది. (బొమ్మ 2)

మూడోది. పైదానిలాగే పెద్దమెడ కత్తిరించి, బొందుపెట్టి, వీపువూర్తిగా ఓపెన్‌గా కత్తిరించాలి. దీనికి ముడి వెనకకి వస్తుంది. వీపులో మిగతా భాగంలో రెండు ప్రెస్ బటన్‌లు పెడితే సరిపోతుంది. ఈ రకం ఇంకా మెడనిలవని పిల్లలకి యెక్కువ ఉపయోగం. మొదటి రెండు రకాలు తొడిగితే మెడ జాగ్రత్తగా పట్టుకు తొడగాలి. అలా కాకుండా, నిద్రపోతున్నా తొడగటానికి వీలుగా యిది ఉంటుంది. (3 వ బొమ్మ)



2

ఏడాది, ఏణ్ణర్థం పిల్లలకి ఖచ్చితంగా సబ్బుతో స్నానం చేయించాల్సిందే! రెండుపూటలా! (ఎంత కనిపెట్టుకు చూస్తున్నా నడక వచ్చిన పిల్లలు మట్టిలోకి వెళ్లక మానరుగ) నీళ్లోసిన తర్వాత వాళ్లకి లాల్చీల వంటివి, పల్చటి చొక్కాలు తొడిగితే చూడముచ్చటగా ఉంటారు.

ఏమయినా, యీ ఉక్కలకి వానికి పిల్లల చర్మం పేలుతూ ఉంటుంది. పిల్లలు యిసుకలో, మట్టిలో ఆడుతూ ఉంటారు. కనుక తల్లులు వాళ్ళని — కొంచెం కాల

సాగిన పిల్లల్ని — ఈ సీజనులో జాగ్రత్తగా చూడాలి. ★

* * *

## లాగు

చిన్నారి పిల్లలకు లాగులు తొడగటం, నిమిషనిమిషానికీ అవిమార్చటం ఇబ్బందిగా ఉంటుంది. పిల్ల నలగకుండా, మొలతాడు లోంచి గోచీలా పెట్టనవసరం లేకుండా ఈ పక్క బొమ్మలో చూపిన పద్ధతిలో ప్రెస్ బటన్ లాగులు తయారుచెయ్యవచ్చు. అభ్యంతరంలేనివాళ్ళు పాతచీరలూ పంచెలూ కూడా చింపి వీటిని తయారుచెయ్యవచ్చు. బొడ్డుదగ్గర పొట్టకొలారం కొంత తీసుకుని, దాన్ని రెండుతో భాగించండి. ఆప్రకారం, బట్టని ఈ బొమ్మలో చూపిన ఆకారంలో కత్తిరించాలి. నాలుగువేపులా అంచులు లోపలికి మడిచి రెండు వరసల కుట్లు వేయాలి. ఇష్టమున్నవారు పైపింగ్ వేపుకొని, సన్నటి అంచులువేస్తే కంటికినదరు




గానూ ఉంటుంటుంది. కత్తిరించడంలో ఒక వేపుమాత్రం, టిక్కుబొత్తాములు అమర్చడానికి వీలుగా అరంగుళం ఇటూ అరంగుళం అటూ తోకలుపెట్టితే మంచిది. రెండుజతల ప్రెస్‌బటన్‌లు, (టిక్కుబొత్తాములు) తెచ్చి, బటన్ఉండే భాగాన్ని ఈ తోకలకి వేసి కుట్టుకోవాలి. వాటికి ఎదటివేపున రెండు పెద్దబొత్తాములు అమర్చాలి.

అప్పుడు పోతే ఇది తొడగడం విప్పటం చాలా సులభం.

పి. దుర్గ, (మద్రాసు)

## పరికిణీలకి డిజైన్లు





తాళ్ళూరు వెంకట మహాలక్ష్మి, (కాకినాడ)

## ★ పులిహోర పిండి ★

పులిహోరపిండి మధ్యాహ్నంపూట టిఫిన్‌కు బాగా ఉపయోగపడుతుంది.

కావలసిన సామానులు :

బియ్యపు రవ్వ ½ సేరు, నూనె ½ కప్పు, చింతపండు ౪ తులాలు, పచ్చి మిరప కాయలు ౪, ఎండు మిరపకాయలు ౪, జీడి పప్పు ½ తు, సెనగపప్పు, మినపప్పు, ఆవాలు, కర్వేపాకు, అల్లము ముక్కలు, పసుపు మొదలైన పోపు సరంజామా.

గిన్నెలో కొద్దిగా నూనె వేసి పొయ్యిమీద పెట్టాలి. నూనె కాగినతరువాత అర్ధసేరు నీళ్లు గిన్నెలో పోసుకోవాలి. నీళ్లు తెర్లి కాగిన తరువాత కొలిచి వుంచుకున్న రవ్వ అందులో పోసి కలపాలి. గిన్నెలో నూనె వెయ్యకుండా ఉడికితే, గిన్నెకు పిండి అంటుకుంటుంది. ఉప్పును పిండికి మరీ మెత్తగా కాకుండా బిరుసుగా చేసుకోవాలి. పిండి ఉడికిన తరువాత ఒక వెడల్పాటి కళాయి పళ్లెంలోకి తోడుకోవాలి. చల్లారిన తరువాత ఒక స్పూను పసుపులో రెండు స్పూనుల నూనె వేసి కలిపి, పళ్లెంలోని పిండికి పట్టించాలి. ముందరే చింతపండును నానపెట్టుకోవాలి. ఈ నానిన చింతపండును చిక్కగా పిసికి గుజ్జు తీసి, ఉడకపెట్టాలి. ఉడకబెట్టేటప్పుడు పచ్చి మిరపకాయలు నిలువుగా సన్నగా తరిగినవి దానిలో వెయ్యాలి. తగినంత ఉప్పు కూడ వేయాలి. ఉడికిన పులుసును పిండితో కలపాలి. కొంచెము వెడల్పాటి గిన్నెలో ½ కప్పు నూనె వేసి పొయ్యిమీద పెట్టాలి. నూనె కాగినమీదట ఎండు మిరపకాయలు ముక్కలుచేసి నూనెలో వేసుకోవాలి. వేగిన తరువాత సెనగపప్పు, మినప్పప్పు వెయ్యాలి. అల్లము ముక్కలు, జీడిపప్పు, ఆవాలు, కరివేపాకు, ఇంగువ పొడి కూడ వెయ్యాలి. ఈ పోపు వేగినతరువాత పిండిలో పోసి కలపాలి. కలిపిన తరువాత కళాయి గిన్నెలో పెట్టి మూతపెట్టాలి. లేకపోతే వాసన పోతుంది. ఈ పులిహోర పిండి మరునాటికి కూడ చెడిపోదు.

ఎస్. జ్వాలాదేవి, [మద్రాసు.]

ఉత్తరాలు:

# మూఢనమ్మకాలు

ఈ నవీన కాలములోగూడా మనవాళ్ళ మూఢనమ్మకాలు చూస్తే నాకు చాలా ఆశ్చర్యంగా వుంటుంది. భర్తలకి ప్రమోషన్లు రాకపోయినా, ఉద్యోగాలు దొరక్కపోయినా, పరీక్షలు ప్యాసుకాక పోయినా, చివరికి ఇంట్లో విలువైన వస్తువులు పోయినాకూడా భార్య దురదృష్టానికి అంటగట్టి ఆమెని సాధించే మనుష్యులను ఏమనాలి చెప్పండి?

మాకు తెలిసినవాళ్ళింట్లో కోడలు కాపరానికి వచ్చిన నెలరోజులకే మామగారు పోవటం, తర్వాత ఆడబడుచు తలచెడి ఇంటికి రావటం ఇలాగే రెండు మూడు సంఘటనలు జరిగాయి. అంత దుఃఖము లోనూ ఆ అత్తగారు ఇవన్నీ తన కోడలు కాలు మంచిది కాకపోవటంవల్లనే జరిగాయని ఆ అమ్మాయిని నిరసనగా చూడటమే కాకుండా, భర్తకి గూడా నూరిపోసింది. ఆ అమ్మాయిని బానిసకన్నా కనాకష్టంగా చూసేవారు. ఆమె ఏ శుభకార్యానికి వచ్చినా "నీ చెయ్యి మంచిదికాదు. నువ్వేమీ ముట్టుకోకు" అని అనేసేవారు. ఆ అమ్మాయి తన ఉనికి మంచిదికాదన్న దిగులుతోనే మంచంబట్టింది కూడా.

బాగా చదువుకున్నవాళ్ళు కూడా ఇలా మూఢనమ్మకాలతో తాము బాధపడుతూ ఇతరుల్ని అవస్థపెడుతూ ఉన్నారు. బాగా చదువుకుని మంచి వుద్యోగము చేస్తున్న ఒకాయన, సరిగా పనిచేయకపోవటంవలన ప్రమోషను రాకపోతే దానికి భార్య దురదృష్టమే కారణమని, ఆమెను నానా హింసలుపెట్టి, ఆమెను సుఖపెట్టక తను సుఖపడక ఎప్పుడూ ఆమెను చీదరించుకొనే వాడుట. ఈవిధంగా భార్య దురదృష్టాన్ని నిందిస్తూ కూర్చొనేకన్నా శ్రద్ధగా పట్టుదలతో, కష్టపడి పనిచేసి అధికారుల మెప్పు పొందితే ప్రమోషను ఎందుకురాదు? తన జీవితంలో భార్య తనకు సహధర్మచారిణి అనీ, ఆమెను గౌరవించాలనీ ప్రతివారూ తెలుసుకోవటం అవసరం. తను వృద్ధిలోకి వస్తే, భార్యకి మాత్రం సంతోషం కాదా, వృద్ధిలోకి రావాలని కోరుకోదా అనే విషయం మొగవాళ్ళకి తెలియాలి. ★

పద్మ (కర్నూలు)



* * *

## కట్నంబేరంనుంచి ఆస్తిబేరానికి

27-3-1957 వారపత్రికలో ప. సూ|| శెట్టిగారు తెలియపరచిన అభిప్రాయాన్ని చదివి చాల ఆశ్చర్యపోయాను. కట్నాన్ని మించిన ఆస్తి స్త్రీ మూలంగా లభిస్తున్నప్పుడు కట్నాల గొడవ తగ్గవచ్చునని అభిప్రాయపడ్డారు. అంటే, స్త్రీ మూలంగా ఏదో ఒకవిధంగా ధనాన్ని ఆశిస్తున్నారన్నమాటేగా. స్త్రీకి ఒక గౌరవమైన స్థానాన్ని కల్పించడానికి అచట్టం ఉద్దేశింపబడిందేకాని స్త్రీకి వరాన్వేషణలో సహాకరించడానికి కాదుగా. వారి దృష్టిలో నుంచి చూస్తే ఇకమీద కట్నం బేరం నుంచి ఆస్తి బేరాలలోనికి మానవులు దిగజారుతారేమోనని అనుమానం బయలుదేరుతుంది. ఎక్కువ కట్నం తెచ్చే పిల్లనే చేసుకుంటుకు పురుషులు ఎలా అంగీకరిస్తున్నారో అదే విధంగా ఎక్కువ ఆస్తి పొందకలిగే పిల్లనే చేసుకునేందుకు ఇకమీద కృషి చేస్తారనే విషయంలో సందేహానికి తావులేదు. ఆస్తి లేదు కనక, కట్నం రేటు పెరగవచ్చును. ఎక్కువ ఆస్తి పొందకలిగే కన్యనే వివాహము ఆడేందుకు నేటి ఆధునిక యువకులు తయారుఅవుతే ఆస్తి పొందలేని నిర్భాగ్య సోదరీమణుల సంగతి ఏమిటి?

విద్య, గుణ, రూపములు వచ్చినప్పటికి కూడ, కట్నం కారణంగా కుదిరిన సంబంధాన్ని వదులుకునే పెద్దమనుష్యులు వున్నంత కాలం కట్నాల సమస్య పరిష్కారమయ్యే ఆశలేదు. స్టేజి ఎక్కి కట్నం పిశాచం మూలముగా చితికిపోతున్న కుటుంబాలనుగూర్చి, కన్న కుమార్తె వివాహము ఏ విధముగా చెయ్యడమా అని మనోవ్యధతో బాధపడే తల్లి తండ్రులుగూర్చి, కట్న పిశాచానికి ఆహుతి అయ్యే నిర్భాగ్య యువతుల గూర్చి ఉపన్యాస మిచ్చినంత మాత్రాన కట్నాల సమస్య పరిష్కారమవదు. "కష్టపడకుండా లభించే ధనలక్ష్మి"మీద మోజు తగ్గాలి. ఎన్ని శాసనాలు వచ్చినా మానవత్వములో మార్పు రానంతకాలము కట్నాల సమస్య అపరిష్కృతంగానే ఉంటుంది. ★

డబ్ల్యు. వి. రంగనాయకమ్మ,
(ఆముదాలవలస)

* * *

## జనతాబండిలో రెండవ తరగతి

కొందరు వ్యక్తులు సొరకాయకోతలు తెగకోసేస్తుంటారు. గొప్పలు చెప్పాలనుకునేవారు అవి అవతలవారికి కొంతైనా నమ్మకకలిగించేట్లు చెప్పాలేగాని మరీ హద్దుదాటి కోసేస్తూంటే అసలు బండారము బయటపడుతుంది

మొన్న నీమధ్య నేను మాస్నేహితురాలు వస్తున్నదని రయిల్వేస్టేషనుకు వెళ్ళాను. రైలు లేటని తెలియుటవలన వెయిటింగ్ రూములో కూర్చున్నా. నాప్రక్కనే ఒకామె, ఇద్దరు పిల్లలు (ఆమెతమ్ముళ్ళు) వచ్చి కూర్చున్నారు. ఇక మొదలెట్టింది వాళ్ల తమ్ముళ్ళతో, వారు సెలవులకు తన వూరువస్తే వారిని రోజుకెన్ని సినిమాలకీ, షికార్లకీ తీసుకెళ్ళేదీ, వారికిష్టంలేక పోయినా వారిచే రోజుకి ఎన్ని లడ్లూ, మిఠాయీలూ, వగైరా వగైరా తినిపించేదీ, ఇంకా ఇంకా ఏమేమో చెప్పుకుపోతోంది. సరే, అప్పటికి ఆమె మాటల్లో నిజముండొచ్చు అని అనుకున్నా. కాని ఆమె ఏలూరు వెళ్ళగోరి తన తమ్ముళ్లతో సామానంత, రైలు వచ్చాక సెకండు క్లాసు కంపార్టుమెంటులో పెట్టించమని చెప్పుతూ, థర్డుక్లాసులో ప్రయాణము చేయుట ఎంతకష్టమో వారికిచెప్పి, హుకుం జారీచేసే సరికి నాకు ఆమె అంతవరకూ ఆడినమాటలు ఎంతవరకూ నిజమో తేలుటకు అట్టేకాలం పట్టలా. ఎందుకంటే, ఆమె ఎక్కబోయిన రైలు జనతా ఎక్స్‌ప్రెస్. అందులో సెకండ్ క్లాస్ పెట్టెలోనే ఎక్కుతుందట. అదీ వరస. ★

ఎస్. వి. ఆర్. రోజా
విజయనగరం

# అభినందనలు

'చుట్టాలు వస్తున్నారు జాగ్రత్త' అన్న వ్యాసం చదివాను. ఆ వ్యాసం నాకు చాలా నచ్చింది. రచయిత్రికి నా హృదయపూర్వక అభినందనలు.

ఆ వ్యాసం చదువుతుంటే అకస్మాత్తుగా రెండు నెలల క్రిందట జరిగిన అనుభవం గుర్తు కొచ్చింది. అందుకే ఆమెగారు ఇలా వ్రాసారు, అని అనుకొన్నాను. ఈమధ్య మా మరదిగారి పెండ్లి అయింది. పెండ్లి కుమార్తెను హైద్రాబాద్ తీసుకెళ్ళినాము. ఆమెతో మేనత్త ఒక్క ఆమె వచ్చారు. ఆ మేనత్త చాలా పెద్దవారు. అన్నీ తెలిసిన వారు. ఒకరోజున మా ఫ్రెండ్ వుంటే ఆ వూర్లో చూడడాన్కి వెళ్తూ పెండ్లికుమార్తె ఆమె మేనత్త మా ఆడబడుచు నేను యిద్దరు స్నేహితులు మొత్తం ఆరుగురం బయలుదేరి వెళ్లాం. తీరా వెళ్తే మా ఫ్రెండ్ పుట్టినింటికి వెళ్ళినట్లు ఆ ప్రక్కయింటివాళ్ళు చెప్పేవారు. తిరిగివచ్చేద్దామనుకుంటుంటే ఆ ప్రక్కయింటివారు "కూర్చోండి మీ స్నేహితురాలు లేకపోతే నేనీ కాసేపు కూర్చోండి" అంటూ చాపవేసి చాలా మర్యాదచేశారు. మాటలసందున మా మామగారు తెలుసునని మా అత్తగారు తెలుసునని వెకటి సంగతులు అన్నీ చెప్తూ ఫలానా వారి కోడలివిగదా అని అంటూ చాలా ప్రేమగా మాట్లాడివారు. మేము ఇంక వెళ్తాం అని బయలుదేరుతుంటే ఉండండి కాఫీతీసుకుని వెళ్ళవచ్చును అని అంటూ వద్దన్నకొద్దీ బలవంతముచేసి కాఫీ పెట్టడాన్కి లేచివెళ్ళారు.

ఆమెకు 4 గురు చిన్నపిల్లలు. వాళ్లినందర్నీ ఆడుకొనుటకు పంపి ఆమె పొయ్యి అంటించి కాఫీపెట్టారు. నేను యిల్లు అవీ చూస్తు వంటిట్లోకి వెళ్లాను. నాతో వచ్చినవాళ్లంతా, హాలోనే కూర్చున్నారు. వంటింట్లో ఆమెతో మాట్లాడుతూ అక్కడే కూర్చిండి పోయినాను. కాఫీకాచి గ్లాసులలోపోసి అక్కడే కూర్చుని ఉన్న నాకు ఒకగ్లాసుయిచ్చి హాల్లోకి వాళ్లకి పట్టుకెళ్లి యిచ్చినారు. నేను త్రాగి గ్లాసు అక్కడనే పెట్టివేస్తుండగానే ఆమె తిరిగివచ్చి ఏమండీ కాఫీ బాగుండలేదా అనిఅన్నారు. ఎందుకు



రష్యాలో ఆడపిల్లలకు ఆటలంటే చాలా ఇష్టం. పాఠశాలల నిర్వాహకులూ అందుకు తగ్గ ప్రోత్సాహం ఇస్తారు. మాస్కోలో 'క్లివ్' మండలంలో ఒక పాఠశాల 'వాలీ బాల్ టీమ్', ఆటకి సన్నాహాలు చేసుకుంటోంది.

బాగోలేదు. నేను త్రాగేసినానే అని అంటె వాళ్లంతా త్రాగలేదండి ఏదోవాసన వేస్తున్నదంటూ అక్కడే పెట్టేశారు, అని ఆమే చాలా చిన్నబుచ్చుకుంది. నేను వెళ్ళి చూదునుగదా గ్లాసులన్నీ అలాగేవున్నవి. ఏమిటి? ఆవిడ అంతప్రేమతో యిస్తే త్రాగకుండా ఉన్నారే, అని అడిగితే ఏమిటో వాసనవేస్తూంది అని అంటూ ఏంపాడిచేశారు? బిళ్లలువేశారా? అని పెండ్లికూతురు మేనత్త అంటూవుంటే తతిమావాళ్ళు ఎవ్వరూ ముట్టుకోలేదట. ఇంత మర్యాదచేసిన ఆమెగారి మొఖము చూసేసరికి నాకు చాలా సిగ్గయినది. యిటు చూస్తే కొత్తచుట్టాలు. అటుచూస్తే కొత్త స్నేహము. ఏమిచేయుటకు ఏమి అనడానికి నోరురాలేదు. ఇంకనాకు అక్కడ ఉండ బుద్ధికాలేదు. అందరం వెళ్తామని చెప్పి లేచినాము. ఈలోగా ఆమెగారు తాంబూలము పళ్ళువగైరా తీసుకొచ్చారు. మీకు చాలా శ్రమకలిగించామండి. అని అంటే ఆమెగారు నవ్వుతూ కాఫీకూడ త్రాగలేదు. తాంబూలమైన తీసుకోండి అంటూ అందరికి యిచ్చారు. ఆమె నవ్వుతూవున్నా ఆమెకు చాలాకష్టము కలిగినదని ఆమెమొఖమే చెప్తూవున్నది. ఆమె ఎంతో తెలిసినవాళ్లమనుకొని చాలా మర్యాదచేస్తే. ఆమెమనసు కాస్తలో బాధపెట్టామే. ఇది అంతా నావల్ల నేగదా అని నామనసు చాలా బాధపడింది. అలావుంటారు కొంతమంది చుట్టాలు. ★

యస్. వి. లక్ష్మీదేవి. (విజయవాడ)

# ★ పసుపు: కొన్ని ఉపయోగాలు ★

(37-వ పేజీ తరువాయి)

పోవును. ఇందు తేలు విషాన్ని పసుపు విరిచే స్తుంది. పసుపువల్ల ఏమీ దుష్ఫలితాలు లేకుండా బెల్లం వాడతారు.

పైకి—ఎర్రగా కాలిన నిప్పులమీద పసుపుకుండవేయగా వచ్చిన పొగ కుట్టిన చోట పట్టించిన తేలువిషం హరించును.

పసుపుకొమ్ము నిప్పుల మీద కాల్చి నోట పెట్టుకొని ఆ పొగ మింగిన, గులగావచ్చు దగ్గులు, గొంతుకలోని శ్లేష్మం తగ్గించును.

పచ్చి పసుపు, గాంధారి దుంప (దీన్నే కొన్నిచోట్ల అడవిపుల్లి అంటారు) కలిపి నూరి కంతులపైవేసి కట్టిన దుష్టమాంసం కరిగి పోవును. లేదా పగిలి పైకి నెట్టివేయబడుతు.

## శోభి మచ్చలు

శోభి సాధారణంగా మందులవల్ల పోదు. శరీరాన్కి ప్రత్యేకంగా ఏబాధలేకపోయినా శోభి వున్న వ్యక్తులను చూస్తే అసహ్యంగా కనబడతారు.

పొంగించిన వెలిగారం, పచ్చి పసుపు నూరి ఆప్రదేశంలో పూస్తే పోతుంది. కొందరికి త్వరగా పోవును. కొందరికి కొంతకాలం రాయాలి.

మేహమచ్చలు సకాలంలో నివారణ చేసుకోకపోయిన శరీరతత్వం పూర్తిగా మారి పోయి దీర్ఘరోగాల్లోకినిస్సందేహంగామార్చు ను. మొగ్గగా వున్నప్పుడే త్రుంచివేయాలి.

పచ్చిపసుపు కొమ్మును శుభ్రంగా కడిగి బ్రహ్మ చెముడుచెట్టు (ముదిరినది) మానులో ఒక వారం రోజులు వుంచి 8 వ రోజున ఆకొమ్ము పైకితీసి 2, 3 రోజులు నీడను ఆర నిచ్చి నీళ్లతో అరగదీసి ఆరారుగా మచ్చల మీద పూసిన మచ్చలు క్రమేణా చర్మంలో కలిసిపోతాయి. 15 సం॥ల లోపు వాళ్లకు చాలా త్వరితంగా పోతాయి. పెద్దవాళ్ళకి విడవకుండా కొంతకాలం వాడాలి.

స్త్రీలు నిత్యం పసుపు శరీరాన్కి పూసు కుంటే అపస్మారం (Hysteria) రాదం టారు. ఎంతవరకూ నిజమో వుపయోగించ వలసి వుంది.

మృత్యువాతబడనున్న అతిసారరోగులు, కలరా రోగులు (ఏరోగంలోనైనా సరే) కాళ్లుచేతులు చల్లబడి పోవుచూ శరీర వుష్ణోగ్రత తగ్గిపోవుచున్నప్పుడు అరిచేతులకు అరికాళ్లకు పసుపుగుండ వెల్లుల్లి కలిపి రుద్దిన శరీరం ఉష్ణోగ్రతను పెంచి అపాయంనుండి కాపాడును.

కొన్ని కొన్ని గ్రామాల్లో అంటువ్యాధులు ప్రబలంగా వున్నప్పుడు ఆయా గ్రామ దేవతలను నిలుపుతారు. (నూకాలమ్మ, పరదేశమ్మ వగైరా దేవతలు) ఆసమయాల్లో గ్రామంలో వాళ్లందరికీ పసుపుబొట్టు పెట్తారు. గ్రామం వీధుల్లో (అమ్మవారి పేరు చెప్పి) పసుపునీళ్లు జల్లుతారు. పసుపు ముద్దలే అమ్మవారి ప్రసాదంలో ఒక భాగంగా పంచి పెట్తారు. ఇలాచేస్తే వ్యాధులు తిరోముఖం పట్టుటకూడ కలదు.

ఇది అమ్మవారి మహత్తు ఏలావున్నా ఆ వ్యాధుల క్రిములను చంపేసేది ఈపసుపే. ఇట్లు చేయుటవల్ల గ్రామ పారిశుధ్యం యేర్పడి అంటువ్యాధుల క్రిములు పసపు ధాటికి ఆగలేక హరించిపోతాయి.

## కాళ్లు ఒరిస్తే

వర్షాకాలంలో తరచు మనం నీళ్లలో నాన్తూ వుండుటచే కాళ్లు ఒరిసి పుండేర్ప డును. ఆ ఒరిసిన కాళ్లకు పసుపురాస్తే తగ్గి పోతుంది. ఒరియకుండా చేయుటకు నిత్యం పసుపు కాళ్లకు పూసుకొనుట మంచిది (ఒరిసిన పాదాలకు కొన్నిచోట్ల పసుపు, మంచినూనె కలిపి రాస్తారు.)

బాహ్యోపయోగానికేగాక పసుపు లోప లికి కూడ వాడవచ్చును. అయితే కొద్దిగ వెగటుగా ఉంటుంది.

మనం కొన్ని వంటకాల్లో రంగు వస్తుం దనే అభిప్రాయంతో పసుపు కలుపు కొంటాం. పులిహోర, కొబ్బరి పచ్చడి వగైరాల్లో. యే అభిప్రాయంతో వుపయో గిస్తామో దాన్కి వందరెట్లు గుణం మన శరీరాన్కి ఇస్తుంది. జఠరదీప్తి కలుగ జేయును. రక్తాన్ని శుభ్రపరచును. హృద్య యానికి (Heart) బలం చేకూర్చును. ఉబ్బ రోగాన్ని దరిచేరనీయదు.

కొన్ని ఔషధాలకు యుక్తానుక్త అను పానంగా పసుపు తప్పనిసరిగా వాడతారు. మధుమేహరోగులకు పచ్చి పసుపు రసం వాడతారు. వాత శ్లేష్మ లక్షణాలతో వున్న అజీర్ణములలో (పులపలేకుండా చేస్తారు) తాలింపు అన్నం పెడ్తే తగ్గిపోతుంది.

## తలపోట్లు, శిరోవాతాలు

టైఫాయిడు, మలేరియా జ్వరాల్లోకూడా భరించలేనట్టి తలపోట్లు వస్తాయి. అట్టితరి వేడి అన్నం పసుపు కలిపి గుడ్డలో మూట గట్టి శిరస్సును కాచినచో ఉపశాంతికల్గును. కొందరికి పూర్తిగా తగ్గిపోవును.

మన్యం ప్రదేశాలకి వెళ్లవలసినప్పుడు పసుపు, మిరియాలు వేసి కాచిన నీళ్ళు త్రాగితే మన్యపు జ్వరాలు రావు.

ఇట్టి బహుళ వుపయోగములు సమకూర్చే పసుపు నిజంగా స్త్రీలకు స్నేహితురాలు, వైద్యురాలు. ఇంటికి లక్ష్మికొదు; అష్ట కష్టాల్లోపడి క్రుగ్గిపోతున్న యిల్లాలి తాళి బొట్టు కూడ అమ్మవలసిన పరిస్థితి యేర్పడ్డ ప్పుడు ఆ మంగళ సూత్ర పవిత్ర స్థానాన్ని పసుపుకొమ్ము అలంకరించి ఆ యిల్లాలి కష్టాల్లో భాగస్తురాలై ఇంటికి శాంతినిచ్చి, ఓదార్చుచున్న పసుపును నిర్లక్ష్యం చేయుట భరించరానిది.

సబ్బులు, పౌడర్లు, స్నోలు విరి విగా వుపయోగించుచూ, నవనాగరి కులమని భావించేవారు రోగాలని అధికడబ్బు ఖర్చుపెట్టి కొనుక్కుంటారని తెల్సుకొనుట చాలా మంచిది.

మన పూర్వాచారాలని మరిచిపోవద్దు. వాటియందలి గొప్పదనమును గుర్తించుట యెంతైనా అవసరం. ★




# మేలుకొలుపు

మేలుకోరా! బాబు! మేలుకో! తండ్రీ!
మేలుకో! నాయనా! మేలుకొనవయ్యా!
తెలవార వొచ్చినది చలి వడల వొచ్చినది!
కలరవమ్ముల పక్షుల మెగురవొచ్చినది!...

మంద మందమ్ముగా మలయానిలము వీచె,
ఒయ్యారి కలయంపి చల్లి ముగ్గులుతీర్చె...
ఉదయాద్రి శిఖరాన ఉదితమైన ఉషస్సు
చదువువలె స్వచ్ఛ ప్రకాశరేఖలు దిద్దె...

ఈ ప్రశాంతపువేళ నది నీవు చదివినను
నీ ప్రాయమంతమూదనుక స్మృతిలో నిలుచు...
ఈ ప్రభాతావసర హిమవాయు వీధిలో—
విప్రమంత్రోచ్చారణములు బహుళావలుకు...

నిదుర చాలునుగాని నీవింక పడక దిగి,
వదిలముగ పాఠములు తలచుకొని బడికిపో!..—
నిదుర సుఖదాయకము కదర! కాదంటినా?
చదువుసంధ్యలు విడిచిపెట్టదవా నిదురకై?...

ఏడుగుర్రముల రథమెక్కి ఉదయాద్రిపై
వేడివెలుగుల ప్రసాదించుచున్నాడినుడు...
ఇనుని సారథి అనూరుని-కశాహతులతో
కినిసి పరుగెత్తసాగెను అశ్వసప్తకము!...

ముసుగుదుప్పటి విడిచి ముద్దుగా మేలుకో!
పసిడిబొమ్మవు నీవు భావిభారతనేత!
మేలుకో రా! బాబు! మేలుకోవయ్యా!
మేలుకో! నాయనా! మేలుకొనవయ్యా!

 'ప జ్ఞ పా జి' 

# నాకలోకం

నైమిశారణ్యంలో చాలాకాలం క్రితం ఒక నక్క జీవిస్తూ వుండేది. ఆ నక్కకు ఆ అడవిలో చక్కని నివాసం ఏర్పడ్డది. చిన్న జాలియూ, ప్రక్కనే మంచినీటి కొలనూ, చక్కని గాలి—అన్నీ చెట్లూనూ. ఎక్కడికో పోయి ఏదన్నా మాంసం తెచ్చుకుని ఆ పూటకు ఇంత తిని, రాత్రికి కాస్త దాచుకుంటూ ఆ కొలనులో నీళ్లు త్రాగి త్రేణుస్తూ ఆ ఒక్క నక్కా ఆ ప్రాంతంలో సుఖంగా వుండేది.

ఒకనాడు మిట్టమధ్యాహ్నం ఎండలో తిరిగి ఇంటికి వచ్చింది నక్క. ఏదో కాస్త ఆహారం తిని, ఇన్ని నీళ్లు త్రాగి చెట్టు క్రింద కూర్చునేటప్పటికి దాని ప్రాణానికి ఎంతో హాయి అనిపించింది. "ఎంత చల్లగా వుంది-ఏమి గాలి!" అనుకున్నది నక్క. నక్క కూర్చున్న చెట్టుమీదే ఒక కాకి కూచుని, "ఏమిటి నక్కబావా-ఏమిటో అంటున్నావే?" అన్నది.

"ఏమిటో అనటమేమిటమ్మా - ఈ సుఖం చూడు. 'నీకు చస్తే ఇటువంటి చోటు ఎక్కడా దొరకదు. ఎంత హాయి - మనస్సుకు ఎంత సంతృప్తి!" అన్నది నక్క. ఈ మాటకు కాకి పకపకా నవ్వింది.

"భలేవాడివి నక్కబావా-ఇదేనా సుఖం? ఇంతకంటే సుఖంగా, హాయిగా వుండే చోటు నువ్వు చూడనేలేదా?" అంది కాకి.

"ఊరుకుందూ నువ్వూ నీ మాటలూనూ. ఇంతకంటే చక్కనిచోటు ఇంకా వుండటం ఒకటా" అన్నది నక్క.

"అదేం చోద్యం బావా! నీకు తెలీదేమో, 'స్వర్గం' అని ఒక చోటు వుంది. అక్కడటా - ఎంత సుఖం అనుకున్నావు. అక్కడ రాత్రి వుండదట-ఎప్పుడూ కడుపు నిండా చక్కని తిండట. అప్సరసలట-నృత్యాలట - ఉద్యాన వనాలట—" నక్క నోరు తెరుస్తూ "ఏమిటి - ఏం చేరన్నావూ?" అన్నది మధ్యలో.

**'సుకుమార్'**

"స్వర్గం అని, నేనెప్పుడూ చూడలేదులే. అంతా చెప్పుకోగా వినటమే. నా మొహానికి స్వర్గం ఒకటా బావా!" అంది విచారంగా కాకి.

నక్కకు బాగా ఆశ కలిగింది. ఆ స్వర్గం ఏమిటో చూడాలని దానికి అనిపించి — "ఏమాత్రం దూరమో!" అన్నది.

"ఆఁ-ఎంతలే. నువ్వు తల్చుకుంటే ఎంత సేపు-ఇదిగో ఇట్లా తూర్పుగా పోతావంటే-"

"నువ్వూ రారాదూ నాతో సరదాగా" అన్నది నక్క నవ్వు మొహంతో.

"అమ్మో-నేను నీతో స్వర్గాలూ నరకాలూ తిరుగుతూ కూచుంటే నాకు తీరుతుందా బావా! పిల్లలను చూసుకోవాలి. సంసారం గోడ జాలి! నీకేం-చీకూ చింతా లేనివాడివి, వస్తా!" అనేసి వెళ్ళిపోయింది కాకి.

ఈ స్వర్గం ఏమిటో చూడాలనుకున్నది నక్క. చూడటం కాదు - నెలో రెండు నెలలో హాయిగా అక్కడ గడిపి రావాలని కూడా వూహించింది. సరే, యిల్లంతా కాస్త జాగ్రత్తగా సర్దుకుని, ఎవరూ తన కొంప పాడుచెయ్యకుండా తగు కట్టుదిట్టాలు చేసుకుని స్వర్గానికి బయుల్దేరింది నక్క!

పోగా పోగా; పోగా పోగా — కొంతదూరంలో నక్కకు ఒక కుందేలు కనిపించింది. ఆ కుందేలు అక్కడ హాయిగా ఆడుతూ పాడుతూ ఏదో తింటూ, గంతులు వేస్తున్నది.

"ఏంరా అల్లుడా!" అన్నది నక్క.

"ఓహో-మామా-ఎక్కడికేమిటి ప్రయాణం" అన్నది కుందేలు.

"స్వర్గానికి పోతున్నారా - వస్తావేమిటి ఎంచక్కా" అన్నది నక్క.

"అమ్మో-నాన్న చావ బాదతాడు. ఐనా నీతో నేను రానుపో. నువ్వు జిత్తులమారివి!" అని పారిపోయింది కుందేలు.

కొంత దూరం పోయేసరికి నక్కకు చిన్న చెట్లూ, ఆ చెట్ల మధ్య ఓ యిల్లూ కనిపించింది. 'ఇదేనా ఏమిటి స్వర్గం' అనుకున్నది. అక్కడ దానికి హాయిగా వుందనిపించింది. దానికి అక్కడ తియ్యని నీళ్ళు చెరువులో దొరికినై. "ఆహాహా!" అనుకున్నది. ఇంతలో ఒక ఉడతపిల్ల కనిపించింది నక్కకు.

"ఏం-తాతా ఇలా వచ్చావు ?" అన్నది ఉడతపిల్ల.

"ఓరి నీయిల్లు బంగారం గానూ-నువ్వట్రా? ఔరా చూడూ-స్వర్గం అంటారు-అంటే ఇదేనా?" అన్నది నక్క.

"ఎబ్బే-ఇది స్వర్గంకాదు. ఇంకా పో" అన్నది ఉడత.

'ఇదేదో ఈ చోటే ఇంత హాయిగా వుంటే, ఆ స్వర్గం ఇంకా ఎంత హాయిగా వుంటుందో' అనుకుని బయల్దేరింది నక్క.

వెళ్లగావెళ్లగా ఒక వూరు ఎదురైంది. అంతకు పూర్వం నక్కకు 'వూరు' అంటే తెలీదు. దానికి ఆవూరు అంతా చాలా వింతగా అబ్బురంగా కనిపించింది. ఏదో యిల్లూ, మనుషులూ, బళ్లూ-వీధులూ అవన్నీ చూసి 'ఇదేనన్నమాట స్వర్గం' అనుకున్నది. ఇంతలో దానికంట ఓచిరుకప్ప పడ్డది. "బుల్లోడా! స్వర్గం అంటే ఇదేనా ఏమిటి?" అన్నది.

"ఛీఛీ-ఇదేం స్వర్గం నామొహం. ఇంకా పో." అన్నది చిరుకప్ప. నక్కకు ఆశ్చర్యం వేసింది. 'ఇదేమిటి-ఈచోటు ఇంత హాయిగా చక్కగా అందంగావుంటే-ఇదీ స్వర్గం కాదూ! ఐతే, ఆస్వర్గం ఇంకా ఎంత గొప్పదో అనుకుంటూ ముందుకు పోసాగింది నక్క.

ఆవూళ్లోకి పోనుపోను ఒకచోట దానికి పెద్ద భవనం ఎదురైంది. ఆ భవనం చాలా ఎత్తునవుండి-అందంగా కలకలలాడుతున్నది. అంతటా పూలమొక్కలు చెట్లూ-ఏమిటో రంగురంగులుగా కనిపిస్తునై. "ఇదా స్వర్గం - ఎంత బావుంది" అనుకుని చుట్టూ కళ్లు తెరచుకుని ఆశ్చర్యంగా చూడసాగింది నక్క.

ఇంతలో దానికి ఒక చిలక కూయటం వినిపించింది, అటూయిటూ ఆత్రంగా చూడసాగింది. ఆచిలక "అటూయిటూ చూస్తావేం-నీతల పైకెత్తి చూడు!" అన్నది. నక్క మోరపైకెత్తి చూడగా దానికి చిలక కనిపించింది. ఐతే అది ఎందులోనోవుంది - దానిచుట్టూ ఏదో చువ్వలు బిగించబడి వున్నై.

"ఓహో-ఏం అదృష్టం తల్లీనీది! ఎన్నాళ్లాయి వుంటున్నావు ఇక్కడ?" అని బంధువు ప్రశ్నించినట్టు అడిగింది నక్క.

"పుట్టుకనుంచీ ఇక్కడే!" అన్నది చిలక.

"వెధవబ్రతుకులు మావి. ఎంత అదృష్టం చేసుకుని పుట్టావో-అవును గాని-అదేమిటి అందులోవున్నావు!" అన్నది నక్క.

"పంజరం" అంది చిలక.

"పంజరం అంటే?"

"చూస్తున్నావుగా - బందిఖానా. నాకు నీలాగా స్వేచ్ఛా ఏమన్నానా-ఇందులోపడి ఏడుస్తున్నాను. ఆ అడవుల్లో, చెట్లనీడల్లో ఎంత హాయిగా వుంటున్నావో కదా!" అంది కన్నీరు కారుస్తూ ఆచిలక.

"ఆమాటకు నక్క గొల్లున నవ్వి-" చిలకలాంటి దానివి-నీకేం వొచ్చె? నిక్షేపంగా వున్నావు. స్వర్గంలోవుంటూ ఏడుపేమిటి?... స్వర్గమో స్వర్గమో అని కలవరిస్తూ చస్తున్నా నేను!" అన్నది.

"చూశావుగా స్వర్గం-ఇదీస్వర్గం. ఈ బందిఖానానే నాకు స్వర్గం. నా బ్రతుక్కేం ఎట్లా గూకాలిపోయింది గాని-నీమాట చూసుకో. ఎవడన్నా చూశాడంటే, అమాంతం కాల్చి పారేస్తాడు!"

"కాల్చి పారేస్తాడూ! ఏం-స్వర్గంలోకూడా కాలుస్తారాయేం?" అన్నది నక్క ఆత్రుతగా.

"అమాయకుడవయ్యా నువ్వు. ఇది స్వర్గం అనుకుంటున్నావా - కాదు-నరకం! త్వరగా ఇక్కడనుంచి పారిపో. ఈవూరు దాటి, అక్కడ అడుగు చెబుతారు. నా మాట విను! పో" అన్నది చిలక ఆత్రంగా. నక్కకు పంచప్రాణాలూ ఎగిరిపోయినట్టు ఐపోయినై. ఇదీ స్వర్గంకాదా-పైగా ఇక్కడనుంచి పారిపోవాలా!- మారు మాటాడకుండా నక్క బయటకు పరుగెత్తి పారిపోయింది.

నక్కకు విసుగుపుట్టింది. ఇదేమిటి-ఏదిచూచినా స్వర్గం కాదుట-అది యింకా ఎంతదూరమో ఏం ఖర్మమో! కానీ చూతాం. ఆ స్వర్గంలోనే జీవితాంతమూ వీలయితే పడివుంటా' అనుకుని నక్క వూరు దాటి, మరో అరణ్యం చేరుకున్నది. ఆరాత్రి తెల్లవారేదాకా, ఓచెట్టు క్రింద నిద్రపోయి మళ్లీ బయల్దేరింది.

కొంతదూరం పోయేసరికి దానికి ఒకమునీశ్వరుడు తపస్సు చేసుకుంటూ కనిపించాడు! 'స్వర్గానికి పోవాలంటే ఇతన్ని అడిగితే ఇంకా ఎంతదూరం వుందో చెబుతాడు' అనుకుని ప్రక్కనేవున్న నదిలో స్నానంచేసి శుచిగావచ్చి-

"నమస్కారం, మునీశ్వరా!" అన్నది నక్క.

ఆయన కళ్లు తెరచి "ఎవరది? ఏంకావాలి?" అని అడిగాడు.

"నేను నైమిశారణ్యంనుంచి వస్తున్నాను ప్రభూ. స్వర్గానికి

# యాత్రానందం

[దక్షిణాదిలో ఒకానొక నగరంలోని హోటలు. కుటుంబాలకోసం ప్రత్యేకించబడిన ఒకగదిలో యాత్రికులు నలుగురూ కుర్చీల్లో కూర్చున్నారు]

రా: పైపై మెరుగుల్ని బట్టి చూస్తే యిదొక దివ్యమైన హోటల్లాకనిపిస్తోంది. చప్పనికూరలు తిని చవిచెడిపోయిన నాలుకకు కొంచెం కారంతగిలితే బాగుంటును. ఏమంటావు గోపాలం!

గో: నా కంతటి దురాశ లేదు రామారావ్! కడుపులో కాకులు తిర్వేస్తున్నాయ్. తినదగిందేది దొరికినా చాలు.

జా: దొరికినట్టేవుంది! హోటల్లో అయ్యరుకి తెలుగుమాటలు అర్థమైతే అప్పటిమాట! ఐనా మగ

> **పాత్రలు:**
> రామారావు
> జానకి—అతడిభార్య
> గోపాలం
> రుక్మిణి—అతడిభార్య
> వైటర్
> దంతవైద్యుడు

వాళ్లు మీరైనా నాలుగు అరవ మాటలు నేర్చిపెట్టుకునివుంటే యిప్పుడింత చిక్కుండేది కాదండీ!

రా: చిక్కులకేమిటే జానకీ! లోకంలో ఎన్ని చిక్కులున్నాయో

**పంచరాంతకం**
**రాజారాం**

అన్నిఉపాయాలూ వుండిటియరాయి

గో: రక్షించావు రామారావ్! నీ బుర్రకేదో ఉపాయం తట్టిందన్నమాట!

రా: బుర్రంటూ వుంటే ఉపాయాలకేం తక్కువ గోపాలం! తెలుగుభాష తమిళులకీ, తమిళం తెలుగువాళ్లకీ అర్థంకాకపోవచ్చు. కానీ ఉత్తరధృవంలో ఎస్కిమోల దగ్గరనుంచీ, మధ్య ఆఫ్రికాలో పిగ్మీల వరకూ అర్థమయ్యే భాష ఒకటుంది.

రు: ఏమిటన్నయ్యా అది?

రా: అదే సైగల భాష!

గో: ఊరుకోవయ్యా, రామారావ్! అంతకంటె మంచి పద్ధతి లేకపోలేదు.

రా: ఏమిటది?

గో: ఏముంది! నువ్వేం కావాలనుకుంటే, దాన్ని బొమ్మగా కాగితంపైన గీచేయడమన్నమాట!

రా: ఓహోహో, చిత్రలేఖనమా! కానీ ఇందులోనూ చిక్కు లేకపోలేదు గోపాలం! నువ్వేదైతే కావాలనుకుంటావో, సరిగ్గా దానిలాగే బొమ్మ గీయాలికదా!

గో: అవునుమరి! తెలుగులో 'ఆవు' అంటాం. అరవంలో 'మాడు' అంటారు. ఆవు అంటే అరవవాళ్ళకీ, 'మాడు' అంటే ఆంధ్రులకీ అర్థంకాకపోవచ్చు. కానీ మాటలు కట్టిపెట్టి బొమ్మ గీచేస్తే! నాకు తెలిసినంతవరకూ విజయ

## ★ నాకలోకం ★

పోతున్నాను. ఆస్వర్గం ఇంకా ఎంత దూరంవుందో-ఎట్లా పోవాలోకాస్త చెప్పి పుణ్యంకట్టుకోండి మహాశయా!" అన్నది నక్క.

ఈమాటకు మునీశ్వరుడికి ఎక్కడలేని నవ్వొచ్చింది.

"ఓసి నీ ఆశకూలిపోనూ! స్వర్గానికే పోదామనుకుంటున్నావా - స్వర్గం అంటె ఎక్కడో వుందనుకున్నావా ఎన్ని పుణ్యాలు చెయ్యాలి-ఎంత గొప్పవాడుకావాలి స్వర్గం అంటె అంత సులభం అని నీవుద్దేశమా! ఐనా - సాధారణమైన నక్కవు నువ్వెక్కడ నాకలోకమెక్కడ - పోపో - లేనిపోని ఆశలు పెట్టుకుని ఆకాశానికి అర్రులు చాచకు. నువ్వు ఎక్కడ వుంటున్నావో దాన్నే స్వర్గంగా చేసుకుని బ్రతుకు." అని మునీశ్వరుడు ఆ నక్కను మందలించి ఇంటికి పంపించేశాడు. చేసేదిలేక, నక్క తన బారియకుపోయి "వున్నదాల్లోనే స్వర్గం" అనుకుని జీవించ సాగింది!

★

ాడలో గోవూ. తంజావూరులో ీవు ఒకమాదిరిగానే వున్నాయి.

రా: ఆవులసంగతి సరే గోపాలం! కానీ నీ చిత్రలేఖనాన్ని గురించే నాకు భయం!

గో: ఇన్సల్ట్! అమ్మాయ్, జానకీ! నాకు డ్రాయింగు చేతగాదని రామారావు నమ్మకం! అంతెందుకు రామారావ్! నీ కిప్పుడేం కావాలో చెప్పు.

రా: నాకు దున్నపోతు కావాలి.

జా: మీరున్నూ, మీ వేళా కోళాలున్నూ! ఐనా దేనికీ వేళాపాళా ఉండాలండీ!

గో: అదికాదులే అమ్మాయ్! నేను దున్నపోతుబొమ్మ గీయలేనని మీవారి ఉద్దేశం. ఎంతసేపు? ఒక నిమిషం. (బొమ్మగీచి సగర్వంగా ప్రదర్శిస్తూ) యిప్పుడేమంటారు.

రా: ఉండుండు గోపాలం! ఏం రుక్మిణమ్మా, ఇది బొత్తిగా గాడిదలా కనిపించడంలేదుగదూ!

గో: అదేమిటి రామారావ్! ముమ్మూర్తులా ఇది దున్నపోతులా కనిపిస్తుంటేనూ! ఇవిగో కొమ్ములు.

రా: ఐతే నువ్విప్పటికికూడా విజయవాడ దున్నపోతు, తంజావూరు మహిషమూ ఒకేవిధంగా ఉంటాయని అనుకుంటున్నావా గోపాలం! ఇది తంజావూరు మహిషరాజమైతే కావచ్చు! కానీ తెలుగు దేశంలోమట్టుకు ఇలాంటి దున్నపోతును చూచినట్టు నాకు జ్ఞాపకం లేదు.

జా: పోనీలెండి! ఇప్పుడు మనకు ఆహార పదార్థంలాంటి దేదైనా కావాలి.

రా: ఐతే దున్నపోతుల గొడవ కట్టిపెట్టమంటావు! చూడు, గోపాలం! మొదట స్వీట్స్ తెప్పించు.

గో: స్వీట్స్! ఏంస్వీట్ కావాలి? లడ్డు, జిలేబీ, హల్వా...

జా: మైసూరుపాకు బాగుంటుందండీ!

గో: అలా చెప్పాలి...ఐపోయింది రామారావ్! నాలుగు మైసూరుపాకులు వరుసగా చిత్రించేశాను. కాలింగ్ బెల్ నొక్కుమరి!

 యాత్రానందం 

రా: (కాలింగ్ బెల్ నొక్కుతాడు)

(వెయిటర్ ప్రవేశించగానే గోపాలం కాగితాన్ని అతని కందజేసి కుర్చీలోనిటారుగా కూర్చుంటాడు. వెయిటరు మొదట తెల్లబోయి తర్వాత అంతా ఆకళించుకున్నట్టు తల పంకిస్తూ బయటికి వెళ్తాడు.)

గో: ఏమంటారు?

రు: వెయిటర్లు ఒక్కొక్కప్పుడు చాలా తెలివైనవాళ్ళుగా వుంటారు.

రా: అందులోనూ వీడు అఖండుడు. అల్లాటప్పాగాళ్ళు గోపాలం చిత్రకళని అర్థంచేసుకోలేరు.

జా: పోనీ ఆ వెయిటరువచ్చేలోగా మళ్ళీ ఏదైనా గీయగూడదా గోపాలం అన్నయ్యా!

రా: స్వీట్స్ తర్వాత సేవరీ ఎలాగూ వుండాలిమరి! పొటాటో చిప్స్ గీయగలవా గోపాలం!

గో: దున్నపోతుల్నే సునాయాసంగా గీచేస్తున్నానంటే పొటాటో చిప్స్ నాకేం లెక్క, జమా రామారావ్!

(వెయిటర్ ప్రవేశించి ఒక పళ్లెరాన్ని టేబుల్‌పైన ఉంచి వెళ్లిపోతాడు.)

రు: ఇదేమిటి!

జా: టికెట్లే రుక్మిణీ! మ్యాటినీకి నాలుగు టికెట్లు తెచ్చేశాడు. మైసూరుపాకు చిత్రాలు వాడికి టికెట్లులా కనిపించాయి గావును! ఓరి వీడికళ్లు పాడుగానూ!

రా: హతోస్మి! ఇంకేం చేయాలి?

గో: నువ్వున్నావుగా అదేదో సైగలభాష ఉందని!

రా: లేకేం, ఉంది! ఐతే గోపాలం, ఆ భాషను నమ్ముకుంటే మనం బోల్తాపడం.

రు: నాలుక పిడచగట్టుకపోతోందన్నయ్యా! మొదట కూల్‌డ్రింక్స్ దొరికితేగానీ ప్రాణం కుదుటపడదు!

రా: కూల్‌డ్రింక్సేగదా! (కాలింగ్ బెల్ నొక్కుతాడు.)

(వెయిటరు ప్రవేశించగానే రామారావు కుడిచేతి బొటనవ్రేలిని పెదవులకి తాకిస్తూ మిగిలిన వేళ్లని ముడిచి ఏదో సంజ్ఞ చేస్తాడు. వెయిటరు కొంతసేపు ఆలోచించి చరాలున నిష్క్రమిస్తాడు.)

రు: ఈసారి ఏం తెస్తాడో మరి! నీకు భయంగాలేదూ జానకీ!

రా: టికెట్లుమాత్రం తీసుకురాడులే రుక్మిణమ్మా!

గో: కానీ కూల్‌డ్రింక్సే తెస్తాడని నమ్మకం ఏముంది?

రా: చూడు గోపాలం! నీది పెద్ద త్రోవ అయినంతమాత్రాన నాదీ అంతేకావాలని ఎక్కడా లేదు. బుర్రవున్నవాడి కెవడికైనా సరే, నా సైగను చూస్తే మనం త్రాగడాని కేదో తెమ్మంటున్నామని అర్థంగాక మానదు. కూల్‌డ్రింక్స్ గాకపోయినా అతడీసారి కాఫీ అయినా తేవాలి.

(దంత వైద్యుడితో సహా ప్రవేశించిన వెయిటరు అతడికి రామారావుని చూపిస్తాడు. వైద్యుడు రామారావుదగ్గరికివెళ్ళి అతడి నోరు తెరవమని సైగచేస్తాడు. నిర్ఘాంతపోయిన రామారావు అప్రయత్నంగా నోరుతెరుస్తాడు. దంతవైద్యుడు నోటిని పరీక్షగా చూచి ఉన్నట్టుండి ఒక చిన్న సాధనం ఉపయోగించి రెండు పళ్ళను పైకి లాగేస్తాడు)

రా: అయ్యో, అయ్యో! ఏమిటయ్యా అఘాయిత్యం! నా పళ్ళెందుకు లాగేశావయ్యా బాబూ!

వెయి: అదేమిటండీ! పళ్ళని చూపించి నొప్పి పెడుతున్నట్టు సైగ చేశారే! నా కంతమాత్రం అర్థం కాదటండీ?

గో: ఓరి నీ అసాధ్యంకూలా! తెలుగు ధారాళంగా మాట్లాడేస్తున్నావే!

వెయి: నేనసలు తెలుగువాణ్ణేనండీ! పదేళ్ళకుముందు యిలా వచ్చేసి, యిక్కడే స్థిరపడిపోయాను.

రా: ఏడ్చినట్టుంది! ఇప్పుడు నా పళ్లు ఖరాబు చేసినందు కేమంటావ్?

వెయి: నన్నేం చేయమంటారండీ?

గో: నీ చేతనయిందేదో నువ్వు శక్తివంచన లేకుండా చేశావు. ఇప్పుడు నువ్వు చేయగలిగిందేమైనా వుంటే లోపలికి వెళ్ళి తక్షణం మాకు తినుబండారంలాంటి దేదైనా తెచ్చి పెట్టాలి! అంతే!

వెయి: క్షణంలో వస్తాను బాబూ! (నిష్క్రమిస్తాడు)

రా: ఐనా ముందరిపళ్ళు రెండూ లేకుండా ఎలా తినగలను గోపాలం?

గో: నాలుగైదు గాకుండా రెండంటే రెండు పళ్ళు మాత్రం పోయినందుకు సంతోషించాలి రామారావ్! ఇవన్నీ యాత్రానుభవాలు. చింతించి లాభంలేదు. ఊరుకో, ఊరుకో!

(తెర)

(థామస్ కెయిన్ ఆధారంగా)



# సినిమా

# ఉత్తమ చిత్రాలకు ప్రభుత్వ బహూమతులు

**1956** వ సంవత్సరపు చలనచిత్రాలలో "కాబూలీవాలా" అనే బెంగాలీ చిత్రానికి రాష్ట్రపతి సువర్ణ పతకం లభించింది. ఉత్తమ డాక్యుమెంటరీగా, ప్రభుత్వం పసుపున బిమల్ రాయ్ ప్రొడక్షన్స్ నిర్మించిన "గౌతమబుద్ధ"కు కూడా రాష్ట్రపతి సువర్ణపతకం ఇచ్చి గౌరవిస్తారు.

తెలుగుచిత్రాలలో విక్రం ప్రొడక్షన్స్ వారి 'తెనాలిరామకృష్ణ' ఉత్తమ తెలుగు చిత్రంగా రజతపతకంతో పాటు, అఖిలభారత స్థాయిలో ప్రశంసాపత్రాన్ని అందుకోవడం ఈ ఏడాది తెలుగు-చిత్రసీమకు ఆనందకరమైన వార్త. ఈ స్థాయిలో ప్రశంసాపత్రం అందుకొన్న మరో చిత్రం "బంధన్" (హిందీ.)

సాహసించి, బాక్సాఫీస్ స్టార్ వాల్యూ లేని నటులతో, కొత్తతరహా కథను తీసుకొని ప్రతిభావారు నిర్మించిన "ఏది నిజం?" ప్రాంతీయస్థాయిలో ప్రశంసాపత్రం అందుకొంది.

ప్రాంతీయస్థాయిలో రజతపతకాలు సంపాదించుకొన్నవి, బెంగాలీ (సువర్ణపతకం సంపాదించిన "కాబూలీవాలా"కే) తెలుగు చిత్రాలు మాత్రమే. హిందీ, తమిళ, కన్నడ, మలయాళ చిత్రాలు ఏవీ, ఈ పతకం ఇవ్వతగుస్థాయిలో లేవని కేంద్ర నిర్ణాయక సంఘం అభిప్రాయపడింది.

"బసంత్ బహార్" (హిందీ), 'కులదైవం' (తమిళం) 'మహాకవి గిరీష్‌చంద్ర' 'ఏక్ దిన్ రాత్రే' (జాగ్ తే రహో బెంగాలీ ప్రతి), "భక్తవిజయ" (కన్నడ)-చిత్రాలకు ప్రశంసాపత్రాలు ఇవ్వ నిశ్చయించారు.

డాక్యుమెంటరీలలో "ఖజురాహో"కూ, "తిరువాన్కూరులో ఒక గ్రామం" కూ ప్రశంసా పత్రాలు లభించాయి.

## పిల్లల చిత్రాలు

ప్రధాన మంత్రి పేరిట ఇచ్చే సువర్ణపతకం అందుకోవడానికి తగ్గ బాలల చిత్రం ఈ ఏడాదికూడా ఏదీలేదు. బాలచలనచిత్ర



నరసూవారి "భలేఅమ్మాయిలు"-చిత్రంలో గిరిజ.

## బహుమతు లందిన తెలుగు చిత్రాలు

విక్రం ప్రొడక్షన్స్ వారి "తెనాలి రామకృష్ణ". నిర్మాత, దర్శకుడు బి.ఎస్ రంగా. రచయిత సముద్రాల రాఘవాచార్య సంగీతం విశ్వనాథం, రామమూర్తి.

నాగేశ్వరరావు ఎన్.టి.రామారావు, నాగయ్య, ముక్కామల కృష్ణమూర్తి వంగర వెంకటసుబ్బయ్య, మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, భానుమతి, జమున సంధ్య, సురభి బాలసరస్వతినటించారు.

ప్రతిభావారి "ఏది నిజం?". నిర్మాత ఘంటసాల కృష్ణమూర్తి. దర్శకుడు ఎస్. బాలచందర్. రచన ఆత్రేయ, సంగీతం వేణు.

గుమ్మడి, సి.నాగభూషణం, వంగర, రమణారెడ్డి, జానకి, సి. హేమలత, కీ॥ శే॥ జోగారావు నటించారు.

మాడర్న్ థియేటర్స్ వారి "వీరకంకణం" లో జగ్గయ్య, జమున.

# ఉత్తమచిత్రాలకు ప్రభుత్వబహూమతులు

సంస్థ నిర్మించిన "జల్ దీప్"కు (హిందీ) మాత్రం ప్రశంసాపత్రం ఇస్తున్నారు.

కేంద్రనిర్ణాయక సంఘానికి శ్రీ సి. డి. దేశముఖ్ అధ్యక్షులు. శ్రీయుతులు ఎం. డి. భట్, డబ్ల్యు. ఎస్. క్రిష్ణస్వామినాయుడు, ప్రొ॥ ఎన్. కె. సిద్ధాంత, ఆర్. డి. సిన్హా దినకర్, ప్రొ॥ సయద్ నరుల్లా, కృష్ణ కృపాలనీ, డి. రామానుజం, అర్ధేందుముఖర్జీ ఎస్. ముఖర్జీ, శ్రీమతులు అమ్ముస్వామి నాథన్, సుచేతాకృపలానీ.



మొత్తం 54 చిత్రాలనుండి ఎన్నిక చేసిన ఎనిమిదింటిని వీరు చూచి నిర్ణయాలు చేశారు.

మద్రాసు ప్రాంతీయ సంఘంలో శ్రీయుతులు డబ్ల్యు. ఎస్. కె. నాయుడు (అధ్యక్షుడు), డా॥ ఎం. వరదరాజన్, రాయప్రోలు సుబ్బారావు, ఎ. రామయ్య, డా॥ ఎ. అయ్యప్పన్, ఎస్. ఎం. శ్రీరాములు నాయుడు, శ్రీమతి మంజుభాషిణీ ఉన్నారు.

## తెలుగు నటీనటుల ప్రయాణం

బహుమతిప్రదానం 28 వ తేదీన ఏర్పాటు అయింది. ఉత్తమ చిత్రాలను ఎన్నిక చేసి, సత్కరించేటప్పుడు ఆయా చిత్రాల నిర్మాతలతోపాటు, వాటి విజయానికి కారకులైన కళాకారులను కూడా సభకు ఆహ్వానించడం అవసరమన్న విషయాన్ని ప్రభుత్వం గుర్తించింది. అందుకని ఈసారి (ఇదే మనకి తొలిసారి) తెలుగు నటీనటులు ప్రభుత్వ ఆహ్వానాలను పురస్కరించుకుని ఢిల్లీ వెళ్లారు. "తెనాలి రామకృష్ణ" చిత్రం పేరిట దర్శక నిర్మాత బి. ఎస్. రంగాతోపాటు అందులో పాల్గొన్న నాగేశ్వరరావు, భానుమతి, జమున వెళ్ళారు. అలాగే "ఏది నిజం?" పేరిట, నిర్మాత ఘంటసాల కృష్ణమూర్తితో, దర్శకుడు ఎస్. బాలచందర్, నటుడు గుమ్మడి వెంకటేశ్వరరావు, నటి జానకి వెళ్లారు.

ఢిల్లీలో ఈ రెండు చిత్రాల ప్రదర్శన, అక్కడివారికి మన నటీనటులను పరిచయం చేయడం ఈ రూపేణా జరగడం ముదావహం.



## చిత్రసమీక్ష:

# సారథివారి 'పెద్దరికాలు'

సవాలక్షు సందేశాలు అందిచ్చే ఏర్పాటు పెట్టుకోకుండా ఒకేఒక్క మంచి ముక్కను చక్కగా, మనసుకు హత్తుకునేలా చెప్పడం మంచిపద్ధతి; చెప్పగలగడం ప్రతిభ.

"పెద్దరికాలు" (సారథి ఫిలింస్) చిత్రం దర్శకుడు తాపీచాణక్య, నిర్మాత రామకృష్ణ ప్రసాద్, అటువంటిప్రయత్నమేచేసి మంచి ఫలితం సాధించారు. అందుకు వారభినందనీయులు.

పెద్దరికం పేరిట తెచ్చుకున్న అహం



పెద్దరకం పెద్దరికం

కారంకొద్దీ, తోటిమనుషులను, వాళ్ల మనసులను హింసపెట్టిన ఒక భద్రయ్యమీద ఆయన భార్యాబిడ్డలే తిరుగుబాటు చేయడం ఇందులో ఇతివృత్తం. దీంట్లో కలిసి దీన్ని చిక్కులుపెట్టే 'ఉపవృత్తాలు' ఏమీ లేవు. ఎటొచ్చి ఈ చిన్నకథను పదహారువేల అడుగుల పొడుగు సాగదియ్యడానికి బాక్సాఫీస్ పగ్గాలుకట్టి లాగవలసి వచ్చింది. తత్ఫలితంగా కథ తెగినచోట్ల, అతుకులూ, అవి లేనిచోట్ల గతుకులూ ఏర్పడ్డాయి. "ఇప్పుడెందుకిది?" అనిపించే తరహాలో పాటలు వినబడ్డాయి; నృత్యాలు కనబడ్డాయి. హృదయాలను కదలించే సన్నివేశాలు కొన్ని మితిదాటిపోయి ప్రేక్షకుడిలో సానుభూతి బదులు ఉదాసీన భావాన్ని కలిగించేస్థితికి వచ్చాయి. కళని డబ్బులోకి తర్జుమా చేసినపుడు, గుర్తుంచుకోతగు సరిహద్దు రేఖలు, ఈ సన్నివేశాలలో లీలగా గోచరిస్తాయి.

మొత్తంమీద, చెప్పతగ్గ ఒక మంచికథను చెప్పుకోతగ్గినంత గొప్పగా దర్శకుడూ నటీనటులూ ఇందులో చిత్రించారు.

ఈ చిత్రం ఏప్రిల్ 25వ ఆంధ్రలో విడుదల అయింది. పత్రికల వారికి 21వ తేదీన భరణీస్టుడియో ప్రివ్యూ థియేటరులో చూపించారు.

డబ్బంటే చాలా ఇష్టం, బోలెడు పట్టుదలా ఉన్న భద్రయ్య ఒక పెద్ద భూఖామందు. అతని కొడుకు సత్యం కథాంతం వరకూ మతిమందుడు. నిజానికి కష్టజీవులు, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు మొదలైన విషయాల మీద అతనికి మంచి ఊహలు చాలా ఉన్నాయి. వాటి గురించి పొలంలో ఎలుగెత్తి పాడుతూ ఉంటాడు. కాని తండ్రి ఎదట మటుకు గళం పలకదు. తలుపు చాటున నిలబడి వాళ్ల నాన్న మీద కొప్పడుతు ఉంటాడు. సత్యానికి ఓ కొడుకు. రెండేళ్ల బిడ్డడు. అతని అభిప్రాయాలేమిటో తెలియవు గాని, తోచినపుడల్లా ఏడుస్తూ ఉంటాడు. సత్యం మావగారు శేషయ్యకి దారిద్ర్యం, దాన్నిమించిన అప్పులూ ఉన్నాయి. అప్పుచేసి పప్పుకూడు తినే తరహా మనిషి. పండుక్కి కూతుర్ని, మనవణ్ణి తీసుకెళ్ళి మురిసిపోతున్న ముహూర్తాన "అప్పులాడు" వచ్చి "నానా మాటలూ" అంటాడు. (నీ కూతురు పెళ్ళికోసం కాలం నాడు నేను నాలుగు వేలిచ్చాను. ఇప్పుడు నాకూతురు పెళ్ళికి డబ్బవసరంగా కావాలి.") 'రభస' చేస్తాడు. ("ఇలా చాలావాయిదాలయ్యాయి. కబుర్లు చెప్పి లాభం లేదు. నా అవసరం గడపకపోతే కోర్టు కెక్కుతాను") చివరకి తగాదా శ్రుతిమించడంతో, కూతురు అది భరించలేకపోతుంది." అప్పుడు—



ఫలితం బాష్పాంజలి

"తోరణం తెగినద్వారంలా ఆమె ముఖం శోభను కోల్పోతుంది. 'మూకుట్లో పిండి వంటలా' హృదయం వేగిపోతుంది. 'కత్తిపీటమీద కూరగాయలా' కడుపు తరుక్కుపోతుంది. దీపావళి బాణసంచాలా వెలిగిన ఆనందం అంతట్లోనే ఆరిపోతుంది.

అంతకుముందే క్రూర విధిరూపంలో



ధైర్యానికి పేదరికం

గుమ్మడి వెంకటేశ్వరరావు వచ్చి ఆమె వంక చూచినందుకు పర్యవసానాలన్నీ ఇలా కనబడతాయి. అక్కడితో ఆమెవంటినున్న నగలన్నీ (అత్తవారు పెట్టినవి) వలిచి తండ్రికిస్తుంది. గత్యంతరం లేక శేషయ్య వాటిని తాకట్టు పెట్టి అప్పటికి గట్టెక్కుతాడు. అయితే మర్నాడే భద్రయ్య ఇంటి నుండి కబురొస్తుంది. ఆయన కూతురుకు పెళ్ళి నిశ్చయించారు కాబట్టి తక్షణమే కోడల్ని పంపాల్సిందని. కోడలు నగలు లేకుండా వెళ్ళిన ఫలితంగా కొడుకు లేకుండా పుట్టింటికి తిరిగి వస్తుంది. భద్రయ్య అంతటి దుర్మార్గుడు. నగలు తెస్తేతప్ప గడప తొక్కద్దని శాసించి, మనవణ్ణి తన దగ్గరే ఉంచుకుని కోడల్ని వెళ్ళగొడతాడు. ఈ ఘట్టంలో, మందుడైన కుమారుడు ఉంటే ఏం చేసేవాడో మనం సుమారుగా ఊహించుకోవచ్చు. కేవలం డబ్బుకోసం అని, భార్యాబిడ్డల్ని విడదీసి భార్యని కాలితో తన్నిన దుర్మార్గుడు తండ్రే అయినా ఏ కుమారుడూ సహించడు. ఎదిరించి పోట్లాడలేక పోయినా, తన పెళ్లాం

బిడ్డల్ని తీసుకుని ఇల్లు విడిచిపోతాడు. అక్కడికి కథన్నా అయిపోవాలి, లేదా నిరుద్యోగ సమస్యతో కొత్త వృత్తిమన్నా ప్రారంభం కావాలి. చెబుతున్న కథకి ఇది పొసగదని, కథకులు, దర్శకులు ఆ కుమారుడికి ఈ ఘట్టంలో గైరు హాజరు వేయించారు. బహుశా ఆ సమయంలో అతగాడు పాలానికెళ్ళి స్వేచ్ఛాస్వాతంత్ర్యాల గురించి బృందగానం చేస్తూ ఉండవచ్చు. ఒక వేళ అలాగే అయినా, తిరుగుటపాలో పుట్టింటికెళ్తున్న కోడలు, పోతూపోతూ పొలంవేపు వెళ్లి భర్తకి జరిగిన కథ చెప్పి మరీ వెళ్ళొచ్చు.

అలాంటి ఏర్పాటేమీ లేక ఆమె పుట్టింటికీ, కథ ముందుకీ భారంగా సాగిపోవడం సంభవించింది.

ఆ తరవాత, భద్రయ్య కుమార్తె, కాపరానికెళ్లి మొగుడితో కొట్లాడి ఇంటికి రావడం, ఆమె పశ్చాత్తాపం చెందిన వేళకు, భద్రయ్య కుమారుడికి జ్ఞానోదయమై, తెగించి, తండ్రి నెదిరించి, భార్యను తెచ్చుకోవడానికి బయలుదేరి వెళ్లడం, ఈ లోపల నరహరి అనే మరొక దురాత్ముడు కథానాయికిని మోసగించి, బలాత్కరించ బోవడం జరుగుతాయి. సత్యం తన భార్య శీలాన్ని శంకిస్తాడు. (స్వేచ్ఛగా ఆలోచించి మాట్లాడడానికి అతని కదే తొలిసారి). చివరికి కొండల్లె వచ్చిన కష్టాలు మంచల్లె కరిగిపోతాయి. ఈ లోగా ప్రేక్షకుల హృదయాలూ కరిగిపోతాయి. ఈచలన చిత్రకారులు చెప్ప దలచిన విషయం మనసుకి బాగా హత్తుకుంటుంది.

కథలో లోపాలున్నా, చిత్రణ సుదీర్ఘంగా ఉన్నా ఈ ఫలితం లభించడానికి నటీనటుల కృషి చాలవరకు తోడ్పడింది. భద్రయ్యగా డా॥ గోవిందరాజు సుబ్బారావు, ఆయన భార్యగా హేమలత, నాయికీ నాయకులుగా అంజలి, జగ్గయ్య, దురాత్ముడుగా నరహరి, 'బంగారుతండ్రిగా' రేలంగి, చేరుమాళ్లు అడిపించగల శేషయ్యగా పెరుమాళ్ళు, సమర్థంగా నటించారు. డా॥ సుబ్బారావు నటన ఈ చిత్రానికి అక్షరాలా జీవం.

మొత్తంమీద అందరూ అతి సమర్థంగా నటించినా, కొన్ని సందర్భాలలో నటన అనే మాటకుబదులు అభినయం అన్న పదం స్ఫురిస్తుంది. పెరుమాళ్లు దైన్యాన్నీ శోకాన్నీ గొప్పగా ఒప్పించబోవడంలో మితి సంగతి విస్మరించాడు. అలా మితి దాటకుండా దాదాపు ఆద్యంతం అతి సహజంగా నటించినవారు అంజలి, గుమ్మడి వెంకటేశ్వరరావు. ఈ కథలో నాయకుడి వ్యక్తిత్వంలాగే, ఆపాత్ర రూపకల్పనకూడా నిర్బలంగా ఉంది. ఉన్న అవధిలో జగ్గయ్య తన లోపం లేకుండా నటించి ఆ పాత్రను నడిపాడు. అప్పులవాడుగా ఆర్. వి. కృష్ణమూర్తి పాత్ర చిన్నదే అయినా చక్కగా ఒప్పించాడు. భద్రయ్య భార్యగా హేమలత, కుమార్తెగా గిరిజ యథోచితంగా నటించారు.

ఈ చిత్రానికి కథను వార్ల చిరంజీవి, మాటలు తాపీ ధర్మారావు, పాటలు కొసరాజు వ్రాశారు. సంగీతదర్శకుడు వేణు. నృత్యాలు వి. జె. శర్మ. ఛాయాగ్రాహకుడు కమల్ ఘోష్.

ఇందులో పాటలూ నృత్యాలూ కథకు అతక లేదు. బరువైనఘట్టాల మధ్య విరామం కోసం ఏర్పాటు చేసిన వినోదకార్యక్రమాలు అనిపించాయి. రాగిణిచేసిన నృత్యం, దానికి ఆలంబనంగా, చరణానికో చెడ్డమనిషిని కొప్పడే ఆ పాటా కూడా 'రోజులు మారలేదనిపించే ఫక్కీలోనే ఉన్నాయి.

పాటలలో ఆర్. బాలసరస్వతి ముందర లాలిగా, తరవాత జాలిగా పాడిన జోలపాట చాల బావుంది. ఈ చిత్రానికి ఆపాట భూషణప్రాయం అనవచ్చు.

'పౌరాణికాలం' వచ్చినా, జానపదజాలం చుట్టుముట్టినా సాంఘిక చిత్రాలే నిర్మించే సారథీవారు ఇలాటి ప్రయోజనకరమైన చిత్రాలను నిర్మించడంలో ఇంతకన్న కట్టుదిట్టమైన పద్ధతులు అనుసరించి, ప్రయోజనాలు సాధించ పూనుకోవడం వాంఛనీయం.

★

భరణీవారి "వరుడుకావాలి" చిత్రంలో ప్రమీల.



భరణీవారి "వరుడుకావలెను" చిత్రంలో అమర్‌నాథ్, రామన్నపంతులు, భానుమతి.

# అదీ - ఇదీ

చలనచిత్ర నిర్మాణ కార్యక్రమంలోనూ డిస్ట్రిబ్యూషన్, ప్రదర్శనవిభాగాలలోనూ కట్టుదిట్టమైన పద్ధతులు ఆలోచించుకుని, వాటికి కట్టుబడివ్యాపారం, వ్యవహారంనడపాలని బొంబాయిలోనిర్మాతలు సంకల్పించారు. ఈ ప్రకారం, పరిశ్రమలోని ఈ మూడు శాఖలవారూ కలసికట్టుగా పనిచేస్తారు. తద్వారా, కథలకోసం పోటీలూ పేచీలూ రాకుండా నివారించడం డిస్ట్రిబ్యూషన్, ప్రదర్శన వ్యవహారాలలో అందరికీ ఆమోదయోగ్యం కాగల విధానాలు రూపొందించుకోవడం వంటి మంచిపనులు చేయాలని సంకల్పించారు. ఈ రకం ఏర్పాటు ప్రాంతీయ స్థాయిలోకూడా కట్టుదిట్టంగా జరుగడం చాలా అవసరం. సంఘాలూ సమాఖ్యలూ ఇక్కడా అక్కడా కూడా ఉన్నాయిగాని అవాంఛనీయమైన పోటీలు వాటిదారి నవి సాగుతూనే ఉన్నాయి. పోతే బొంబాయి చిత్రాలలాగ, ప్రాంతీయ చిత్రాలకు దేశవ్యాప్తమైన విపణిలేదు కాబట్టి, కొన్నాళ్ళ వరకైనా చిత్రాల విడుదలవంటి విషయాలలో కూడా సర్దుబాట్లకు ప్రయత్నాలుచేసి, నిష్కారణంగా ఒకరికొకరు పోటీపడే పరిస్థితులు తప్పించే అనుసంధానకర్తలూ సంస్థలూ కావాలి.

* * *

## తమ అభిమతం

"తమ దేశంలో తమ చిత్రాలే ప్రదర్శించడం అమెరికన్ల అభిమతం. దేశదేశాలా తమచిత్రాలే ప్రదర్శించాలన్నదికూడా వారిఅభిమతమే" అని ప్రముఖ ఫ్రెంచిదర్శకుడు జీన్ గ్రెమిలాన్ అన్నారు. ఫ్రెంచి చిత్రాలకుగల అంతర్జాతీయ విపణి గురించి చెబుతూ అమెరికాకు సంబంధించినవరకూ పరిస్థితి ఇలా ఉన్నదని ఆయన అన్నారు. యూరప్‌లోమాత్రం తమచిత్రాలకు మంచి మార్కెట్ ఉన్నదనీ ఇతర దేశాలతో కలిసికూడా కొన్ని చిత్రాలు నిర్మించడం తమ పరిశ్రమ అభివృద్ధికి దోహదం చేసిందనీ గ్రెమిలాన్ చెప్పారు. దూరప్రాచ్యదేశాలలో ఫ్రెంచి సంస్కృతిపై ఉపన్యసించ పర్యటిస్తూ ఆయన ఇటీవల బొంబాయి, కలకత్తా, ఢిల్లీ నగరాలకు వచ్చి వెళ్లారు. ఈ సందర్భంలో భారత ప్రభుత్వ ఫిలింస్ డివిజన్ వారు నిర్మించిన "ఖజురాహో", "తంజావూరు" "భరతనాట్యం" మొదలైన డాక్యుమెంటరీ చిత్రాలు చూచి ప్రశంసించారు.

ఫ్రెంచి కథా చిత్రాల గురించి ప్రస్తావిస్తూ, తమ దేశీయులు వాస్తవిక చిత్రణకు ప్రాధాన్యం ఇస్తున్నారనీ అయితే, ఇటాలియన్ కళాకారుల "నియోరియలిజం" ప్రభావం వీటిలో ఏమీ కనబడదని ఆయన చెప్పారు.

* * *

# సినిమా వార్తలు

సంగీతా పిక్చర్స్‌వారి తొలి కానుక "ఇంటి గుట్టు" వేదాంతం రాఘవయ్య దర్శకత్వాన తయారవుతోంది.

సావిత్రి, ఎన్. టి. రామారావు ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు. రేలంగి, గుమ్మడి, ఆర్. నాగేశ్వరరావు, పువ్వుల్లి, సూర్యకాంతం ప్రభృతులు పాల్గొంటున్నారు.

ఈ చిత్రానికి కథ, మాటలూ సదాశివ బ్రహ్మం, పాటలు మల్లాది రామకృష్ణ శాస్త్రి వ్రాస్తున్నారు. సంగీత దర్శకుడు ఎం. ఎస్. ప్రకాష్. ఇప్పటికి మూడు పాటలు రికార్డుచేశారు. వాటిలో రెండిటి చిత్రణకూడా పూర్తిఅయింది. మే రెండో వారంలో రెండో సెట్ పై పని ప్రారంభిస్తారు.

## భట్టి విక్రమార్క

పి. వి. వి. ఎస్. ఎం. ప్రొడక్షన్స్‌వారి "భట్టి విక్రమార్క" చిత్రం భారీసెట్స్‌లో వి. ఎస్. రెడ్డి దర్శకత్వాన తయారవుతోంది ఆయనే ఛాయాగ్రహణం కూడా నిర్వహిస్తున్నారు. మొన్న 19 వ తేదీన వాహినీలో 'సిద్ధుడి' గుహ సెట్ పై పని పూర్తిచేశారు. అందులో సిద్ధుడుగా ఎస్. వి. రంగారావు, శిష్యుడుగా రేలంగి నటించారు.

ఈ చిత్రంలో విక్రమార్కుడు ఎన్. టి. రామారావు; భట్టి గుమ్మడి వెంకటేశ్వరరావు. నాయకి భూమిక అంజలి నిర్వహిస్తున్నది. మరొక ముఖ్యనటి సంధ్య.

రచన పరశురాం. సంగీత దర్శకుడు పెండ్యాల. కళ : వాలి.

ఇప్పటికి నాలుగు పాటల రికార్డింగు, రెండు నృత్యాల చిత్రణ పూర్తి అయినదని నిర్మాత పి. వి. వి. సత్యనారాయణమూర్తి చెప్పారు. నృత్యాలలో ఒకటి పద్మిని ప్రియదర్శిని, మరొకటి లలితారావు చేశారు.

## 'దొంగలున్నారు జాగ్రత్త'

ప్రతిభవారు తమకొత్త చిత్రం "దొంగలున్నారు జాగ్రత్త"ను మేనెలలో విడుదల చేయడానికి సన్నాహాలు చేస్తున్నారు జి. వరలక్ష్మి, గిరిజ, హేమలత, జగ్గయ్య, గుమ్మడి, సి. ఎస్. ఆర్. శివరావు నటిస్తున్న ఈచిత్రం దర్శకుడు బి. ఎస్. ఆర్. రచయిత ఆత్రేయ.

## 'సువర్ణ సుందరి'

ఈ నెలలోనే పదవతేదీన విడుదల అవుతున్న చిత్రం అంజలి పిక్చర్స్‌వారి "సువర్ణసుందరి."

వేదాంతం రాఘవయ్య దర్శకత్వాన వీరు రోజుకు రెండు కాల్‌షీట్ల చొప్పున అతిచురుకుగా నిర్మాణం సాగిస్తున్నారు. మల్లాది రామకృష్ణశాస్త్రి గారు కట్టుదిట్టంగా అల్లిన జానపద గాథను ఇందులో చిత్రిస్తున్నారు. అంజలి, నాగేశ్వరరావు, రేలంగి, సి. ఎస్. ఆర్, రంగారావు, వరలక్ష్మి రాజసులోచన, ఇ. వి. సరోజ మొదలగు నటీనటులు పాల్గొంటున్నారు.

పుష్కలంగా నృత్యాలూ, పాటలూ సమకూర్చి, భారీ సెట్టింగులూ, మొదలైన వాటితో హుషారుగా ఈ చిత్రాన్ని రూపొందిస్తున్నారు. నృత్య దర్శకుడు వెంపటి సత్యం; సంగీత దర్శకుడు, నిర్మాత ఆదినారాయణ.

* * *

## కృష్ణ గారడీ

నందీ పిక్చర్స్‌వారి "కృష్ణ గారడీ" రేవతీలో వై. వి. రావు దర్శకత్వాన తయారవుతోంది. జగ్గయ్య, అమర్‌నాథ్, రేవతి,

## అదీ ఇదీ

ఆసియా చలన చిత్రోత్సవంలో ప్రదర్శనకై బసంత్ పిక్చర్స వారి "హాతింతాయ్" చిత్రాన్ని పంపిస్తున్నారు. ఇతఃపూర్వం, విశ్వభారతీ వారి "బసంత్ బహార్"ను, ఎ. వి. ఎం. వారి "చోరీ చోరీ" నీ పంపాలనుకున్నారు గాని ఇపుడు కారణాంతరాలవల్ల ఆ ఆలోచన విరమించుకున్నారట. ★



భారతీ ప్రొడక్షన్స్‌వారి "బభ్రువాహన" చిత్రానికి మొన్న ప్రారంభోత్సవం జరిగింది. (ఎడమనుండి వరుసగా)—సినీలిటో రాజు, సముద్రాల, పూర్ణా రామ్మూర్తి, కోటిరత్నం, రామస్వామిశెట్టి, జగన్మోహనరావు, చక్రపాణి, రాజసులోచన, నాగిరెడ్డి, రమణమూర్తి, త్రివిక్రమరావు, హనుమంతయ్య, యన్. టి. రామారావు, అరణి సత్యనారాయణ.



విశ్వభారతీ పిక్చర్స్ అనే కొత్త సంస్థకు ఇటీవల ప్రారంభోత్సవం జరిగింది. (ఎడమనుండి) సముద్రాల జూనియర్, కళాదర్శకుడు సూరన్న, ఆనంద్, "ముద్దుబిడ్డ" దర్శకుడు తిలక్, చిక్కాలిసేని, నిర్మాత శేషగిరిరావు, దర్శకుడు కోటయ్యాద్రిరావు, నటుడు చదలవాడ కుటుంబరావు.

సూర్యకళ, శివరావు నటిస్తున్నారు. రచన తాపీ ధర్మారావు. సంగీత దర్శకుడు పెండ్యాల. ఈ చిత్రం కన్నడంలో కూడా తయారవుతున్నది.

* * *

## చెంచులక్ష్మి

బి. ఎ. ఎస్. ప్రొడక్షన్స్‌వారి పౌరాణిక చిత్రం "చెంచులక్ష్మి"లో మహాలక్ష్మి భూమికను నర్తకి పద్మినికి ఒప్పగించారు. ఈ భూమికను ఇతఃపూర్వం భానుమతి నిర్వహించింది.

ఈ చిత్రంలో శ్రీమహావిష్ణువుగా నాగేశ్వరరావు నటిస్తున్నాడు.

* * *

## 'తోడికోడళ్లు' శతదినోత్సవాలు

19 వ తేదీ సాయంకాలం మద్రాసు సెంట్రల్ స్టేషన్ సినిమాలు తీసేవారితో కళకళలాడింది; చూసే వారితో కిటకిటలాడింది. అన్నపూర్ణా పిక్చర్స్ వారిద్వితీయ సాంఘిక చిత్రం "తోడికోడళ్ళు" శతదినోత్సవాలలో పాల్గొనడానికై ఆ చిత్రంలో పాల్గొన్న కళాకారులంతా ఆరోజు సాయంత్రం కలకత్తా మెయిలులో బయలుదేరి వెళ్ళారు. నిర్మాత డి. మధుసూదనరావు, దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు, నటీనటులు నాగేశ్వరరావు, రంగారావు, రేలంగి, జగ్గయ్య, సావిత్రి, సూర్యకాంతం నర్తకి రాజసులోచన ప్రభృతులంతా ఆబృందంలో ఉన్నారు.

వారి తొలి మజిలీ తెనాలి. (శ్రీ సత్యనారాయణ టాకీస్), తరువాత గుంటూరు (లక్ష్మి పిక్చర్ ప్యాలెస్), విజయవాడ మారుతీ సినిమా), విశాఖపట్టణం (ప్రభాత్) విజయనగరం (మినర్వా.)

అన్నపూర్ణా పిక్చర్స్ వారి ఈ రెండవ చిత్రం లాగే తొలికానుక "దొంగరాముడు" కూడా నూరురోజుల పండుగ చేసుకోవడం విదితమే)

"తోడికోడళ్ళు" తమిళ ప్రతి "ఎంగళ్ వీట్టు మహాలక్ష్మి" కూడా వారం పదిరోజులలో శతదినోత్సవాలు జరుపుకోబోతోంది.

* * *

## భారత ఫిలింఫెడరేషన్ కొత్త కార్యవర్గం

భారత ఫిలిం ఫెడరేషన్ వార్షిక సర్వసభ్య సమావేశం బొంబాయిలో జరిగింది. చలనచిత్ర పరిశ్రమ ప్రముఖుడు శ్రీ ఎం. బి. బిల్లిమోరియాను కొత్త సంవత్సరానికి అధ్యక్షుడుగా ఎన్నుకున్నారు. ఫిలిం నిర్మాతల గిల్డ్‌కు చెందిన శ్రీ ఎస్. ముఖర్జీ, దక్షిణభారత ఫిలిం వాణిజ్యమండలి పేరిట శ్రీ టి. ఆర్. సుందరం ఉపాధ్యక్షులుగాను థియేటర్ల సంఘం అధ్యక్షుడు శ్రీ బి. డి. బరూచా కోశాధికారిగాను ఎన్నికయారు.

ఈ కొత్త కార్యవర్గ సభ్యులు 37 గురిలోనూ దక్షిణప్రాంత ప్రతినిధులు పదిమంది ఉన్నారు. వారు: శ్రీయుతులు సుందర్‌లాల్ నహాతా, ఎ. వి. మెయ్యప్పన్, ఎ. రామయ్య, ఎస్. ఎం. శ్రీరాములు నాయుడు, కె. ఎస్. నారాయణ అయ్యంగార్, ఆర్. వి. గోవిందరాజులు, డి. రామానుజం, డి. పూర్ణచంద్రరావు, వై. వి. ఎస్. మూర్తి, టి. ఆర్. సుందరం. 

## చిత్ర నళినీయం

(9-వ పేజీ తరువాయి)

స్వభావం అలాటిదిగాదే పరధ్యానంగా యింట్లోకి వచ్చేసింది నళిని.

నాలుగు రోజులు పోయిన తర్వాత మధ్యాహ్నంపూట యేమీ తోచక నిద్రపోయి లేచి మంచినీళ్ళకని యింట్లోకి వస్తున్న నళినికి తండ్రి గదిలోంచి మాటలు విన్పించాయి. అందులో తనపేరు వినటం మూలాన నళిని ఆగిపోయింది. లోపల నాన్న, బామ్మ మాట్లాడుకుంటున్నారు. బామ్మ కాస్తబిగ్గరగానే యేడుస్తూ "దానికి పెళ్లి చెయ్యరా చెయ్యరా అంటేవిన్నావూ? ఇప్పుడుచూడు. ఇంక దానికి పెళ్లవుతుందా?" అంటోంది. ఏం అమ్మా. అవకయేం? ఇదుగో పిల్లాడికోసం చూస్తూనే వున్నాంగా! వచ్చిన పిల్లాడు దొరికితే యీ సంవత్సరం చేసేస్తానని చెబుతున్నాగా."

"అయ్యో ఏంచెయ్యటంరా నాయనా! అప్పటికే వూరంతా తెలిసిపోతే" బామ్మ ముక్కు చీదుతూ మళ్లా రాగాలాపన మొదలుపెట్టింది.



(12-వ పేజీ తరువాయి)

చేతిలోంచి ఒకనయాపైసాకలిపి, శ్రీమతి చేతికి రెండునయాపైసలిచ్చేశాడు.

"ఎందుకురా బాబూ నీడబ్బులోంచి తీసిచ్చావు?" బెంగముహం పెట్టింది శ్రీమతి.

"మట్టిబుర్ర!" అనేసి యిక చేతికర్రతో ప్రవేటు చెబుతుందిగాబోలు అలా అన్నందుకు అని చప్పున నాప్రక్కకు గెంతుకున్నాడువాడు. "నావద్ద రెండుకాణీలు వుండినయి. వాటిరెంటికీ నరసయ్యతాత నాలుగునయాపైసలిచ్చాడు. నీకు ఒకటి యిచ్చానుఅనుకో. ఇక మూడునయాపైసలున్నాయిగదా నాఅర్థణాకూను. పట్టికలో చూడు అర్థణాకెన్ని నయాపైసలో." పట్టిక మీదికి వేలుచూపుతూ శ్రీమతివేపు కళ్ళు మిటకరించాడు వాడు.

"అర్థణాకు మూడునయాపైసలే!"అంటూ ఆశ్చర్యపోయేసింది శ్రీమతి.

వాడి తెలివికి నాకులోరి నరసయ్య, నేను దిగ్భ్రమగా నుంచుండి పోయాము— ఎలాంటికేసును ఎంతసూక్ష్మంగా తీర్పు చేశాడు అనుకుంటూ. నళిని ఏమిటా అని అయోమయంగా చూస్తూ నుంచుంది అందరి ముహాల్లోకీ.

"అబుడతడు మేలండీ మీకన్నా, చదివినవాడిపైన చాకలాడు మెరుగట." నరసయ్య వెళ్ళిపోయాక తనపుత్రుని తెలివితేటల్ని ఆశరాగా చేసుకుని నామీద చెణుకులువిసరడం ప్రారంభించింది శ్రీమతి. "మీకామాత్రం యుక్తిలేదు."

"ఏడిశావు." బాబు తెలివికి నాలో నేను కూడా సంబరపడినా (వాడు నాకూ సుపుత్రుడే కనుక!) ఆడాళ్ల ముందు అలుసయిపోవడం సహించలేక ప్రారంభించాను. "నావద్దకూడా రెండు కాణీలు వుంటే, నేనూ ఆ పనే చేసివుండేవాడిని." అలా మాటవరసకు అన్నానేకాని అసలు సంగతి నాకూ తెలుసు. నేనే కనుక రెండుకాసులు తీసుకెళ్ళి "నరసయ్యా! నాలుగు నయాపైసలు యివ్వవయా!" అనివుంటే "మన దేవూరయా? అర్థణాకు మూడేనయా!" అని ముహంమీదే అనివుండేవాడు నరసయ్య. చిన్నవాళ్ళు గనుక వాళ్లకు సరిపోయింది.

"ఆఁ!—ఆ మాత్రపు తెలివి మాకూ వుంది." నాకు ఏమాత్రమూ తగ్గిపోని నా శ్రీమతి మళ్లీ ప్రారంభించింది. "మీ వద్ద రెండు కాణీలే వుండివుంటే ఓ కాణీ తీసి అణాబొట్టు వాని ముహాన పడేసి ఈ రాద్ధాంతమే లేకుండా చూసివుండేదాణ్ణి. వెధవది చిల్లర లేక యింతవరకూ సాగింది." సవాలుగా తన తెలివిని ప్రకటించింది వంటగదిలోకి నడుతూ.

"అమ్మా! కాణీకి నయాపైసలివ్వవే" శ్రీమతి పమిట పట్టుకుంది నళిని.

"నాన్నా! కాణీకి నయాపైసలివ్వవూ?" అంగీ పుచ్చుకున్నాడు బాబు.

"ఎక్కడివిరా నీకు యిన్ని కాణీలు?" బాబు జేబులో గలగల లాడుతున్న కాణీల వేపు ఆశ్చర్యంగా చూశాను నేను.

"మరేమోనూ—మరేమోనూనాన్నారూ?" మొదలెట్టాడు వాడు. "పోయిన మంగళవారం అమ్మ ఓ బేడ యిచ్చింది మాకు. కొట్టుకు వెళ్లి దానికి నళిని, నేనూ కాణీలు తెచ్చుకున్నాము. రోజూ పాల రంగయ్య బాబాయి దగ్గరా, నరసయ్య తాతయ్యదగ్గర కాణీకి రెండేసి నయాపైసలు తీసుకుంటూ వుంటాము గదా. అలా నాలుగు కాణీలకు ఎనిమిది వస్తాయి. వాటినేమోను మళ్ళీ పేపరు తాతయ్యకి యిచ్చేసి ఎనిమిదింటికీ అణా కాణీ తీసుకుంటాము. దాంతో మాకు అణాకు కాణీ లాభం వస్తుందిగదా. వాటిని అలానే దాచుకుని ఆ కాణీకి చాకలెట్టో, పెప్పర్ మెంటో కొని తినేస్తాము." సంతోషంతో గంతులేస్తూ ప్రసంగం ముగించాడు బాబు.

"హారివెధవా! ప్రతీరోజూ పాలవాడి దగ్గర నయాపైసాలు మార్చుకోడం ఇదా మీ పని!!" బోలెడు ఆశ్చర్యపోయేసింది మా శ్రీమతి.

"25 శాతము లాభము. ఎక్సలెంటు." అంటూ యింకా ఆశ్చర్యపోయేశాను నేను.

"నయాపైసా నాణెమయా
లాభసాటి బేరమయా
బాలులంతా రండి భయ్యా!
కాణీలన్ని చేర్చుడయా
అణాకొక్క చాకలేటు
అమాంతముగ మిగులునయా."

చప్పట్లు చరుస్తూ నళిని, బాబు డాన్సు ప్రారంభించారు. "అహా! శ్రీమతీ!!" అంటూ వాళ్ళ తెలివితేటలకు ఆశ్చర్యాన్ని ఆపుకోలేక బిక్కముహం వేశాను నేను.

"కలికాలంగద స్వామీ!" అంటూ తృప్తి పడిపోయింది ముక్కుమీద వేలుంచుకున్న ఆ మంగళాంగి. ★

# చిత్రనళినీయం

"ఏమిటమ్మా అది! సరిగ్గా చెప్పు" తండ్రి కంఠంలో ఆదుర్దా విన్పిస్తోంది.

"ఏం చెప్పనురా బాబూ! యేనాడయినా వుందా? ఆ రాజగోపాలుని దయ మనమీద తప్పిందిరా నాయినా. ఊళ్ళో ప్రతివాళ్లూ అడగటమే."

"యేమిటమ్మా అది. నువ్వు చెప్పకుండా వూరికే యేడుస్తే నాకేం తెలుస్తుంది?" తండ్రి గర్జనకి నళిని హృదయం గజగజలాడింది, బామ్మ యేం చెబుతుందోనని. బామ్మ యేడుపును కాస్త ఆపి ఉత్తరాలటరా బాబూ! రోజూ మన నళినికి యెక్కడి నుంచో వస్తున్నాయట. అవేం వుత్తరాలో మరి భగవంతుడికి తెలియాలి. మనకి తెలియందే ఆ దిక్కుమాలిన వాళ్ళకి యెలా తెలిసిందో?" మళ్లా శ్రుతి సరిచేసుకుని రాగాలాపనకి ఉపక్రమించబోతుండగా "ఉత్తరాలు! యెక్కడి నుంచమ్మా" తండ్రి కంఠం కొంచెంగా కంపించింది.

"విశాఖపట్నం నుంచిటరా. అన్నీ వాళ్ళకెలా తెలిశాయో మరి?"

"విశాఖపట్నంనుంచే కదా అమ్మయ్య. నన్ను ఖంగారుపెట్టేశావే. అమ్మా విశాఖపట్నం నుంచయితే ఫర్వాలేదు. ఆ రాజగోపాలుని దయ మనమీద సరీగ్గానేవుంది. నువ్వేం భయపడ నవసరంలేదు. నిశ్చింతగా వుండు. దానిపెళ్లి సలక్షణంగానే అవుతుంది." నాన్నగారి కంఠంలో తేలిక కన్పించింది. నళినికి ఒక్కసారి విరగబడి నవ్వాలనిపించింది. కాని నవ్వలేకపోయింది. అక్కడ నిలబడలేక భారంగా అడుగులు వేసుకుంటూ తన గదిలోకి వెళ్ళిపోయింది. తనమీద యిలా ప్రచారం అవుతోందన్నమాట. కమలావాళ్లెందుకు మానేశారో నళినికి సులభంగా అర్థమయింది. వెంటనే ఆవేశంతో చిత్రకు వుత్తరం వ్రాయటం మొదలుపెట్టింది. ★

[మిగతా కథ వచ్చేవారం]



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.

# చూడండి! సన్‌లైట్ సగంబిళ్ల మాత్రమే ఈ బట్టలన్నిటిని ఉతికింది!



## అట్లు చేసినట్టిది దాని అధికమైన నురగ

ఎంతో బాగుగా పనిచేయునట్టిది సన్‌లైట్ యొక్క అధికమైన నురగ, మీరు ఆశ్చర్యపడెదరు, సగం బిళ్లతోనే మీరు ఎన్ని బట్టలను ఉతికారో!

ప్రతి మురికి అణువును తొలగించివేయునట్టిదిన్ని — మీ బట్టలను అద్భుతమైన తెలుపుగాను, కాంతివంతముగాను చేయునట్టిదిన్ని, సన్‌లైట్ యొక్క అధికమైన నురగ; మీరు బట్టలను బాదకుండానే శుభ్రపర్చునట్టిది సన్‌లైట్ యొక్క అధికమైన నురగ, అనగా మీ బట్టలు చాలా కాలము మన్నగలవు.




భారతదేశంలో తయారుచేయబడినది

## సన్‌లైట్ సబ్బు బట్టలను తెల్లగాను కాంతివంతముగాను, ఉతుకును

S. 243-X52 TL